




Cream of Creams




రాయలసీమ

**THRUPTHI ASSOCIATES**

Plot No.F-9, Industrial Estate, Proddatur-516 362.
Kadapa Dt., A.P. Tel. 08564-250636 Fax : 08564-258465

కోస్తా ఆంధ్రా

**THRUPTHI FOODS**

Depo II - D.No. 1-3/18-35, Vidyadharapuram,
Vijayawada. Tel. 0866-6530156, Cell. 9849991235

తెలంగాణా

**THRUPTHI MARKETING**

Depot : D.No. 138, Sri Krupa Market, Malakpet,
Hyderabad-36. Tel. 040 - 65181115 Cell.9849991257

JOY మిత్రులకు, శ్రేయోభిలాషులకు దసరా శుభాకాంక్షలు

ఆంధ్రప్రదేశ్ అంతటా ఐస్‌క్రీమ్ సరఫరా చేయువారు

# THRUPTHI FROZEN FOODS

WANTED
DISTRIBUTOTRS
(డిస్ట్రిబ్యూటర్స్ లేని ప్రాంతాలలో)

visit us: www.thrupthijoyicecreams.com

# విపుల ఆహ్వానము

# అనువాద కథలకు



సుతిమెత్తని సంవేదనలు
అనురాగభరిత ఆత్మ నివేదనలు
ఉత్కంఠభరిత కథన వేగాలు
ఉత్తేజపూరిత చైతన్య ప్రవాహాలు

## ప్రపంచ సాహిత్యంలో కోకొల్లలు

సమకాలీనమై మీ మనసును మురిపించి, మైమరపించిన
అన్య భాషల కథలను తెలుగు పాఠకులకు అందించండి,

**అనువాదం సరళంగా, ఆకట్టుకునేలా ఉంటే**
**విపుల మీకు వారధిగా నిలుస్తుంది.**

---

అనువాద రచనల పూర్తి వివరాలతోపాటు, మూలభాషా రచయితల నుంచి పొందిన అనుమతి పత్రం, స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరు జతచేయండి. మూల రచయితల నుంచి అనువాదకులు తగిన అనుమతి పొందలేని సందర్భాలలో మేమే అనుమతి పొందగలం. మీ కథ మాత్రం ఎనిమిది పేజీలకు మించకుండా ఉండాలి.

---

*రచనలు పంపవలసిన చిరునామా*

సంపాదకుడు
విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.

నవ్య నవలా వేదిక

# చతుర

సంపుటి - 30
సంచిక - 9
అక్టోబరు 2007
357వ సంచిక



భర్త అదృశ్యం వెనుక
రహస్యాన్ని ఛేదించి,
తనజీవితంలో
చెలరేగిన సంక్షోభానికి
ఓ సాధారణ గ్రామీణ
యువతి ఎలా
ముగింపు పలికిందో
తెలియచెప్పిన
వినూత్న, విలక్షణ
రచయిత
డాక్టర్ కేశవరెడ్డి
నవల
## మునెమ్మ

10 వ పేజీలో

బొమ్మలు: పిలిశెట్టి

ముఖచిత్రం : **అర్చన**
ఫొటో : జయకృష్ణ



110 సం॥ల భూత,భవిష్యద్వర్తమాన శతాబ్ది పంచాంగ రచయిత

# పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతి గారి

శ్రీ సర్వధారినామ సంవత్సర 2008-2009

# గంటల పంచాంగము

త్వరలో విడుదల అన్ని బుక్ షాపులందు లభించును

## గ్రహ-శాంతి యంత్రములు మంత్రకవచములు

అనేక కష్టనష్టముల నుండి తొలగించి రక్షించును ఇవి శరీరమందు ధరించు తావీదు యంత్రములు

1. నవగ్రహ శాంతి యంత్రం
2. సర్వజన వశీకరణ యంత్రం
3. జయవశీకరణ యంత్రం
4. సరస్వతి యంత్రం
5. మహాలక్ష్మి యంత్రం
6. వివాహ యంత్రం
7. సంతాన యంత్రం
8. భార్యాభర్తల మైత్రికి
9. సుఖ ప్రసూతి యంత్రం
10. ఉద్యోగ ప్రాప్తియంత్రం
11. వ్యాపారాభివృద్ధి యంత్రం
12. మహాశూలిని యంత్రం
13. రోగనివారణ యంత్రం
14. శనిదోష యంత్రం
15. నరఘోష యంత్రం

పై స్పెషల్ వెండి యంత్రములు ఒక్కొక్కటి పంపుటకు రూ.200/-లు అగును. సొమ్ము ముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము

## మీ యింట యంత్రస్థాపనచేయండి! సకల సిరులు పొందండి!

1. శ్రీ మహాలక్ష్మి యంత్రం
2. శ్రీచక్రరాజ యంత్రం
3. శ్రీ మత్స్య యంత్రం
4. శ్రీ నరఘోష యంత్రం
5. శ్రీ ధనాకర్షణ యంత్రం
6. శ్రీ కుభేర యంత్రం
7. శ్రీ ఆంజనేయ యంత్రం
8. శ్రీ లక్ష్మిగణపతి యంత్రం

ఈ యంత్రం ఒక్కొక్కటి 5X5 అం॥లు సైజు రాగి రేకుపైచేసిపూజించిపంపుటకు రూ.350-/లు అగును. సొమ్ముముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము.


## బుట్టే వీరభద్ర దైవజ్ఞ

తిలక్ రోడ్, రాజమండ్రి - 3 , ఫోన్ (0883) 2469631

E-mail : bvb_divagna@rediffmail.com

# కార్ఖానాల్లో మగ్గే జీవితాలకు ప్రతిబింబం

# కార్మిక గీతం



**ఎనభయ్యో దశకంలో వచ్చిన కొన్ని మంచి నవలల్లో 'కార్మిక గీతం' ఒకటి. యంత్రభూతముల కోరలు తోముతూ కార్ఖానాలలో మగ్గే కార్మికసోదరుల బాధలూ.. గాథలే ఈ గీతానికి పల్లవి.. అనుపల్లవి.. చరణాలు అన్నీ! ఊహాస్వర్గాల పోహాళింపులు.. వ్యాపార జిమ్మిక్కుల తాళింపులు.. మసాలాలకు అతీతంగా అక్కినేని కుటుంబరావు వాస్తవిక దృక్పథంతో రాశారు దీన్ని. కార్మికలోకంలోని వెలుగు చీకట్లను యథాతథంగా వెలికి తీసిన 'కార్మిక గీతం' కథవెనుక కథ రచయిత మాటల్లోనే చదవండి..**

'కార్మిక గీతం' నవలని నాలుగైదు సంవత్సరాలపాటు రాశాను. 1987 మే లో ప్రచురించాను. రాసింది నాలుగైదేళ్లయినా ఆ నవలకి బీజం మరో యిరవై ఏళ్లక్రితమే పడిందని చెప్పవచ్చు. 1963లో నా పదహారో ఏట సనత్‌నగర్‌లో ఓ కార్మికుడిగా జీవితం ప్రారంభించాను. రోజుకు రెండు రూపాయల జీతం. నాకన్నా బరువైన సిలిండర్లను సనత్‌నగర్ రైల్వే స్టేషన్ నుంచి సనత్‌నగర్ గేటు దగ్గరున్న కంపెనీకి భుజాలపై మోసుకురావడం, గ్యాస్‌తో నిండిన సిలిండర్లని లారీలో లోడ్‌చేయడం నా పని! ఈ పనిలో నాతోపాటు మరికొందరు కార్మికులు పాల్గొనేవారు. వాళ్లంతా వయసులో పెద్దవాళ్లు.. చదువురానివాళ్లును. నేను ఎస్సెల్సీ పాసైన తరువాత పైచదువుకి డబ్బుల్లేక వచ్చి ఈ పనిలో చేరాను. అప్పట్నుంచీ నా కళ్లముందే పెరిగిన సనత్‌నగర్, బాలానగర్, మౌలాలీ, పటాన్‌చెరు, జీడిమెట్ల పారిశ్రామికవాడలు.. పరిశ్రమలు కార్మికులు, యాజమాన్యాలు, యూనియన్లు, లీడర్లు... వీటన్నింటితో నాకు అనుబంధం. కార్మికుల పట్ల సానుభూతి. యాజమాన్యం ఓ పక్కా-దొంగలీడర్లు మరోపక్కా కార్మికులకు న్యాయంగా, చట్టబద్ధంగా రావాల్సిన కనీస సౌకర్యాల్ని కూడా రాకుండా చేయడం..

వారు తయారుచేసే పరికరాలు.. సంపద.. అన్నీ యాజమాన్యాలే దక్కించుకోవడం.. కార్మికుల కనీస అవసరాలు కూడా తీరని విధంగా జీతభత్యాలు చెల్లించడం.. అన్నీ స్వయంగా చూశాను.

మరోవైపు- ఐడిపిఎల్, హెచ్‌ఎంటీ, బిహెచ్ఇఎల్, ఇసిఐఎల్, బిడిఎల్ లాంటి పెద్దపెద్ద పబ్లిక్ సెక్టార్లు.. ఆ కంపెనీల్లో వర్కర్సుకి లభించే జీతభత్యాలు, బస్సులు, ఎల్టీసీలు, వైద్య సదుపాయాలు, క్వార్టర్లు యివన్నీ చూస్తూ-

ఒకేరకమైన పనీ, నైపుణ్యమూ వున్న కార్మికుల్లోనే వేరువేరు కంపెనీల్లో వేరుగా జీతాలు ఉండడం.. యిదంతా చాలా గందరగోళంగా వుండేది. ఆ రోజుల్లో నేను చూసిన, నాకు తెలిసిన, అనుభవించిన విషయాల గురించి కథలు రాస్తుండేవాడిని. అదేసమయంలో 'మార్క్సిజం'తో పరిచయమైంది. ఆ పుస్తకాలు చదవడం, ఆ సంస్థల్లో పనిచేయడం కార్మిక కర్షకులను చైతన్యపరిచే నాటకాలు వేయడం, పాటలు పాడడం.. యిలా సాగుతున్న జీవన క్రమంలో కార్మికులకు సంబంధించి స్వయంగా అనుభవించిన, పరిచయమున్న, తెలిసిన, విషయాలేగాక మరో మూడేళ్లపాటు రకరకాల కంపెనీల్లో పనులు చేసే కార్మికుల్ని కలిసి మాట్లాడి, నాయకులతో మాట్లాడి అందరి జీవితాల్ని దగ్గరగా చూసి 'కార్మిక గీతం' నవల రాయడం ప్రారంభించాను.

నేను అంతకుముందే రాయాలనుకుని నోట్ చేసుకున్న విషయాలూ, సేకరించిన విషయాలూ ఓ క్రమంలో పెట్టుకోవడానికి, నవలకో కథారూపం యివ్వడానికి చాలా శ్రమపడాల్సి వచ్చింది. అంతా అయ్యాక, నవల రాయడం పూర్తయ్యాక చూస్తే దాదాపు వెయ్యిపేజీల ఉద్గ్రంథం తయారైంది. ఈ రోజుల్లో వెయ్యిపేజీల నవల చదవడం ఎలా ఉన్నా ప్రచురించడం.. అదీ కార్మికుల నవల.. కుదరనిపని.

మళ్లీ మనోవేదనని, మథనాన్ని అనుభవించి.. ఆ వెయ్యిపేజీల్ని 280 పేజీలకు కుదించి పబ్లిష్ చేశాను. ఈ నవలలోని చాలా పాత్రలు నిజజీవితంలో నేనెరిగినవే. చాలా కంపెనీల్ని కలిపి రెండు ప్రధాన కంపెనీలుగా చేశాను. లీడర్లనూ ప్రవేశపెట్టాను.

ఏమీ చదువుకోకుండానే 'కంప్రెసర్'




చేసిన యాదగిరి, అతన్నలా తీర్చిదిద్దిన జాఫర్ నాదృష్టిలో దేవుళ్లు. నేను నాస్తికుడిననీ, దేవుడిని నమ్మననీ అనుకుంటారు గానీ జాఫర్, యాదగిరివంటి కార్మికులు.. మట్టి నుంచీ, యినుప ముక్కల్నించీ అద్భుతాల్ని పండించే కార్మిక, కర్షకులే.. నా దృష్టిలో దేవుళ్లు.

లక్షలకి లక్షలు వెచ్చించి విదేశాల్నుంచి

తెచ్చుకోవాల్సిన ఓ కంప్రెసర్ని 68 వేలల్లో అనుకున్న టైంలో చేసి, దాన్నిచూసి కావిలించుకుని ఏడుస్తూ నవ్విన యాదగిరిని గౌరవిస్తాను.. ప్రేమిస్తాను.. పూజిస్తాను.

అదేసమయంలో అలాంటి యాదగిరుల శ్రమఫలాల్ని దోచుకునే డబ్బున్న మారాజులను ద్వేషిస్తాను.

ఈ 'కార్మిక గీతం'లోని అశేష కార్మికులు, వారి జీవితాలు, కష్టాలు-సుఖాలు, సానుభూతులు మోసాలు, అన్నీ తెలుసు. కొన్ని స్వయంగా చూశాను.. అనుభవించాను.

ఈ నవల రాసినప్పటి పరిస్థితులూ నేటి పరిస్థితులూ వేరు. చాలా మారాయి. ముఖ్యంగా అప్పటి పెద్దపెద్ద కంపెనీలు, అనుబంధ సంస్థలూ మూతపడ్డాయి. కార్మికులు వీధినపడ్డారు. ఒకప్పుడు సనత్‌నగర్, బాలానగర్, పటాన్‌చెరు ఏరియాల్లోకి వెళ్తే కార్మికులతో.. వారి సైకిళ్లతో వారి నవ్వులతో కళకళలాడే ప్రాంతాలన్నీ నేడు పాడుపడి చూడ్డానికే భయంకరంగా వున్నాయి. అలా తయారవడానికి కారణం దూరదృష్టిలేని ప్రభుత్వాధినేతలూ దురాశాపరులైన అధిపతులూ.. శిక్షమాత్రం లక్షలాది కార్మిక కుటుంబాలకి.

మరో వింత పోకడ ఏమంటే- 1980లదాకా ఉన్న పనిగంటలు మాయమైపోయాయి. పనికి వెళ్లడానికేగానీ, తిరిగి రావడానికి టైం నిబంధనలేని పనిగంటలు, యూనియన్లులేని సాఫ్ట్‌వేర్ ఐటీ కంపెనీలు. ఏ హక్కులూ లేక భయం కత్తినెత్తిన వేళ్లాడే అయిందకెల జీతాల కొలువులు.. సంపాయించిన డబ్బునేంచేసుకోవాలో ఆలోచించడానికి, సంసారాలు చేసుకోడానికి తీరికలేని కొలువులు మరో కొత్త కార్మికగీతం రాయడానిక్కావాల్సినంత వస్తువు.

తెలుగులో వచ్చిన కార్మిక సాహిత్యం తక్కువ. నేను 'కార్మిక గీతం' రాసేనాటికి దాదాపు లేదనే చెప్పాలి. 1947 నుంచి 1963వరకూ కృష్ణాజిల్లాలోని ఒక గ్రామంలోని దళితుల జీవనస్థితిగతుల్ని వస్తువుగా దీసుకుని 'సొరాజ్జెం' నవల రాశాను. 1963 నుంచి 1987వరకూ నా కళ్లముందు పుట్టిపెరిగి స్వార్థపరులై భవిష్యద్దర్శనంలేని అధిపతుల, ప్రభుత్వాధినేతల బాధ్యతారాహిత్యానికి బలైపోయిన కార్మికుల గురించి 'కార్మిక గీతం' రాశాను. ఈ రెండు నవలల్నీ నేను ప్రేమించే కార్మిక కర్షక లోకానికి నేనిచ్చిన చిరుకానుకలుగా భావిస్తాను.

సేకరణ: చంద్రప్రతాప్

**చతుర సమీక్ష** | **అక్టోబరు '07 నవల 'మునెమ్మ'**

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________

(అక్టోబరు 25వ తేదీలోపు సమీక్షలు మాకు అందాలి)

# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

❖ త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!! ❖ చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, బట్టతల! నెరసిన జుట్టు!! ❖ ఉబ్బసం, ఎలర్జీ వ్యాధులు ❖ సంతానము లేని దంపతులకు సంతానోత్పత్తి కణాలు తక్కువగా ఉన్న మగవారికి కణాలలో కదలిక (Motility) లేనివారికి స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదల కాకపోవుట, అండవాహికలు (FALLOPIAN TUBES) ముడుచుకొని పోవుట, ఎండోమెట్రియాసిస్, ❖ అన్ని రకముల గర్భకోశ వ్యాధులకు రసాయన, వాజీకరణ పద్ధతుల ద్వారా చికిత్స చేయబడును. ❖ స్త్రీల తెలుపు, ఎరుపు వ్యాధులు, బహిష్టు నొప్పిరుతుక్రమము సక్రమముగా లేకపోవుట, ❖ గర్భాశయ వ్యాధులకు గర్భసంచి తీసివేయకుండా (ఆపరేషన్ లేకుండా) ❖ ఆకర్షణీయమైన అందమునకు మొటిమలు, నల్లని మచ్చలు, మంగు, పొడ పొక్కులు, ముడుతలు ❖ నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, నపుంసకత్వము (IMPOTENCY) రతిమధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు శుష్కించిపోవుట. ❖ సుఖవ్యాధులు, వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు, గనేరియా, సిఫిలిస్, గ్లీట్ షాంక్రాయిడ్, హెర్పిస్ (HERPES) ❖ స్తనముల బిగువుకు; జారిన (వాలిన) మెత్తని, చిన్నగానున్న స్తనముల సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. ❖ స్త్రీలకు పొత్తి కడుపుమీద గోకిన గీతలు, చారలు (SCRECH MARKS) పోవుటకు. ❖ మలబద్ధకము ❖ గ్యాస్ ట్రబుల్, ఎసిడిటి, అల్సర్స్, ❖ రక్త మొలలు, అర్శ మొలలు ఫిషర్స్, భగందరము (ఆపరేషన్ లేకుండా) ❖ చర్మవ్యాధులు, గజ్జి, జిల, దురద, ఎలర్జీ, దద్దుర్లు, తామర, చర్బీ, విసర్పి ❖ పులిపిర్లు, ఆనెలు ❖ సోరియాసిస్ (PSORIASIS) ❖ బొల్లి (LEUCODERMA) ❖ కుష్టు (LEPROSY) ❖ స్థూలకాయము (OBESITY) (NODIET, NOEXERCISE) సన్నగా, బలహీనముగా నుండువారు, బరువు, లావు పెరుగుటకు, (ఎత్తు పెరుగుటకు 21 వయస్సు లోపలవారు) ❖ మధు మేహము, షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) ❖ షుగురు వలన మానని గాయములు, పుండ్లు, అల్సర్స్, గాంగ్రిన్ వంటివి మాన్పించుటకు ❖ రక్తపోటు (BP)అల్ప రక్తపోటు (LOW BP) ❖ పక్షవాతము (PARALYSIS) ❖ కీళ్ళు, కండరాల నొప్పులకు, కీళ్ళవాతము, నరములవాపు, మెడనొప్పి, తుంటి నొప్పి, సయాటిక, నడుము నొప్పి, వెన్ను నొప్పి ❖ మూర్ఛ, అపస్మారకము (FITS) (EPILEPSY) ❖ రాజక్షయ, క్షయ (PULMANARY TUBERCULOSIS) ❖ అండవృద్ధి - గిలక (HERNIA) (ఆపరేషన్ లేకుండా) ❖ వరి బీజము - బుడ్డ (HYDROCELE) (ఆపరేషన్ లేకుండా) ❖ పళ్ళ నొప్పులు, చిగుళ్ళ నుండి రక్తము, చీము కారుట, పుప్పి పళ్ళు పళ్ళు కదలుట, పళ్ళు పచ్చగా నల్లగా రంగు మారుట, నోటి దుర్వాసన ❖ ముక్కు నుండి రక్తము కారుట ముక్కులో కంతులు (NOSAL POLIPS) (SINUSITIS) (ఆపరేషన్ లేకుండా) ❖ చెవిపోటు, చెవిలో చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము (ఆపరేషన్ లేకుండా) ❖ కంటి శుక్లములు (CATARACT) హ్రస్వదృష్టి, దీర్ఘ దృష్టి, దృష్టి మాంద్యము (ఆపరేషన్ లేకుండా) ❖ లివర్ వ్యాధులు, లివరు గట్టి పడుట (CIRRHOSIS) లివరులో పుండు (ABSCESS) లివర్ వాచుట, నొప్పి, వేడి, మంట మరియు పచ్చకామెర్లు (HEPATITIS, A,B,,NONA, NONB) మొ॥ ఒక వైరస్ వలన సంక్రమించిన కామెర్లు, ప్లీహము వాచుట (ENLARGE SPLEEN) ❖ మూత్రపిండముల వాపు (NEPHRITIS) మూత్రావయవములలో రాళ్ళు (RENALCOLIC & URINARY CALCULUS) ❖ మూత్రము వెళ్ళునపుడు మంట నొప్పి, రక్తము పోవుట, పిత్తాశయములో రాళ్ళు (STONES IN GALLBLADER) ❖ క్లోమ గ్రంధి యందు రాళ్ళు (STONES IN PANCREASIS) ❖ ప్రొస్టేటు గ్రంధివాపు (ENLARGEMENT OF PROSTATE) ❖ గుండె నొప్పి గుండెదడ, గుండె రక్తనాళముల నుండి రక్తము సరిగా అందకపోవుట ❖ థైరాయిడ్ సమస్యలు (THYROID) ❖ ముసలితనం లేకుండా చేసి వయస్సును నిలుపుటకు ❖ నత్తిని తగ్గించుటకు ❖ జ్ఞాపక శక్తిని పెంచుటకు ❖ చనుబాలు వృద్ధి చెందుటకు ❖ స్త్రీల శరీరం పై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు ❖ HIV/AIDS, CANCER/LUKEMIA, ALZHEIMERS, SCHIZOPHRENIA.

**అన్నిరకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70MM థియేటర్ దగ్గర, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన,
చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20 ఫోన్: 65526109, 9866155109, 9392355590

**Note:** పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్ట్సు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ. 60/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి.

**Timings: 10 A.M to 8 P.M Sunday 10 A.M to 2 P.M**

సరిగ్గా తన పెళ్ళినాడే తనింట్లో పుట్టిన బొల్లిగిత్తను జయరాముడు తోడబుట్టిన తమ్ముడిలా చూసుకునేవాడు. అలాంటి మూగజీవిపై ఓ రోజున అతనికి విపరీతంగా కోపం వచ్చింది.. కసిదీరా కొట్టాడు. తర్వాత దాన్ని పరసలో అమ్మి మరోదాన్ని కొనుక్కుని వస్తానని బయలుదేరాడు. అలా వెళ్లిన అతను తిరిగిరాలేదు. బొల్లిగిత్త మాత్రం ఒంటరిగా ఇంటికి వచ్చింది. భర్తజాడ తెలుసుకోవడానికి బయలుదేరిన మునెమ్మ అన్వేషణ ఫలించిందా? దాదాపు ఆరుదశాబ్దాలనాటి సంఘటనలతో, అప్పటి గ్రామాల పరిస్థితులను, స్త్రీపురుష సంబంధాలను వర్ణిస్తూ, ఉత్కంఠ రేకెత్తించారు రచయిత డాక్టర్ కేశవరెడ్డి. 'అతడు అడవిని జయించాడు' సృష్టికర్త కలం నుండి జాలువారిన మరో ఆణిముత్యం 'మునెమ్మ' ఈ నెల చతుర సమర్పణ.



# మునెమ్మ

– డాక్టర్ కేశవరెడ్డి

మునెమ్మ చాల ఆశ్చర్యపోయింది. జయరాముడికి బొల్లిగిత్తమీద అంత కోపం ఎందుకొచ్చింది? అతడు దాన్ని ఎంతగా బాదాడని! దానిమీద తన భర్తకు అంత కోపం ఎందుకొచ్చిందో మునెమ్మ ఈనాటికీ చెప్పలేకపోతున్నది.

"ఏంవయిందో ఏమో. ఇద్దరం వంక గెడ్డన గడ్డి చెక్కతా ఉంటిమి. ఎండుగడ్డి. ఏమి పూనిందో ఏమోరా సినబ్బా, చేతిలో ఉండే పారను ఆడ పారేసి నడుమెత్తి నిల్చుకున్నాడు. ఇంతింత గుడ్లు పెట్టుకుని కాసేపు నన్నూ, కాసేపు ఆ గిత్తనూ చూసి నాడు. నేరుగ పోయి దాని వీపు మీదుండే పగ్గం పట్టుకుని ఈడ్చుకపోయి దాన్ని ఊడగ చెట్టుకు కట్టేసినాడు. పార చేతిలోకి తీసుకుని దాన్ని జవిరే దానికి మొదలు పెట్టినాడు" అంది మునెమ్మ నాతో.

దెబ్బలకు తాళలేక బొల్లిగిత్త నాలుక బయటపెట్టి అరుస్తుంటే దిక్కులు ఓ కొట్టి పోయినాయి. పగ్గం తెంచుకునేదానికి ఎంత ప్రయత్నించినా దానిగుండా కాలేదు. అదేమి సామాన్యమైన పగ్గమా? తొంభైశాతం వెంట్రుకలు, పదిశాతం కల బందనార కలిపి అతడే పేనిన పగ్గం. ఎత్తిన పార దించకుండా జాముసేపు దానిని బాదాడు. చూస్తూ ఉండగానే దాని కుడి డొక్కమీద, కుడి జబ్బమీద, మెడ మీద బొచ్చు ఎగిరిపోయింది. మరి కాసే పటికి దాని శరీరం యావత్తూ కుడివైపున నెత్తురు కమ్మసాగింది. నెత్తురు బొట్లు బొట్లుగా నేలమీద రాలసాగింది.

బొల్లిగిత్త అరుస్తున్న అరుపులకు, దాని శరీరాన్ని తాకుతూ పారచేస్తున్న చప్పుడుకు కబోది పిట్టలు మేలుకున్నాయి. దాపున ఉన్న మద్దిమాను కొమ్మలకు వ్రేలాడుతుండిన ఆ పిట్టలు రెక్కలల్లారుస్తూ గాలిలోకి లేచాయి. వేలాడిగ ఉన్న ఆ పిట్టలు గాలిలో వలయాలు తిరగసాగాయి. సాయంకాలపు ఎండలో వాటి నల్లటి రెక్కలు మెరవసాగాయి. అవి అలా ఎగురుతుండగా, వాటి నీడలు అవిరామంగా భూమిపై పాకి, ఆ ప్రాంతాన్నంతా కాసేపు మసక చీకటి ఆవరించింది. ఆ మసక చీకట్లో మునెమ్మ విస విస నడిచి వెళ్ళి భర్తను పక్కకు తోసేసి, ఊడగ చెట్టు దగ్గర వంగి దారం విప్పేసింది. అప్పటికి బొల్లిగిత్త కుడి వైపున జబ్బమీద, డొక్కమీద, మెడమీద కండరాలు వేలాడుతున్నాయి. దారం ముడి వీడగానే అది చెంగున అల్లంత దూరాన గెంతి, గ్రామంవైపు తిరిగి పరుగు ప్రారంభించింది.

అప్పటికి జయరాముడికి ఆయాసం ముంచుకొస్తున్నది. నిటారుగా నిలబడలేక అటూ ఇటూ ఊగుతున్నాడు. మునెమ్మ భర్త ముందర నిలబడి "ఎందుకు దాని గోడు పోసుకుంటా ఉండావు. దాన్నట్ట కొట్టేబదులు పార తిరగేసి దాని మెడ నరికెయ్యరాదా" అన్నది.

జయరాముడు పారను విసిరి పారేసి, "ఆపనే చేసుందును. అదింకా కాసేపు నా కండ్ల ముందరే ఉండి ఉంటే ఆ పనే చేసుందును" అన్నాడు.

"అది నీకేంవి కాక జేసింది? దాని ఒళ్ళంతా ఒక పక్క నంజర నంజర అయిపోయేదాక కొట్టినావు. ఇంట్లో పుట్టి, ఇంట్లో పెరిగిన గొడ్డు, అంతకాక ఏంవి జేసిందది? " అనడిగింది.

ఆయాసంతో అతడు సరిగా నిలబడలేక కుడిచేత్తో ఊడగ చెట్టుకొమ్మను పట్టుకుని, "ఏంవి జేసిందో నీకు తెలవదా? ఏంవీ తెలవనట్టు మాట్లాడతా ఉండావుగదనే బెస్టులంజా" అన్నాడు.

"అవరా! యాడన్నా కద్దా? అది చేసిందేంది, నాకు తెలిసిందేంది. ఎవురన్నా




# బస్సు చేసిన పెళ్లి

కాలిఫోర్నియాలోని పసడేనా అనే ఊళ్లో ఓరోజు సిటీబస్ నంబర్ 164 ఎక్కింది మిస్ వెండీకెరెక్. అది మొదటి ట్రాఫిక్ లైట్‌ని చేర కుండానే ఆమె ఆ బస్‌డ్రైవర్‌తో ప్రేమలో పడింది. త్వరలోనే వాళ్లిద్దరూ డేటింగ్ చేయసాగారు.

బస్‌డ్రైవర్ విక్టర్ మిరోప్ వయసు 65. వెండీ వయసు 58. మొదటి భర్తనించి విడాకులు తీసుకున్న వెండీకి పెళ్లయిన ముగ్గురు పిల్లలున్నారు. ఆమె మొదటిసారి ఆ బస్సు ఎక్కాక ఓచోట కూర్చుంది. ఆవిడ వెనక కూర్చున్న ఓ కుర్రాడు ఆవిడని టీజ్ చేస్తుంటే అది గమనించిన విక్టర్ బస్సాపి, లేచి ఆ కుర్రాడి దగ్గరకి వచ్చి అల్లరి ఆపమని కోప్పడ్డాడు.



54వ ఏట బస్ డ్రైవర్‌గా చేరిన విక్టర్ గత పదేళ్ళుగా ఆ ఉద్యోగంలో కొనసాగుతున్నాడు. విక్టర్‌కి ఇద్దరు పిల్లలు. భార్య మరణించింది.

తమ పిల్లల అనుమతితో వారు వివాహానికి సిద్ధమయ్యారు. సాంప్రదాయంగా చర్చిలో వివాహం చేసుకోకుండా, వారు ఆ బస్సులోనే తమ వివాహాన్ని జరుపుకున్నారు. తెల్లటి పెళ్లి కూతురు గౌనులో, చేతిలో తెల్లటి పూలగుత్తి పట్టుకున్న వెండీ, పెళ్లికొడుకు దుస్తులైన నల్లటి సూట్ ధరించిన విక్టర్‌లకి, బస్సు ముందుభాగంలో, ఫాదర్ వివాహం తంతు జరిపించాడు. దానికి అతిథులుగా ఆ బస్సులో రెగ్యులర్‌గా ప్రయాణించే ప్రయాణికులు కూడా హాజరయ్యారు.

తమకి ఎక్కడి పరిచయం అయిందో అక్కడే వివాహం జరగాలన్న వెండీ కోరిక మీద బస్సులో వివాహం జరిగింది. అది ఓ క్లబ్‌లో పార్క్ చేసి ఉండగా, ఆ వేడుక జరిగింది. ఆ తర్వాత విక్టర్ ఆ బస్సులోనే తన నూతన భార్యతో హనీమూన్‌కు వెళ్ళిపోయాడు, దాని వెనక కట్టిన టపాకాయల గుత్తి అంటుకుని పేలుతూండగా.

వింటే నోటిమీద కొడతారు. చేత్తోగాదు, పొరకతో..."

జయరాముడు ఊడగ కొమ్మమీదుండిన చేతిని తీసివేసి భార్య చెంపమీద ఫెడీల్మని కొట్టి, "సవాలేసింది చాలు. అది ఊర్లోకి పోయింది. ఇంటికే సచ్చుంటుంది. నువ్వు గూడ అట్టనే సావు" అనరచాడు.

మునెమ్మ పడబోయి తమాయించుకుని, మెల్లగ నడుస్తూ గడ్డి తట్ట వద్దకు వచ్చింది. వంగి దాన్నెత్తి తలమీద పెట్టుకోబోయింది. జయరాముడు విసురుగా వెళ్ళి తట్టను లాక్కుని, "దీన్నిప్పుడు నువ్వు ఇంటికి తీసుకుపోవాల్సిన పనేమీలేదు. రేపీపాటికి ఆ గొడ్డు నా ఇంట్లో ఉండదు" అని గడ్డితో సహా తట్టను కాలువలోకి గిరవాటు పెట్టి, "నేను కడదోవన్నే పోటుమిట్టకుపోతా, తరుగులోనితో మాట్లాడి గొడ్డును వానికి అప్పజెప్పేస్తా. వాడు దాన్ని దీసకపోయి



మద్దిపాలెం పరసలో అమ్మేస్తాడు. నువ్వింక చేతులూపుకుంటూ ఇంటికిపో" అని ఊడగ చెట్టుకొమ్మపైనున్న పైగుడ్డను తీసి భుజానేసుకుని కాలువ గట్టుమీద నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

కాలువలో నీటిమట్టం మీద తేలియాడుతూ సాగుతున్న ఎండుగడ్డిని, తట్టను చూస్తూ మునెమ్మ చాలసేపు గట్టుమీద నిలబడింది. ఆ తరవాత మెల్లగ అడుగు లేస్తూ ఊరివైపు బయలుదేరింది.

బయలుదేరేముందు ఆమె ఊడగ చెట్టు వద్ద పడివున్న పారను తీసుకోవడానికి నడుము వంచి చేతిని చాచింది. వెంటనే కొనవేళ్ళకు నిప్పు కణిక తగిలినట్టు చరాలున చేతిని వెనక్కు తీసుకుని వెనుదిరిగింది. చాలా రోజుల తరవాత మునెమ్మ నాతో మాట్లాడుతూ, "ఆ పారను సూడంగానే నా కండ్ల బూసులు కమ్మినాయిరా సినబ్బా. అది ఎట్లపడుందని! ఎవురన్నా చస్తే పూడ్చిపెట్టేదానికి గుంత తవ్వి, పీనుగు వచ్చేదాక గుంతగెడ్డన పారను పక్క వాటాన పడేస్తాం జూడు. అట్ట పడుండాది. నేను అప్పుడే అనుకున్నా. అది ఒకిటి రెండు దినాల్లో ఎవర్నో ఈ భూమ్మీదనుంచి తీసుకుపోతుందని" అన్నది.




ఊరి వైపు బయలుదేరిన బొల్లిగిత్త

చెరువు కట్టమీద వడివడిగా నడుస్తున్నది. చెరువు నీళ్లలో దాని బింబం ప్రతిఫలిస్తున్నది.

అప్పుడు చెరువు నీళ్లలో ఊరి వాళ్ళం ఓ పదిమందిమి ఈదులాడుతున్నాం. వాళ్ళలో నేనూ ఒకడిని. అప్పుడు నా వయసు ఇరవై ఏండ్లు. మేమంతా రొమ్ములోతు నీళ్ళలో నిలబడి, నోటినిండా నీళ్ళు తీసుకుని తలలు పైకెత్తి, ఆ నీళ్ళను పిచికారీ చేసినట్లు ఆకాశంలోకి చిమ్మితే, ఆ నీటి బిందువులపైన సాయంకాలపు సూర్య కిరణాలు పడి ఇంద్రధనుస్సులు ఏర్పడుతున్నాయి. దిగువ వీధి సాంబశివుడు మా అందరిలో పెద్దవాడు. వాడి ఛాతిమీద, దవడల మీద కండరాలు దిట్టంగా ఉంటాయి. వాడు నోటినిండా నీళ్ళు తీసుకుని, పైకి చిమ్మితే ఏర్పడే ఇంద్రధనుస్సులో ఏడు రంగులు ఎంత స్పష్టంగా కనబడతాయని! అలాంటి ఇంద్రధనుస్సును వాడు మా అందరి కోరికను మన్నిస్తూ అప్పటికే ఇరవైసార్లు చూపించాడు. వాడు మరోసారి నోట్లో నీళ్ళు పోసుకుని పైకి చిమ్మబోతూ గబుక్కున ఆగి, "ఇదేంవి జూసినారు. అట్ట జూడండి. ఆ రంగులు జూడండి" అంటూ చెరువు కట్టవైపు చేయి చూపించాడు.

మేమందరం తలలు తిప్పి కట్టవైపు చూశాం. బొల్లిగిత్త పరుగులాంటి నడకతో ఊరివైపు నడుస్తున్నది. మా పదినోళ్ళూ అవాక్కయి పోయి ఉండగా, మా పది జతల కళ్ళు రెప్ప వేయకుండా చూస్తుండగా కట్టవైపు చూస్తూ నీళ్ళలో అలాగే నిలబడ్డాం. మాలో ఒకడు, "అది గొడ్డు మాదిరి లేదురా, మోదుగ కొమ్మలు నడిచొస్తా ఉన్నట్టుంది" అన్నాడు. మేము మొరవ దగ్గర నీటిలో నుండి బయటికి వచ్చి, మా శరీరాలు, గోచిపాతలు నీరోడుతుండగా చెరువు కట్టమీద ఒక వారగా నిలబడ్డాం. బొల్లిగిత్త జబ్బల నుండి

# మట్టినించి బంగారం

**చతురప్రపంచం**




కాలిఫోర్నియాలోని సేనోజూకి చెందిన వ్యాపారవేత్త షెర్‌వుడ్ గూజ్ (50) అమ్మేది కేవలం మట్టి! అవును మట్టి నింపిన కుండలని అమ్ముతున్నాడాయన. అదేమీ బంగారు గని నించో, వజ్రాల గనినించో తెచ్చిన మట్టికాదు. మామూలు మట్టే.

ఇతని కస్టమర్స్ అంతా దేశభక్తి గలవారు. అమెరికాలోని ప్రజల మూలాలు ఇంకేదో దేశానికి చెందినవి. ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలనించి ప్రజలు వచ్చి అక్కడ స్థిరపడ్డారు.

వారిలో చాలామంది తమ స్వదేశంమీద మమతాను బంధం కలిగివుంటారు. దాన్ని వ్యాపారంగా మార్చుకున్నాడు షెర్‌వుడ్. వారి దేశంనుంచి తెచ్చిన 'మట్టిని అందమైన కుండలో నింపి, పైన ఆ దేశపు చిన్న జెండాని ఉంచి అమ్ముతాడు షెర్‌వుడ్. ఒక్కో కుండ ఖరీదు 10 డాలర్లు.

ఈ వ్యాపారానికి ఆలోచన రాగానే షెర్‌వుడ్ ధైర్యం చేశాడు. తన ఇంటిని తాకట్టు పెట్టగా వచ్చిన డబ్బుతో దీన్ని ప్రారంభించాడు. ముందు అనేక దేశాలనించి మట్టిని దిగుమతి చేసుకున్నాడు. వాటిని కార్టన్స్‌లో నింపి ఈ వ్యాపారం మొదలుపెట్టాడు.

తర్వాత వివిధ పత్రికలలో వీటి గురించి ప్రకటనలు ఇచ్చాడు. స్టెరిలైజ్ చేయని మట్టిని విదేశంనుంచి దిగుమతి చేసుకోవడం నేరం అని తెలిసి, ఆ మట్టిని మొత్తం స్టెరిలైజ్ చేయించడానికి చాలా సమయం, డబ్బు ఖర్చు చేయాల్సి వచ్చింది.

క్రమేపీ గిఫ్ట్ షాపుల్లో వీటి అమ్మకాలు పెరగసాగాయి. త్వరలోనే మట్టినించి మిలియనీర్ అయ్యాడు షెర్‌వుడ్.

ఫలానా దేశంలోని ఫలానా ప్రదేశంనించి మట్టి కావాలని కోరేవారి సంఖ్య అధికం అవడంతో షెర్‌వుడ్ అందుకు తగిన ఏర్పాట్లు చేశాడు. ఆ మట్టిని సరఫరా చేయడం కూడా ఆరంభించాడు. క్రమేపీ అలాంటి కస్టమర్స్ సంఖ్య పెరుగుతోంది.

ఉదాహరణకి అమెరికాలోని సుబ్బారావుకి భారతదేశంనించి వచ్చిన మట్టికన్నా తను పుట్టి పెరిగిన ఆంధ్రప్రదేశ్‌లో కంకిపాడులోని మట్టి మీద సెంటిమెంటల్ వేల్యూ ఉంటుంది. కాబట్టి ఆ మట్టినే కోరతాడు.

షెర్‌వుడ్ వ్యాపారం వల్ల ప్రజల్లో తమ పూర్వీకుల స్వదేశంమీద భక్తి కూడా పెరుగుతోంది.



నెత్తురు బొట్లు బొట్లుగా కార్చుకుంటూ, కండరాలు పేలికలు పేలికలుగా వ్రేలాడిం చుకుంటూ, తోకను విసురుకుంటూ, కొమ్ములను ఆడించుకుంటూ మా ముంద రగా సాగిపోయింది.

మాలో ఇంకొకడు నోటిమీద చేయి వేసుకుని, "ఏంవయిందిరా దీనికి? ఆడే డన్నా పరికి కంపమీద పడి దొర్లిందా యట్టి? " అన్నాడు. మరొకడు గుడ్లు తిప్పు కుంటూ, "గుట్టకింద పెదనక్కతో ఇ ద్ధవాఁడి వచ్చినట్టుంది" అన్నాడు. నేను చాలసేపు జారుకుని "దీన్ని మా జైమామ కంటికి రెప్ప మాదిర చూసుకుంటా ఉం డాడు. ఇప్పుడు దీన్ని జూసినాడంటే జైమా మకు ఒళ్ళు దగోత్తరంగా కాలిపోతుంది" అన్నాను.

బొల్లిగిత్తను ఆ గతి పట్టించింది జయ రాముడేనన్న విషయం అప్పటికి మాకెవ రికీ తెలియదు. మరునాటి ఉదయానికల్లా



మాకేగాక ఒంటిల్లు గ్రామవాసులందరికీ తెలిసిపోయింది- బొల్లిగిత్తను చావగొట్టింది జయరాముడేనని.

"దాన్నడ్డం పెట్టుకుని బాడుగ బండ్లు తోలి నాలుగు దుగ్గాన్లు సంపాదించుకుంటా ఉండాడు. గెంజో, గెసో తాగతా ఉండాడు. దాన్నెందుకు కొట్టినాడు, పాపిష్టోడు" అని గ్రామవాసులు ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

ఆ ప్రశ్నకు సమాధానం మునెమ్మకు కూడా తెలియదు. అప్పటికి ఆరు సంవత్సరాలుగా సాగిన వారి దాంపత్య జీవితంలో జయరాముడు ఏ విషయాన్నిగాని భార్య నుంచి దాచింది లేదు. కల్లుపాకలో ఏరోజు ఎన్నెన్ని ముంతలు తాగిందీ, ఎవరెవర్ని తన్నిందీ, ఎవరెవరి చేత తన్నులు తిన్నదీ వివరంగా అతడు భార్యకు చెప్పేవాడు. కోడి పందాల కాడ పోలీసోళ్ళు తరిమితే ఏ వాగులో, ఏ చెరకు తోటలో ఎన్నెన్ని జాములు దాక్కున్నది పూస

గుచ్చినట్టు భార్యకు చెప్పేవాడు. తిరునాళ్ళకు వెళ్లినప్పుడు, ఏ ముండ దగ్గర సవాయి రోగం తగిలించుకున్నదీ, ఏ ముండ దగ్గర కొరుకుడు రోగం అంటించుకున్నది దాచుకోకుండా చెప్పేవాడు. "పెండ్లాం దగ్గర రహస్యాలు దాచేవాడు మొగుడే కాదురా, సినబ్బా. వాడు కట్టింది తాళే కాదు. అట్టాటి సంసారం చేసేదాని కన్న పుట్టింటికి పోయి ముండ మోపి మాదిర బతికేది మేలు" అన్నది మున్నెమ్మ ఒకసారి నాతో.

"మరి బొల్లిగిత్తను అంతగా ఎందుకు కొట్టాడో నువ్వు తెల్సుకోలేదా? " అనడిగాను.

"తెల్సుకునేదానికీ తేల్చుకునేదానికీ యాడ తీరిందిరా. అది జరిగినాక ఆయన బూమ్మీద ఉండింది ఒక్కటంటే ఒకే దినం గదా" అన్నది మునెమ్మ.

ఆ ప్రశ్నకు సమాధానం తెలిసిన వ్యక్తి ఒంటిల్లు గ్రామం యావత్తులోనూ సాయమ్మత్త ఒకటే. ఆమె జయరామునికి తల్లి. మునెమ్మకు అత్త. నాకు వరుసకు అత్త.




బొల్లిగిత్త నెత్తురు బొట్లు రాల్చుకుంటూ ఇల్లు చేరేసరికి సాయమ్మత్త నట్టింట దీపం వెలిగిస్తోంది. మట్టి ప్రమిదను పేడ మీద అమర్చి దానిలో ఆముదం పోసి వత్తి వేసింది. ఎర్ర అగ్గిపుల్లతో వత్తిని వెలిగించి, చేతులు జోడించి, తలవంచుకుని నిలబడింది. అలా నిలబడి ఆమె ప్రతి దినమూ తన భర్తను జ్ఞాపకం చేసుకుంటుంది.

ఆమె భర్త ఇరవై మూడు సంవత్సరాల క్రితం కనుమరుగైపోయాడు. అతడు ఇంకా ఎక్కడో బతికి ఉన్నాడనడానికి ఎంత ఆస్కారం ఉందో, చనిపోయాడనడానికీ అంత ఆస్కారం ఉంది. విచిత్రమైన ఈ వైధవ్యానికి ఆమె ఏనాడో అలవాటు పడిపోయింది. తన భర్త ఎక్కడున్నా క్షేమంగా ఉండాలనిగాని, క్షేమంగా తిరిగి రావాలనిగాని ఆమె ప్రార్థన చేయడం లేదు. ఒకవేళ ఇరవై మూడు సంవత్సరాల క్రితమే మట్టిలో కలిసిపోయి ఉంటే అతడు పరలోకంలో సుఖంగా ఉండాలని గూడా ఆమె ప్రార్థన చేయడం లేదు. మనుషులకు ఉండకూడని అవలక్షణాలన్నీ తన భర్తకు ఉండేవి. తను కాపరానికొచ్చాక అతడి అవలక్షణాలన్నీ ఒకటొకటే బయటపడసాగాయి. ఒక అవలక్షణానికి సర్దుకుపోయేటప్పటికీ మరో అవలక్షణం బయటపడేది. అతనితో కాపురం చేసిన మూడేండ్లకే ఆమెకు బతుకు రోత అనిపించి పోయింది.

సదరు అవలక్షణాలు తన కొడుక్కి రాకూడదన్నదే ఆమె నిత్యం చేసే ప్రార్థనల సారాంశం. "ఈ అవలక్షణాలు గూడా పుట్టు మచ్చల్లాంటివిరా, సినబ్బా. పుట్టుమచ్చల్లాడు- కొన్ని బిడ్డ పుట్టినప్పుడే బయట పడతాయి. కొన్ని పదేండ్ల వయసు వచ్చినప్పుడు బయటపడతాయి. ఇంకొన్ని ఇరవై ఏండ్లకు బయటపడతాయి" అంది సాయమ్మత్త ఒకసారి నాతో మాట్లాడుతూ.

ఇరవై మూడేండ్ల క్రితం సాయమ్మత్త జయరాముడిని కడుపుతో ఉండినప్పుడు కంగుంది నాటక బృందం ఒంటిల్లు

**చతురప్రపంచం**

# ఈ తండ్రిగారు లోభి నెంబర్ ఒన్




అమెరికాలోని అతిలోభి అయిన తండ్రి టెర్రీ నేయిల్ పియర్స్. అతను తన ఇద్దరు కొడుకుల కోసం ఏనాడూ ఒక్క సెంట్ కూడా ఖర్చు చేయలేదు. దాంతో అతని భార్య జోయన్నే అతనికి విడాకులు ఇచ్చి 'చైల్డ్ సపోర్ట్'కి కోర్ట్‌లో ఇతనిమీద కేసు వేసింది. దానికి బదులుగా ఇతను తన భార్యకి తన గర్ల్‌ఫ్రెండ్స్‌తో, చుట్టూ డాలర్లతో తీయించుకున్న ఫొటోని పంపాడు తప్ప డబ్బుని పంపలేదు!

ఆ ఫొటోలో అతని గర్ల్‌ఫ్రెండ్ చేతిలో రెండు చొక్కా జేబుల్లో వంద డాలర్ల నోట్లు, ముందున్న టేబుల్ మీద పేకముక్కల్లా పరిచిన డాలర్ల నోట్లు ఉన్నాయి. గర్ల్‌ఫ్రెండ్ మొహం కేవలం గడ్డందాకానే కనిపిస్తుంది.

జడ్జి పియర్స్‌ని చైల్డ్ సపోర్ట్‌గా నెలకి 300 చెల్లించమని తీర్పు చెప్పినా అతను ఒక్క పెన్నీ కూడా వాళ్ళకి చెల్లించలేదు.

'ఆఫీస్ ఆఫ్ ది చైల్డ్ సపోర్ట్ ఎన్‌ఫోర్స్‌మెంట్' వారి మోస్ట్ వాంటెడ్ లిస్ట్‌లో పియర్స్ పేరు మొదట్లో వుంది. కోర్ట్ ఆర్డర్‌ని ధిక్కరించిన వారిని పట్టుకునే ఈ కార్యాలయం పియర్స్‌ని పట్టుకోలేకపోయింది.

ఆ ఫొటో చూసి మండిపడ్డ అతని భార్య అతని కోసం వేటాడి, చివరికి అతను మేడిసన్ అనే ఊళ్లో పనిచేస్తున్నాడని కనిపెట్టి పోలీసులకి అతని వివరాలు అందించింది. క్రితం ఏడాది జులై 11న కార్ డీలర్ దగ్గర పనిచేస్తున్న 32 ఏళ్ల పియర్స్‌ని పోలీసులు అరెస్ట్ చేసి కోర్ట్‌లో హాజరు పరిచారు. జడ్జి అతన్ని $20,100 ని టెన్నెస్సీ రాష్ట్రానికి అతని భార్య పిల్లలకి ఇచ్చే నిరుద్యోగ భృతికోసం కట్టమని ఆజ్ఞాపించాడు. ఆర్నెల్లు జైలుశిక్ష కూడా విధించాడు.

తన దగ్గర పెన్నీ కూడా లేదని, ఫొటోలోని డబ్బు పరాయివాళ్లదని పియర్స్ జడ్జికి చెప్పాడు.

జైలుశిక్ష పూర్తయ్యాక పియర్స్ ఆ డబ్బు కట్టకుండా మాయం అయ్యాడు. మళ్లీ అతని కోసం పోలీసులు వెదుకుతున్నారు.



గ్రామానికి వచ్చింది. ఆ బృందం గ్రామానికి పడమరగా ఉన్న భారతం మిట్టమీద పద్దెనిమిది రాత్రులు నడిచే మహాభారత నాటకాన్ని ప్రారంభించింది.

ఎక్కడ ఏ నాటకాలు జరిగినా సాయమ్మ భర్త క్రమం తప్పకుండా వెళతాడు. సిల్కు జుబ్బా తొడుక్కుని, వాసన నూనెపెట్టి తల దువ్వుకుని, ఒళ్ళంతా సెంటు కొట్టుకుని బయలుదేరి దార్లో రెండు సీసాల కల్లు తాగి నాటకంలో కూర్చుంటాడు. అతనికి నాటక కళపైన ప్రత్యేకమైన ఆసక్తి ఏమీలేదు. అతని మొదటి సరదా వన్స్‌మోర్లు కొట్టడం, రెండో సరదా పొగిడించుకోవడం. నాటకం రసపట్టులో ఉన్నప్పుడు అతడు వేదిక మీదకు ఐదు రూపాయలు పంపేవాడు. వేదికమీద నటుడు కాసేపు నాటకాన్ని ప్రక్కన పెట్టి, ఆ ఐదు రూపాయల నోటును గాల్లో పైకెత్తి పట్టుకుని ప్రేక్షకులకు చూపుతూ "అమ్మలారా! అయ్యలారా! ఆ విధంగా భీమసేనుడు మూడు రాత్రులు, మూడు పగళ్లు యుద్ధంచేసి బకాసురుణ్ణి సంహరించినాడు. పూటకు బండి కూడును, బండెడ్లను తినే బకాసురుడు పీనుగైపోయినాడు. అపుడు ముక్కోటి దేవతలు భీమసేనుని మీద పూలవాన కురిపించినారు. కొండంత పీనుగును జుట్టు పట్టుకుని బరబర ఈడ్చుకుంటూ తెచ్చి భీమసేనుడు ఏకచక్రపురం రచ్చబండ కాడ పడేసినాడు. జనమంతా ఇండ్ల నుంచి బయటకు వచ్చి పీనుగు చుట్టూ చేరినారు. ఆడవాళ్ళు బకాసురుణ్ణి చేట

లతో, పొరకలతో కొట్టినారు. మెటికలు విరిచినారు. మగవాళ్ళు కాళ్ళతో తన్ని నారు. కాండ్రించి ఉమ్మినారు. ఇంక కుంతీ దేవి ఆనందం చెప్పేదానికి అలివిగాదు. తల్లులారా! తండ్రులారా! ఇటువంటి సంతోష సమయంలో మన ఒంటిల్లు గ్రామ ప్రభువు శ్రీశ్రీ దొరసామిరెడ్డిగారు ఐదువేల వరహాలు ఇనాం పంపినారు. జగద్రక్షకుడు, యోగీశ్వరుడు అయిన ఆ యొక్క క్రిష్ణ పరమాత్మ వారికీ, వారి కుటుంబానికి అష్టైశ్వర్యాలు, ఆయురారోగ్యాలు ప్రసాదించుగాక" అని బిగ్గరగా చెప్పేవాడు. దాంతో దొరసామిరెడ్డికి నెత్తిన పూలవాన కురిసినట్టయ్యేది.

మహాభారత నాటకాలు ప్రారంభమైన నాలుగోరోజున ద్రౌపతి వస్త్రాపహరణ ఉంటుందని ప్రకటించారు. ఆరోజు సాయంత్రం బాగా చీకటి పడ్డాక ఊరి మడవలి హడావిడిగా సాయమ్మత్త వద్దకు వచ్చాడు. వచ్చి "సాయమ్మ తల్లీ... నువ్వొక పన్జేసి పుణ్యం గట్టుకోవాలి. ఈ రాత్రికి ద్రౌపదికి చీరల్దీసే ఆట ఉండాది. ఎట్టలేదన్నా రెండు పట్టుచీరలు కావాలి. ఆ కంగుంది వాళ్ళ దగ్గర పట్టుచీర ఒగిటే ఉండాది. ఇంగొగిటి సంపాదించుకురమ్మని నన్ను తరిమినారు. నువ్వొక చీర ఇచ్చినావంటే నాకు ఈ చీకట్లో ఈదుల్దిరిగే కష్టం తప్పి పోతుంది" అన్నాడు.

సాయమ్మత్త దగ్గర ఒకే ఒక పట్టుచీర ఉంది. అది మూడు సంవత్సరాల క్రితం పెండ్లినాడు అత్తవారు పెట్టిన చీర. ఆకు పచ్చ రంగులో ఉన్న చీరకు ఎర్ర రంగు జరీ అంచు, ఆ అంచు వెంబడి మామిడి పిందెల బొమ్మలు ఉన్నాయి.

ఊరి మడవలి ప్రాధేయపడుతూ, "జాస్తి ఆలోచించొద్దు తల్లీ. ఇది దేవుని పని. ద్రౌపతమ్మ ఎవురనుకుంటివి? కృష్ణమూర్తికి చెల్లెలుగదా" అన్నాడు.





నిజానికి అతడంతగా బ్రతిమాలవలసిన అవసరం లేదు. తన పట్టుచీరను ఇవ్వడానికి సాయమ్మత్తకు భయ సంకోచాలేవీ లేవు. ఆమె లోపలికి వెళ్ళి పెట్టెలో నుంచి చీరను తీసి అతనికిచ్చింది. అతడు నడుం వంచి, రెండు చేతులతో చీరను తీసుకుని, "రాత్రికి ఆట అయిపోగానే కోకను ఉతికి, చలవజేసి రేపు నీకు అప్పగిస్తా" అనేసి వెళ్లిపోయాడు.

ఆ రాత్రి దొరస్వామి ప్రేక్షకులలో ముందు వరసలో కూర్చుని రెండు పాటలకు, ఒక పద్యానికి వన్స్‌మోర్ కొట్టాడు. ద్రౌపది, "ముట్టురాలనై ఉన్నానురా. నను ముట్టుకుంటే నీకు చేటురా" అని పాడుతున్నప్పుడు వేదిక మీదకు ఐదు రూపాయలు చదివింపు పంపాడు. ద్రౌపది పాత్రధారి పాటను మధ్యలో ఆపేసి దొరసామి దాతృత్వాన్ని వేనోళ్ళ పొగిడాడు. నటుడు కట్టుకుని ఉన్న ఎర్రంచు పచ్చ చీరను దొరసామి చూశాడు. ఆ అంచు వెంబడి ఉన్న మామిడి పిందెలను గూడా చూశాడు. ఐతే అతడు బాగా తాగి ఉండడవల్ల ఆ చీర ఎవరిదన్నదీ అతడు పోల్చుకోలేదు.

ఊరి మడవలి మరునాడు గాని, ఆ తరవాత రెండు రోజులకుగాని చీరను తెచ్చి ఇవ్వలేదు. భారత నాటకాలు ప్రారంభమయినప్పటినుంచి అతడు రెండు కాళ్ళొకచోట పెట్టడం లేదు. పగలంతా ఊరివాళ్ళ బట్టలుతికే పని. రాత్రంతా నాటకం దగ్గర నూనె దివిటీ మోసేపని. నాలుగో రోజు సాయంత్రం ఉతికి, చలవ చేసిన పట్టుచీరను తెచ్చి సాయమ్మత్తకు అప్పగించి దండం పెట్టి వెళ్లిపోయాడు ఊరి మడవలి. సాయమ్మత్త పనుల తొందరలో ఉండడంవల్ల దాన్ని తీసి పెట్టెలో పెట్టకుండా అలాగే ఇంటి అరుగుమీద ఉంచేసింది. చాలా కాలం తరవాత సాయమ్మత్త నాతో మాట్లాడుతూ, "మనిషి చేసే పని పాపపు పని కానప్పుడు దాన్ని దాచుకోవాలనే ఆలోచన ఎందుకొస్తుంది చినబ్బా. ఆ చీరను ఇవ్వడము, వాపసు తీసుకోవడము రహస్యంగా ఉంచాలని నాకు తట్టనేలేదు. ఏ పాపమూ ఎరగని పసిపిల్ల పదిమంది మగవాళ్ళు చూస్తున్నా దిశమొలతో తిరుగుతుంది గదా" అంది కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ.

ఊరి మడవలి పట్టుచీరను అరుగుపైన ఉంచేసి వెళ్ళిపోయినరోజు దొరసామి ఎక్కడెక్కడో తిరిగి మాటు మనిగే రాత్రికి ఇల్లు చేరాడు. కాళ్ళీడ్చుకుంటూ వెళ్లి అరుగుమీద గోడకు వీపు ఆనించి కూర్చున్నాడు. అతని కుడిచేతికి పట్టుచీర మెత్తగా తగిలింది. నక్షత్రాల కాంతిలో జరీ అంచు మెరుస్తూ కనిపించింది.

"ఇది ఈడేంవిటికుంది? " అనడిగాడు భార్యను. సాయమ్మత్త జరిగిందంతా చెప్పింది.

అంతే. దొరసామి ఒక్కసారిగా రాక్షసుడై పోయాడు. ఒక్క ఉదుటున అరుగు మీదనుంచి దిగి పశువుల కొట్టంలోకి వెళ్ళి జొన్న చొప్పను నరికే కత్తిని తీసుకున్నాడు. చీరను కొయ్య మీదుంచి దాన్ని ముక్కలు ముక్కలుగా నరికేశాడు. ఇంతలో సాయమ్మత్త పరుగెత్తుకుంటూ కొట్టంలోకి వచ్చింది. అతడామె జుత్తును ఒడిసి పట్టుకుని, "పరాయి మొగోడు ఒంటికి సుట్టుకున్న చీరను యట్ట కట్టుకుందామనుకుంటివే, లంజా? ఇన్నాళ్ళు కాపోనికి సంసారం చేస్తివా, ఇంగెవురికన్నా చేస్తివా? నిన్ను కండలు కండలుగా-" అని కత్తిని పైకెత్తాడు. ఆ తరవాత ఏదో జ్ఞాపకం వచ్చి కత్తిని దించి, "నిన్నుగాదు, వాణ్ణి నరకాల. వాని నెత్తురు ఊరంతా పొలిచల్లాల" అని ఆమెను బలంగా నెట్టేసి పెద్ద పెద్ద అంగలేసుకుంటా వీధిలోకి వెళ్ళి

పోయాడు.

అతడు తోసిన తోపుకు ఆమె తల రాతి స్తంభానికి బలంగా కొట్టుకుంది. కళ్ళు బైర్లు కమ్మినాయి. ఆ చీకటిలో ఆమె నాలుగడుగులు వేసి, కొట్టానికి ఇంటికీ మధ్య నడవలో కట్టెలమోపులా పడిపోయింది.

అలా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ, కుడిచేతిలో కత్తిని ఊపుకుంటూ దొరసామి భారతం మిట్టను చేరాడు. అప్పటికి నాటకం ప్రారంభమై చాలసేపయింది. ఊరి మడవలి నూనె దివిటీని మోస్తూ వేదిక ఫక్కన నిలబడి ఉన్నాడు. దొరసామి నేరుగా వెళ్ళి మడవలి ముందు కాసేపు నిలబడ్డాడు. అతన్ని ఏదో అడగబోయి ఆ ప్రయత్నం విరమించుకుని పరదా తొలగించుకుని లోపలకు వెళ్ళాడు. అతడు హత్య చేయడం కళ్ళార చూసిన మడవలి జడుసుకుని ఆ రాత్రే ఊరు వదిలి పారిపోయాడు. కొన్ని సంవత్సరాల తరవాత అతడు నాకు సంతలో కనబడి మాట్లాడుతూ, “అప్పుడు మీ మామ కండ్లు యట్ట ఆడతా ఉండాయనుకుంటివి సినబ్బా! నలుగురు మనుషులు ఎదురుగా నిలబడి రాళ్ళతో కొడతా ఉంటే పిచ్చోని కండ్లు ఆ పక్కకు, ఈ పక్కకు ఆడతా ఉంటాయి జూడు, అట్ల ఆడతా ఉండాయి. ఆయన లోపలకు పోయిన కాసేపటికే ఆలగోడు బాలగోడుగా రంపులు వినిపించి నాయి. నేను దివిటీ ఆడపారేసి లోపలికి పోయినా. అప్పటికే అంతా అయిపోయింది సినబ్బా. అట్ల జేస్తాడని “తెల్సుంటే నేను బయటనే ఒడిసి పట్టుకుని కత్తిని లాగేసుందును. నేను లోపలకు పోయేటప్పటికి జరగాల్సిందంతా జరిగి పోయింది. ద్రౌపది వేషం వేసినాయన- ఆయన పేరు మర్చినా- ఆయన మెడమీద రెండు పక్కలా గాట్లు పడిపోయినాయి. ఒక్కొక్క గాటులో నీ అరచెయ్యి ఇమిడిపోతుంది. మెడ నరాలు తెగిపోయి నెత్తురు చిమ్మి పరదాలన్నీ తడిసిపోయినాయి. ఆ మనిషి అట్టనే మోకాళ్ళ మీద నిలబడి కాసేపు అట్టా ఇట్టా ఊగి నెమ్మదిగా పక్కకు పడి పోయి పానాలొదిలేసినాడు” అని చెప్పాడు.

అర్ధరాత్రి దాటాక పోలీసులు వచ్చారు. దొరసామి చేతులకు బేడీలు వేసి తీసుకెళ్ళారు. కోర్టులో జడ్జి అతనికి యావజ్జీవ కారాగార శిక్ష విధించి వేలూరు జైలుకు పంపించాడు.

భర్త జైలుకు వెళ్ళేటప్పటికి సాయమ్మత్త నాలుగు నెలల గర్భవతి. మరో ఐదు నెలలకు ఆమె జయరాముడిని ప్రసవించింది. కొడుకు భూమి మీద పడిన రోజునుంచి ఆమె ప్రతిదినం మునిమాపువేళ నట్టింట దీపం వెలిగించి చేసే ప్రార్థన ఒకటే- తండ్రి బుద్ధులు కొడుక్కు రాకూడదని.




సాయమ్మత్త నట్టింట దీపం ముందు నిలబడి ఉండగా బొల్లిగిత్త నెత్తురు చుక్కలు రాల్చుకుంటూ, కండరాలు వ్రేలాడించుకుంటూ వీధి తలుపు గుండా లోపలకు ప్రవేశించి నడవాలోకి వచ్చింది. దాని గిట్టల చప్పుడుకు ఆమె కళ్ళు తెరచి బయటకు వచ్చింది. నడవాగుండా కుడితివైపు వెళుతున్న బొల్లిగిత్త ఆమె కంట బడింది.



వెంటనే ఆమె నోరు తెరిచి ఎగశ్వాస తీసుకుంది. అరచేతులు రెండూ ఎదమీదకు లేచాయి.

బొల్లిగిత్త నేరుగా వెళ్ళి కుడితిలోకి వంగి నీళ్ళు తాగడం ప్రారంభించింది. సాయ

# మధురాంతకం ఏకలవ్య శిష్యరికం


డా.కేశవరెడ్డి

పుట్టి పెరిగింది చిత్తూరు జిల్లాలో. చదువులు చాలావరకు తమిళనాడు(పాండిచ్చేరి, వేలూరు)లో జరిగాయి. వృత్తిరీత్యా గత 30 ఏండ్లుగా నిజామాబాద్‌లో ఉంటున్నాను. మధురాంతకం రాజారాంగారి ఏకలవ్య శిష్యరికం చేసి సాహిత్య రంగంలోకి ప్రవేశించాను. వారిచేత ఓనమాలు దిద్దించుకుని, ఆ తరవాత నా దారి నేను వెదుక్కున్నాను. మొదటి నవల 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' 1977లో విడుదలైంది. ఈ ముప్పయి ఏండ్లలో రాయదలచింది ఎక్కువ, రాసింది చాలా తక్కువ.

రావిశాస్త్రిగారి పేరిట ఉన్న సాహిత్య పురస్కారాలు రెండూ నాకు రావడం నాకెంతో తృప్తినిచ్చే విషయం. రావిశాస్త్రి పేరుతో నాపేరు ముడిపడి ఉండడమే నాకు గర్వకారణం.

1993లో 'మూగవాని పిల్లన గ్రోవి' రాశాక, పద్నాలుగు సంవత్సరాల అనంతరం ఈ 'మునెమ్మ'ను వెంటబెట్టుకుని వస్తున్నాను. ఈమెను మీ ఇంటి ఆడపడుచులాగా, లేదా ఇంటికోడలిలాగా ఆదరిస్తారని నమ్ముతున్నాను.

చిరునామా: డా. కేశవరెడ్డి, ఏకశిల అపార్ట్‌మెంట్స్, రెండో అంతస్తు, బి-బ్లాక్, దేవి థియేటర్ పక్కన, ప్రగతి నగర్, నిజామాబాద్-503001, ఆంధ్రప్రదేశ్.
ఫోన్: 9949089790

---

మ్మత్త దానికి చేరువగా వెళ్ళి, తన ఆవేదనలో అది మూగజీవమనే విషయం గూడా మర్చిపోయి, "ఇది ఏఁవి కరుమోలం? ఎవురుచేసిన కరుమోలం?" అనడిగింది. ఆ తరవాత, "ఈళ్ళు యాడ సచ్చినారు? దీంతో కూడా పోయినోళ్ళు యాడ సచ్చినారు?" అంటూ కొడుకు కోసము, కోడలి కోసము నలువైపులా చూసింది. వీధి తలుపు గుండా బయటకు వెళ్ళి, నడివీధిలో నిలబడి నడుంపై చేతులు పెట్టుకుని వీధి చివరిదాక కాసేపు చూసి తిరిగి వచ్చింది.

అప్పటికి బొల్లిగిత్త కుడితి వద్దనుండి కొట్టంలోకి నడిచి కట్టుగొత్తు వద్ద పడుకుంది. సాయమ్మత్త కుడితిలోకి చూసి "కుడితి నీళ్ళంతా ఒక్క సుక్క మిగలకుండా తాగేసింది. దానికి ఎంత దప్పికయిందో ఏమో" అన్నది. అసహనంతో, దుఃఖంతో ఆమె రెండు కాళ్ళొకచోట పెట్టకుండా కొట్టంలో నడవాలో అల్లిబిల్లిగ చాలసేపు తిరిగింది. అలసట ముంచుకొచ్చినట్లై అరుగుమీద కూర్చుని కొడుకు కోసము, కోడలి కోసము ఎదురు చూడసాగింది.

చీకటి ముదురుతుండగా మునెమ్మ అడుగులో అడుగేసుకుంటూ ఇంటికి వచ్చింది.

సాయమ్మత్త అరుగు దిగి, "ఇంత మొబ్బయినాక వస్తా ఉండావేంది పాపా? బొల్లిగిత్తను వదిలేసి మీరు యాడ పోయింటిరి?" అనడిగింది.

"అది ఇంటికొచ్చి ఎంత సేపయింది?" అనడిగింది మునెమ్మ.

"పొద్దుగూట్లో పడకముందే వచ్చింది. దానికేమయింది పాపా? దాని వొళ్ళంతా ఒక పక్కన పేనా కత్తితో సెలిగేసి నట్టుండాది?"

మునెమ్మ వంటింటివైపు నడుస్తూ, "ఉండదా గడ్డిచెక్కే పారను తిరగేసి దాని మీద పడి జాఁవుసేపు కొట్టితే ఉండదా" అంది.

"ఎవురు? ఎవురు కొట్టింది?"

"ఇంగెవురు..నీ కొడుకు" అని మునెమ్మ వంటింటి గడపమీద కూర్చుంది.



"జైరాముడా? ఎందుకు? ఎందుకు కొట్టినాడట్ట?" అంది సాయమ్మత్త కోడలు ముందర నిలబడి.

"నాకు తెలవదత్తమ్మా నేనడిగితే నన్ను కొట్టేదాని కొచ్చినాడు. తీసకపోయి ఊడగ చెట్టుక్కట్టేసి పెద్దపులి మాదిర దానిమీద పడినాడు. కొట్టీ కొట్టీ దాని గుంట కూల్చే సినాడు"

సాయమ్మత్త కొట్టంలో పడుకుని ఉన్న గిత్తనొకసారి చూసి, "వాడు దాన్నట్ట కొడ్తా ఉంటే నువ్వు చూస్తా యట్టుంటివి?" అన డిగింది.

"నేనేంవి జెయ్యాల.. అప్పటికీ ధైర్యం జేసి దాని పగ్గం ఇప్పేసినా. నేనాపని జెయ్యబట్టి అది ఇల్లు జేరింది. లేకుంటే అది ఆడనే నీలిగి సచ్చుండును"

"వాడు యాడుండాడు? నీతో రాలా?"

"పోటుమిట్టకు పోతానని చెప్పి పోయి నాడు"

"ఆడి కేంవిటికి?"

"పోటుమిట్టకుపోయి తరుగులోనితో మాట్లాడి గిత్తను వాడికి అప్పజెప్పేస్తా డంట. దాన్ని దీసకపోయి మద్దిపాలెం పరసలో అమ్మేస్తారంట" అన్నది మునెమ్మ.

గిత్తను అమ్మే మాట చెవిన పడగానే సాయమ్మత్తకు కోపము, దుఃఖము ఒక్క సారిగా తారాస్థాయికి చేరాయి. "అమ్మేస్తా డంటనా? తరుగులోణ్ణీ, వీడినీ ఇద్దర్నీ పొరకతో తిప్పించి మళ్ళించి కొడతా. ఇల్లు ఊడ్చే పొరకతో కాదు. మోటు పొరకతో" అని కుక్కిమంచాన్ని లాక్కొచ్చి వంటింటి ముందర వేసి దానిమీద కూర్చుంది. కొడుకు అన్నంత పనిచేసి తీరతాడనే కోపము, దుఃఖము ఒకవైపున, బొల్లిగిత్త పైన జాలి, ప్రేమ మరొకవైపున ఆమెను వివశత్వానికి లోను చేశాయి. ఆ వివశ త్వంలో ఆమె తన కొడుకు జయరాము డిని, భర్త దొరస్వామిని క్రమము, పద్ధతి, సమయము, సందర్భము లేకుండా తిట్టడం మొదలుపెట్టింది. దొరసామి వంటి సోంబేరి ఈ పాయకట్టులో యాడా లేడన్నది. ఒళ్ళొంచి ఏనాడూ సేద్యం పనులు చేసినాడు గాదు. ఈడుండే పుల్లను దీసి ఆడ పెట్టినోడు గాదు. పాపి టమీద వెంట్రుక పడకుండా బతికినాడు. ఓ ఎనిమిది కుంటలు తప్ప పెద్దోళ్ళు సంపాదించిన నేలంతా అమ్ముకు తినే శాడు. ఆఖరుకు ఖూనీ చేసి జైలుకు పోయినాడు. ఖూనీ కొడుకు భార్యగా ఊర్లో వాళ్ళకు ముఖం చూపించ లేక సాయమ్మత్త కొన్ని సంవత్సరాలు చెట్టు తొర్రలో గుడ్ల గూబలాగ బతికింది. జైలుకు పోయినోడు ఆడన్నా గుట్టూ గోపి తంగా బతికినాడా అంటే అదీ లేదు. అణు కువ మణకువగా నడుచుకున్న ఖైదీలను నాలుగైదు సంవత్సరాలయినాక ఇడిసిపె ట్టెయ్యమని ఆ తెల్లదొర ఆర్డగూడా ఏసి నాడంట. ఐతే దొరసామి ప్రతిరోజు తోటి ఖైదీలతో కొట్లాడుతుండేవాడు. అధికారు లతో తలెగరేస్తూ మాట్లాడేవాడు. ఆఖ రుకు మరి పదిమందితో కలిసి సొరంగం తొవ్వి జైల్లో నుంచి పారిపోయాడు. పారి పోయినవాళ్ళు ఆరునెలల తరవాత రామే శ్వరం దగ్గరెక్కడో పోలీసుల కంటబ డ్డారు. కాల్పులు జరిపితే కొందరు చనిపో యారు. కొందరు పారిపోయారు. చనిపో యినవారి పేర్లు, పారిపోయిన వారి పేర్లు పోలీసులు నిర్ధారించలేకపోయారు. కనుక దొరసామి బతికి ఉన్నాడో లేదో ఈనాటికీ ఇదమిద్ధంగా తెలియదు...

"అట్టాటోనికి పుట్టినోడు అంతకన్న సొక్కంగా బతకతాడా?" అంటూ కొనసా గించింది సాయమ్మత్త.

జయరాముడు కొంపను నాలుగు దోవలు జేస్తా ఉండాడన్నది. తండ్రి లక్ష

ణాలన్నీ ఒగిటొగిటే వొచ్చేసినాయి. తండ్రి జైలుకు పోయేటప్పటికి మిగిలి ఉండిన ఎనిమిది గుంటల నేలను గూడా పోగొట్టు కున్నాడు. సేద్దింపనులు ఒంటబట్టలేదు. పుట్టింది కాపు పుటకే అయినా ఎప్పుడూ పిచ్చిగుంట్లోల్ల మాదిరి బతకాలనే చూపే. సాయమ్మత్త తన మెడలోవి, చెవుల్లోవి అమ్మి, ఆ డబ్బుతో ఒక ఒంటెద్దు బండిని కొన్నది. దాన్నడ్డం పెట్టుకుని బాడుగలు తోలి నాలుగు దుడ్లు సంపాదిస్తా ఉండాడు. ఆ బండిని వీడేఁవన్నా బుజం మీద పెట్టుకుని లాగతాడా? ఆ బొల్లిగిత్తే రోడ్డు వెంబడి చిత్తూరుదాక లాక్కపో తుంది. ఇంగొకరు చెప్పే అవసరమే లేకుండా అది నేరుగా పోయి మండీల ముందర ఆగుతుంది. ఇంక ఈడు చేసే దేంది? బండిలో ఉండే లోడు- మామిడి కాయలో, బెల్లమో, సెనక్కాయలో- దించి సేటుకు అప్పుజెప్పి, రసీదు తీసుకుని మళ్ళీ బండెక్కి నొగమీద కూచోవడమే. ఆ గిత్తే బండిని ఊరికి చేరుస్తుంది.

"అట్టాటి గొడ్డును అమ్మేస్తాడట. అమ్మేసి వీడు ఏఁవిజేసి బతకతాడంట?" అన్నది సాయమ్మత్త. ఆమె మంచం మీద నుంచి దిగి, "ఈ పొద్దుట్నుంచి వానికి ఇంట్లో తిండి పెట్టేది లేదు. పాపా, నువ్వు లేచి పొయ్యిలో నీళ్ళు పోసి బొగ్గులు ఆర్పేయ్. ఎసరు కోసం నూక బియ్యం తీసి పెట్టినా. దాన్ని దొంతి మీద పెట్టు" అంది.

మునెమ్మ లేచి ముంతెడు నీళ్ళు తెచ్చి పొయ్యిలో పోసింది. తడిసిన బొగ్గుల్ను, బూడిదను తీసి చేటలో పోసింది. ఎసరు కోసం తీసి ఉంచిన బియ్యాన్ని దొంతి మీద ఉంచింది.

తాను పొయ్యిలో నీళ్ళు పోసిన మరుసటి దినం సాయంత్రం మునెమ్మ నాతో మాట్లాడుతూ, "నేనా పని చేసింది ఆయన



పైన కోపంతో కాదురా. నీకు తెల్సునా. నేనీ ఇంటికి కోడలుగా వచ్చిన రోజునే బొల్లిగిత్త భూమ్మీద పడింది. పెండ్లికొచ్చిన వాళ్లంతా కొత్త పెండ్లి కూతుర్ని చూసింత రువాత కొట్టంలోకి వెళ్లి కొత్తగా పుట్టిన దూడను గూడా చూసి వెళ్లారు. ఈ ఊర్లో ఆయన తరవాత, అత్తమ్మ తరవాత నేను ఎక్కువ సమయం గడిపింది బొల్లిగిత్త తోనే. ఆయనా, నేనూ, అదీ వీధి వెంబడి పోతుంటే, 'అద్దో, సీతారామలక్ష్మణులు పోతా ఉండారు' అని జనం అనడం నేను చెవులార ఎన్నోసార్లు విన్నాను. అట్టాటి గిత్తను అమ్మేస్తారనగానే నాకు మనసులో మనసు లేకుండా అయిపోయింది. నేను పొయ్యిలో నీళ్ళు పోసినా, ఒక పూట తిండి తప్పినా ఆయన అనుకున్నది చేసే తీరతాడని నాకు తెల్సు" అన్నది. వాస్తవానికి ఆమె భావించినట్టుగానే మరుసటి దినం ఉదయం జయరాముడు బొల్లిగిత్తను తోలుకుని పరసకు వెళ్ళిపోయాడు. ఐతే మునెమ్మ చెప్పిందంతా విన్నాక నాకనిపించిందొక్కటే. తను దుఃఖపడుతున్నది జయరాముని కోసమో, బొల్లిగిత్త కోసమో ఆమె తెల్చుకోలేక పోతున్నది.

ఇక ఆ ముగ్గురిని జనం సీతారామ లక్ష్మణులుగా పేర్కొంటారని ఆమె నాకు ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఆ మాట స్వయంగా నేనే వేయిసార్లు వేయిమందితో అని ఉంటాను. ఆ మాట వేయిసార్లు వేయిమంది నాతోనే అని ఉంటారు. ఆ మాట అనని, కనీసం వినని జన్మ మా ఒంటిల్లు గ్రామంలో ఒక్కటి కూడా లేదు. మా ఇంట్లోనైతే మా అమ్మా, నాయన సందర్భం వచ్చినప్పుడల్లా ఆ మాటే అంటుంటారు. ఒకసారి ఒక చుప్పనాతి మనిషి చుట్టపు చూపుగా మా ఇంటికి వచ్చింది. మొగుడు తంతే ఓ పది రోజులపాటు తల దాచుకోవడానికి మా ఇంట్లో తిష్టవేసింది. ఒక దినం ఆ చుప్పనాతి త్రేన్పులు వచ్చేదాక దండగ తిండి తిని, మునెమ్మ విషయం ప్రస్తావించి, "పెండ్లయి ఆరేండ్లయిందంటా ఉండారు. కడుపున ఒక కాయ కాయలేదు ఇచిత్రంగా ఉందే" అన్నది. మా అమ్మ ఎంగిలి నీళ్లను జిల్లేడు చెట్లమీద పారబోస్తూ, "ఏంవి తొందర?

సీతమ్మ తల్లి నీళ్లు పోసుకుని లవకుశుల్ని కనింది ఎప్పుడు? పెండ్లయి పన్నేండ్లయినాక గదా" అంది.




**అ**త్తమ్మ పురమాయింపు పైన మునెమ్మ పొయ్యిలో నీళ్లపోసి, ఎసరుకు పెట్టిన నూకబియ్యాన్ని దొంతిపైన పెట్టి తిరిగొచ్చి మళ్ళీ గడపపైన కూర్చుంది. ఈలోగా సాయమ్మత్త, వీధి తలుపు మూసి, గడియ పెట్టింది. కుక్కి మంచాన్ని తీసుకెళ్ళి తలుపు కడ్డంగా పెట్టింది. అరుగుమీద కూర్చుని, "వాడికి తిండి ఎవరు పెడతారో నేను చూస్తా. అసలు వాడు ఇంట్లోకి ఎట్టొస్తాడో నేను చూస్తా" అన్నది. రొండినుంచి తిత్తిని తీసి తమలపాకులు, వక్కలు చేతిలోకి తీసుకుని, "పాపా... నీ వెనకాల సున్నపు కాయ ఉండాది. ఇట్టందుకో" అన్నది.

మునెమ్మ మెడను, నడుమును వెనక్కు తిప్పి కుడిచేతిని చాచి సున్నపు కాయను



చతుర, విపుల మాసపత్రికల పూర్వ సంపాదకులు చలసాని ప్రసాదరావు రచయిత, చిత్రకారుడు, కళావిమర్శకుడు, కాలమిస్ట్‌గా సుప్రసిద్ధులు. ఆయన వ్యంగ్య, హాస్యస్ఫూర్తి పరిచయస్థులందరికీ తెలిసిందే. అక్టోబరు 27 చలసాని జయంతి సందర్భంగా ఆయన చతురోక్తులు పాఠకులకు ప్రత్యేకం...



# చలసాని చతురోక్తులు



## సన్ని'వేషాలు'

చలసాని చతుర విపుల మాసపత్రికలు నిర్వహించే రోజుల్లో విపులలో పుస్తక సమీక్షలు ఉండేవి కాదు. అయినా సమీక్షార్థమనో, ఆయన అభిప్రాయం కోసమనో కొందరు రచయితలు తమ పుస్తకాలు పంపుతుండేవారు.



అలా ఓసారి వచ్చిన ఓ నవల వెనక పేజీలో రచయిత వివిధ భంగిమల్లో దిగిన ఫొటోలు ప్రచురించారు. దాన్ని ఆసక్తిగా గమనించారు చలసాని. తర్వాత దీనిలోని పాత్రలు, సన్ని'వేషా'లు కల్పితం అని చదివి- ఆయన తనదైన శైలిలో 'సన్నివేషాల కల్పనేమోగానీ, రచయితగారి వేషాల కల్పన భేష్' అన్నారు.

## పారితోషికం

పాత్రికేయులు, పారితోషికాలు అంశంపై చలసానిగారు విసిరే చతురోక్తులు కోకొల్లలు. అలాంటిది ఒకటి-

ఓ మాసపత్రిక చచ్చీచెడీ మాసం తర్వాత మాసం ఈడ్చుకొస్తోంది. పత్రికను నెలనెలా మార్కెట్‌లోకి పంపడమే గగనంగా ఉంది. అలాంటప్పుడు సిబ్బంది జీతాల ఆలోచనే లేదు ఆ సంపాదక యజమానికి.

ఓరోజు ఆయన దగ్గరకు వచ్చిన ఓ ఉపసంపాదకుడు దీనంగా, 'అయ్యా..జీతాలిచ్చి ఆర్నెల్లయింది.. భోజనం చేసి మూడురోజులైంది..' అంటూ వాపోయాడు. అతను మాట్లాడుతుండగానే సదరు సంపాదక యజమాని సొరుగులాగి, దాన్లోంచి శుభలేఖల కట్టబయటపడేసి, అందులోంచి ఒకటి తీసిస్తూ 'ఇదిగోనోయ్.. నీ అదృష్టం. ఇవాళే రిసెప్షన్. వెళ్లి భోంచేసి రా. వచ్చాక మిగిలిన రోజులకు కూడా వీటిలో ఏమన్నా దొరుకుతాయేమో వెదుక్కో' అన్నాడట అతి ఉదారంగా.



అందుకుంటూ ఉండగా ఆమె రవిక రెండు మూడుచోట్ల చిరిగి ఉండడం కిరోసిన్ లాంతరు వెలుగులో సాయమ్మత్త గమనించింది. "రైక ఎట్ట చినిగింది పాపా? వాడు నిన్ను గూడా కొట్టినాడా యట్ట?" అనడిగిందామె.

మునెమ్మ వీపు మీద తడుముకుని, "అదా- బొల్లిగిత్త గోకేసిందత్తమ్మా" అన్నది. సాయమ్మత్త తమలపాకుకు సున్నం రాస్తూ, "అదెట్ట గోకుతుందే? అదేమన్నా కోతా, పిల్లా గోకడానికి?" అనడిగింది.

అప్పుడు మునెమ్మ చెప్పింది. వీధి వెంబడి పరుగెడుతుంటే బోర్లపడి మోకాళ్ళు చెక్కుకు పోయాయని చెప్పినంత సహజంగా, కావలో చీపుర పుల్లలు కోస్తుంటే దూలగొండి తగిలి చేతులు దురద పెడుతున్నాయని చెప్పినంత సహజంగా చెప్పింది. "కాలవ గెడ్డన ఎండుగడ్డి చెక్కతా ఉంటిమి అత్తమ్మా" అంటూ ప్రారంభించి చెప్పింది:

కాలువ గట్టున జయరాముడు నడుం వంచుకుని గడ్డి చెక్కుతున్నాడు. అతని వెనక బారెడు దూరాన మునెమ్మ గూడా నడుం వంచుకుని చెక్కిన గడ్డిని ఏరుతూ ఉంది. గడ్డి వేర్లకు అంటుకుని ఉన్న మట్టి పెళ్ళలను రాల్చి గడ్డిని తట్టలో వేస్తూ ఉంది. ఆమె వెనుక నాలుగు బారల దూరాన బొల్లిగిత్త అయిష్టంగా గడ్డిపరకలను కొరుకుతూ ఉంది. అది ఆడి నెల చివరి రోజులు. ఆకాశంలో కొండలవలె మేఘాలు నల్లరంగులో, బూడిదరంగులో నిలబడి ఉన్నాయి. దూరంగా ఎక్కడో సన్నగా ఉరుముతుండడం వినిపిస్తున్నది. బొల్లిగిత్త మోర పైకెత్తి, ముకుపుటాలెగరేస్తూ కాసేపు గాలిలో వాసన పట్టింది. ఒకసారి కాలు గీరి, ఖణేల్మని రంకె వేసింది. శరీరాన్ని ఒక పక్కకు విల్లులాగ వంచి మునెమ్మ వైపు నాలుగడుగులు జరిగింది. అలా మరొకసారి చేసి మునెమ్మకు చేరువగా వచ్చి అకస్మాత్తుగా తన ముందరి కాళ్ళను పైకెత్తి ఆమె వీపుమీదుంచింది. మునెమ్మ కొయ్యబారిపోయింది. తన శరీరంలో ఒక్క కండరాన్ని గూడా కదిలించకుండా, ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గూడా బిగబట్టి లిప్తకాలం అలాగే ఉండి ఆ తరువాత భయంతో కెవ్వున కేక వేసింది. జయరాముడు నడుమెత్తి వెనుదిరిగి చూశాడు. బొల్లిగిత్త ముందుగా ఎడమ కాలును, ఆ తరువాత కుడికాలును ఆమె వీపు మీద నుంచి దించుతూ ఉంది. దాని కాలి గిట్టలకుండిన నాడాలు చిక్కుకుని రవిక రెండు మూడు చోట్ల చినిగింది.

చాలా రోజుల తరవాత సాయమ్మత్త నాతో మాట్లాడుతూ, "మునెమ్మ చెప్పేది ముగించేటప్పటికి నా పేగులు నీళ్ళయిపోయినాయిరా సినబ్బా. పాపమేది పుణ్యమేది అని తెగజెప్పాల్సి వచ్చినప్పుడు దేవానుదేవతలే ఒక్కొక్కసారి ముందూ యనకా అయినారు. మనుషులం. మనమెంత? జైగాడిలో వాళ్ల నాయన గుణాలు ఒగిటోగిటే కనబడతా ఉండాయి. వాడికి మీసాలొచ్చినప్పట్నుంచి ఇది గెంవనిస్తానే ఉండాను. ఇక ఆ గొడ్డు ఒక్క దినం గూడా ఇంట్లో ఉండకూడదనిపించిందిరా. అది ఇంట్లో ఉన్నంతసేపు ఇంట్లో ఏ మూలనో నాగు ఉన్నట్టే ఉంటుంది"

ఆమె రవిక రెండు మూడుచోట్ల చిరిగి ఉండడం కిరోసిన్ లాంతరు వెలుగులో సాయమ్మత్త గమనించింది. "రైక ఎట్ట చినిగింది పాపా? వాడు నిన్ను గూడా కొట్టినాడా యట్ట?" అనడిగిందామె.

అన్నది. నా ఇరవై ఏండ్ల వయసు నేర్పిన అనుభవంలో ఆలోచించగా ఆమె చెప్పింది సబబేనని నా కనిపించింది.

మునెమ్మ చెప్పిందంతా విన్నాక సాయమ్మత్తకు పేగులు నీళ్ళయి పోతున్నట్టు, ఒంట్లో ఉండే రక్తం ఒక్కొక్క బొట్టే బయటకు వెళ్ళిపోతున్నట్టు అనిపించింది. సున్నం రాసిన తమలపాకును ఆమె మడత పెట్టలేదు. అలాగే అరుగుమీద ఉంచింది. చాలా సేపు మౌనంగా అరుగు మీద కూర్చుని తరవాత భారంగా అరుగు దిగింది. పన్నెండు మెట్లబావి అడుగు నుంచి వస్తున్నట్లున్న బలహీనమైన స్వరంతో, "పాపా సగం రాత్రి అవతా ఉంది. వాడు వస్తా ఉంటాడు. రాగానే ఆకలాకలంటాడు. ఎప్పుడో మద్యాహ్నం తిన్నదేగదా. పొయి ముట్టించి ఎసరు పెట్టు. చింతపండు తీసి చారు పెట్టు" అన్నది. తాను వెళ్ళి వీధి తలుపుకడ్డంగా ఉంచిన మంచాన్ని తీసివేసింది. గడియ తీసి తలుపు బార్ల తెరచి పెట్టింది.




అర్ధరాత్రి దాటాక జయరాముడు కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వచ్చాడు. పెరట్లో కాళ్లు చేతులు కడుక్కొని మంచం మీద కూర్చోబోతుండగా సాయమ్మత్త, "కూచుంటా ఉండావేందిరా. అన్నం తిందువు రా" అన్నది.

జయరాముడు, "మీరు తిని పడుకోండి. నేను పోటుమిట్టలోనే తినొచ్చినా" అని మంచం మీద వెలకిల పడుకున్నాడు.

"తరుగులోనితో మాట్లాడినావా?"

"మాట్లాడినా. రేపు దాన్ని పరసకు తోలుకుపోయి అమ్మేయ్యడమే"

"తరుగులోడు కొనడంటనా?" అనడిగింది సాయమ్మత్త.

"వాడు గొడ్ల వ్యాపారం తగ్గించుకున్నాడు. ఆ మిలిటరీ వాళ్ళు వచ్చినప్పటి నుంచి వాడు వేరే వ్యాపారాలు జేస్తా ఉండాడు గదా"

"మరి నువ్వొక్కడవే యట్టబోతావు? మద్దిపాలెమంటే అదేమి చిన్నాబన్నా దూరమా? కానరాని రాజ్జిం గదా. ఆ పక్కంతా మోసకారి జనమంట. నాలుగు నూర్లు జేసే గొడ్డు పక్కనుంటే ఎవునికి ఏ బుద్ధి పుడుతందో?"

జయరాముడు తల కింద చేతులు పెట్టుకుని, "ఔ. ఆ పక్కన జనం కన్ను అట్టుండగానే కంటిపాపను కత్తిరించే టోళ్ళు. వాళ్ళలో సగంమందికి మన మాటే అర్తంగాదు. నేను పోయేపని దీన్ని అమ్మేయ్యడం ఒకటే కాదుగదా. దీన్ని అమ్మిన దుడ్డుతో ఇంకొక గొడ్డును పట్టుకోవాల" అన్నాడు.

అమ్మే బేరం, కొనేబేరం ఇవన్నీ నువ్వొక్కడవే యట్ట జేసుకుంటావు? గొడ్లబేరాలు నువ్వెప్పుడూ చేయలేదు. నాలుగు దిక్కులు తిరిగేటోడిని వెంటబెట్టుకు పోరాదా"

"ఎవుడో ఎందుకు తరుగలోడే వస్తానన్నాడు. మొదట రానన్నాడు. నేను అడగంగ అడగంగ వచ్చేదానికి వొప్పుకున్నాడు"

"వాడొస్తే పని మంచినీళ్ళు తాగినంత సులువు" అని సాయమ్మత్త కాసేపు ఊరుకుని,

"ఎప్పుడు బయల్దేరేట్టు అనుకున్నారు?" అనడిగింది.

"రేపే. రేపు తెల్లవారుజామున బయలు



దేరాలి"

వాళ్ళిద్దరు మాట్లాడుకుంటున్నప్పుడు తన అత్త ముఖాన్ని చూడడానికి మునెమ్మ చాలా ప్రయత్నించింది. నడవలో కిరోసిన్ లాంతరు వెలుగుతున్నప్పటికీ కొట్టం తాలూకూ రాతి స్తంభం నీడ సాయమ్మత్త ముఖంమీద పడుతుండడం వల్ల ఆమె ముఖంలో ఏలాంటి భావాలు కదులుతున్నదీ మునెమ్మకు అర్థం కాలేదు.

మరుసటి దినం సాయంత్రం మునెమ్మ నాతో మట్లాడుతూ, "నాకేవీ అర్థం కాలేదురా సినబ్బా. ఆయన రాగానే



అత్తమ్మ ఆయనతో పోట్లాడి బొల్లిగిత్తను అమ్మకుండా చూస్తుందనుకున్నాను. దాన్ని అమ్మెయ్యాలనే తొందర ఆయనకన్నా ఈమెకే ఎక్కువగా ఉన్నట్టుంది. ఈళ్ళ యవారం నీకేఁవన్నా అర్ధమయిందా? " అనడిగింది.

నేనేమీ చెప్పలేదు. తొడిమ మీద మల్లె పువ్వు తెల్లగా ఉంటుంది. తొడిమ మీదున్నంతా కాలమైనా అది తెల్లగానే ఉండాలన్నది నా కోరిక. ఆకుమీద మంచు బిందువు ముత్యంలా ఉంటుంది. ఆకు మీదున్నంత కాలమైనా అది ముత్యంలాగే ఉండాలన్నది నా కోరిక.

జయరాముడు మంచం మీద వెల్లకిల పడుకుని అరచేతులను తలకింద పెట్టుకుని రేపు ప్రారంభం కానున్న తన ప్రయాణ వివరాలను తల్లికీ, భార్యకు చెప్పాడు.

**ప్రయాణించవలసిన దూరం:** ఒంటిల్లు నుండి మద్దిపాలెంకు నలభై రెండు మైళ్ళు. రాను, పోను మొత్తం ఎనభైనాలుగు మైళ్ళు.

**రోడ్డు పరిస్థితి:** ఆద్యంతం కంకరవేసిన రోడ్డు. రోడ్డుకిరువైపుల చిన్న పెద్ద గ్రామాలు పది, పన్నెండున్నాయి. మధ్య ఓ నాలుగు మైళ్ళు ఒక చిట్టడవిగుండా ప్రయాణం సాగుతుంది. అది క్రూరమృగాలకు, బందిపోటు దొంగలకు కాణాచి. ఆ అడవి గుండా ఒంటరి ప్రయాణం ప్రమాదకరం.

**ప్రయాణంలో తోడు:** జయరాముడు బొల్లిగిత్తను పట్టుకుని మొదటి ఐదు మైళ్ళు నడచి పోటుమిట్ట చేరుతాడు. అక్కడ తరుగులోడు కలుసుకుంటాడు. అక్కడ నుంచి వాళ్ళిద్దరు కలిసి మద్దిపాలెం వరకు ప్రయాణిస్తారు.

**ప్రయాణ పరమార్థం:** మద్దిపాలెంలో ఏడాది కొకసారి జరిగే ఎద్దుల పరసలో బొల్లిగిత్తను అమ్మెయ్యడం. ఆ డబ్బుతో మరొక ఎద్దును కొనుక్కోవడం. గొడ్ల వ్యాపారంలో విశేష అనుభవం ఉన్న తరుగులోడు తగిన సహాయం చేస్తాడు.

**ప్రయాణ సాధనాలు:** అటువైపు వెళ్ళే రైళ్ళు లేవు. బస్సులు తిరుగుతాయిగాని అవి జయరాముని కార్యక్రమానికి అనువుగా లేవు. కనుక ప్రయాణం యావత్తూ

కాలినడకనే జరుగుతుంది.

**వసతులు:** దారిలో ఒకచోట నాగుల మర్రి అనే ఊరి వద్ద పూటకూళ్ళిల్లు ఉంది. అక్కడ భోజనానికి, వసతికి రోజుకు రెండణాలు తీసుకుంటారు.

**కార్యక్రమం:** ఆదివారం ఉదయం తొలి కోడికూతలో జయరాముడు ఒంటిల్లు గ్రామం నుండి బయలుదేరుతాడు. పొద్దు పుడుతుండగా పోటుమిట్ట చేరుతాడు. అక్కడనుండి తరుగులోడితో కలిసి ప్రయాణించి చీకటిపడుతుండగా నాగుల మర్రి చేరుతాడు. ఆ రాత్రి పూట కూళ్ళింటిలో బసచేసి, సోమవారం ఉదయానికి మద్దిపాలెం పరసను చేరుతారు. బేరసారాలు చేసి బొల్లిగిత్తను అమ్మి, కొత్త గొడ్డును పట్టుకునేటప్పటికి సాయంత్రమవుతుంది. వెంటనే తిరుగు ప్రయాణం ప్రారంభించి ఆ రాత్రంతా ప్రయాణించి మంగళవారం పొద్దు కరకరపడుతుండగా జయరాముడు కొత్త గొడ్డుతో ఒంటిల్లు చేరుతాడు.

జయరాముడు తన ప్రయాణ వివరాలన్నీ చెప్పి, "ఇక మీరు పోయి పడుకోండి. నేనొక కునుకుతీస్తా. రేపు ఓపినంత దూరం నడవాలి" అని అటువైపు తిరిగి పడుకున్నాడు.




ఆదివారం ఉదయం జయరాముడు బొల్లిగిత్తను తోలుకుని మద్దిపాలెం పరసకు బయలుదేరి వెళ్ళిపోయాక మునెమ్మ దిక్కుతోచకుండా మా ఇంటికొచ్చింది. తన భర్తను గురించి మాట్లాడుతూ చాలసేపు కూచుంది. "మంగళవారం పొద్దిటికి తిరిగొస్తానని చెప్పినాడురా. ఏడేడ తిరిగేది, ఏఁవేఁవి జేసేది అన్నీ యిలావరిగా చెప్పినాడుగాని, చెప్పేటప్పుడు నావైపుగాని, అత్తమ్మవైపు గాని చూడనేలేదు. ఆకాశంలో సుక్కల్ను చూసుకుంటా, ఆడేదో పుస్తకం ఉంటే దాన్ని చూసి చదివినట్టు చెప్పినాడు" అంది మునెమ్మ.

మంగళవారం తొలికోడి కూయకముందే మునెమ్మ నిద్ర లేచింది. ఇంటినీ, ఇంటి ముందున్న నడవను, పశువుల కొట్టాన్ని శుభ్రంగా ఊడ్చింది. ఇల్లంతా పేడతో అలికింది. నడవలో ఒత్తుగ కలాపి చల్లింది. ముగ్గుబుట్ట చేతబట్టుకుని అలికిన ఇంటిలో ముగ్గులు వేసింది. ఆ తరవాత నడవలో రెండు ముగ్గులు వేసి, నడుమెత్తి తూర్పు వైపు చూసింది. తూర్పున పటమెగిరింది. పొగడ చెట్టుమీదున్న కాకులు నిద్ర మేల్కొన్నాయి. అవి తమ ఆహారాన్వేషణకు ఆయత్తమవుతున్నాయి.

మునెమ్మ మళ్ళీ నడుం వంచి మూడో ముగ్గు వేయడం ప్రారంభించింది. శాశ్వతంగా కనుమరుగైపోయిన బొల్లిగిత్తను గురించిన ఆలోచనలు ఒకవైపున, ఇక కాసేపట్లో కనిపించబోయే జయరాముని గురించిన ఆలోచనలు ఇంకొకవైపున ఆమె మస్తిష్కాన్ని పూర్తిగా కమ్మివేశాయి. మూడవ ముగ్గును పూర్తిచేస్తుండగా పొగడచెట్టు మీదున్న కాకులు ఒక్కసారిగా కావుకావుమని రావిడి ప్రారంభించాయి. మునెమ్మ ముగ్గుబుట్టను కిందబెట్టి, నడుమెత్తి, వీధితలుపు వైపు చూసింది.

ఆమె తన కళ్ళను తాను నమ్మలేకపోయింది. వీధి తలుపుకవతల జయరాము




# ఒంటరి ప్రయాణం



## 'నమ్మకమే' లేకుంటే బతుకేదీ?

**మైక్** మేకిన్‌టైర్ (39) జేబులో పెన్నీ కూడా లేకుండా అమెరికాలోని ఓ చివర నించి ఇంకో చివరికి కాలినడకన ప్రయాణం చేశాడు సాటి అమెరికన్స్ దయమీద ఆధారపడుతూ.

శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి నార్త్ కరోలినా లోని కేప్ టౌన్ దాకా ప్రయాణించాడు. ఓ రోజు మైక్ కారులో వెళ్తూంటే, చేతిలో పెట్రోల్ కేన్‌తో నిలబడి లిఫ్ట్ ఇవ్వమని చెయ్యి ఎత్తిన ఒకతన్ని చూసిన మైక్. అతను దొంగనుకుని కారు ఆపకుండా ముందుకి వెళ్ళిపోయాడు. అయితే అది అతన్ని ఎంతో మానసిక వేదనకి గురి చేసింది. ఇలా అమెరికాలో ఒకర్నొకరు నమ్మకపోతే ఎలా అన్న ఆలోచన కలిగింది. అమెరికన్స్ ఎలాంటి వారో స్వయంగా తెలుసుకోవాలన్న కోరికలోంచి ఈ ఒంటరి ప్రయాణం ఆలోచన అతనికి కలిగింది.

సెప్టెంబర్ 1994న దినపత్రికలో జర్నలిస్ట్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి కాలి నడకన బయలుదేరాడు. స్లీపింగ్ బేగ్, ఓ జత దుస్తులు తప్ప అతని దగ్గర ఇంకేం లేవు- పెన్నీ కూడా లేదు.

అతను అమెరికాని క్రాస్ చేయడానికి ఆరు వారాలు పట్టింది. దారిలోని 30 కుటుంబాలు అతన్ని నిద్ర పోవడానికి తమ ఇళ్ళల్లోకి ఆహ్వానించాయి. ఐశ్వర్యవంతులు, బీదవాళ్ళు, తెలుపు, నలుపు, వృద్ధులు, యువకులు... అన్ని రకాల వారు అతనికి సహాయం చేశారు.

తమ ఇంట్లోకి కొత్త వ్యక్తిని ఆహ్వానించడం రిస్క్ అని తెలిసీ వారు ఆ పని చేశారు. ఓ కొత్త వ్యక్తి రోడ్డు పక్క పడుకునే బదులు వారు ఆ రిస్క్ తీసుకోవటం అతనికి సంతోషాన్నిచ్చింది.

ఐతే మొదటి మూడు రోజులు మైక్ పస్తులుండాల్సి వచ్చింది. మూడోరోజు రాత్రి ఓ ఫైర్ మేన్ మైక్‌కి భోజనం పెట్టించాడు. పెద్ద ఊర్లకి, హైవేలకి దూరంగా గ్రామాల్లోనే ప్రయాణించాడతను.

చిన్న ఊళ్లల్లో పోస్టాఫీస్‌లు, టౌన్ స్క్వేర్‌ల దగ్గర కూర్చుంటాడతను. ఆ ఊరి ప్రజలు వచ్చి అతనితో మాట్లాడతారు. దయగలవారు తమ ఇంటికి అతన్ని భోజనానికి ఆహ్వానిస్తారు.

ఓ యువతి తన లక్కీ వస్తువైన కెనేడియన్ నాణాన్ని అతనికి ఇచ్చింది. అయోవా రాష్ట్రంలోని ఓ యువతిని ఓ స్టోర్‌లో పని చేస్తుండగా దొంగలు వచ్చి చితక్కొట్టి నగదు ఎత్తుకెళ్లిన అనుభవం ఉన్నా ధైర్యంగా మైక్‌ని తన ఇంటికి ఆహ్వానించింది.

ఓ కొత్త వ్యక్తి అతని మోటెల్ అద్దెని చెల్లించాడు.

మైక్ గర్ల్ ఫ్రెండ్ పంపిన క్రెడిట్ కార్డ్‌ని కేఫ్ టేన్ పోస్టాఫీస్ నించి తీసుకుని ఏటియంలోంచి డబ్బు డ్రా చేసి మళ్లీ పూర్వ జీవితంలోకి ప్రవేశించాడు.

తన అనుభవాలని 'ది కైండ్‌నెస్ ఆఫ్ స్ట్రేంజర్' అనే పుస్తకంగా రాశాడు మైక్.

## చెత్తకథల పోటీ

ఓసారి ఓ వారపత్రిక 'ఉత్తమ చెత్తకథల పోటీ' అని ప్రకటించింది. అందరూ ఆ ప్రకటనను చూసి చెవులు కొరుక్కున్నారు. 'ఫలానా పత్రికవాళ్లు చెత్తకథల పోటీ అని ప్రకటించారు సార్' అని చలసానికి ఆయన స్నేహితుడెవరో చెప్పారు.

'మళ్లీ ప్రకటించడం ఎందుకు దండగ? వాళ్లు వేసేవి ఎలాగో చెత్తకథలేగా?' చిరునవ్వులు చిందిస్తూ జవాబిచ్చారు చలసాని. దటీజ్ చలసాని.




డికి బదులు బొల్లిగిత్త కనిపించింది. అది వీధి తలుపుగుండా లోపలికొచ్చి నడవ గుండా నడుస్తూ, కుడితితొట్టి వద్దకు వెళ్ళింది. అది ఖాళీగా ఉండడంతో పెరడులోకి నడిచి నీళ్ళ తొట్టిలోకి మోరవంచి నీళ్ళు తాగసాగింది.

అలా నీళ్ళు తాగుతున్నది బొల్లిగిత్త కానట్టు, దాని ప్రేతం అయినట్టు మునెమ్మ గుడ్లు వెళ్ళబెట్టుకుని చూసి, "అత్తమ్మా... ఇట్లొచ్చి సూడు" అని గట్టిగా అరిచి పిలిచింది.

సాయమ్మత్త కొంగుకు చేతులు తుడుచుకుంటూ బయటకొచ్చింది. బొల్లిగిత్తను చూసి, అవాక్కయిపోయి నిలబడి, ఆ తరవాత తేరుకుని, "ఇదెట్ల వచ్చేసింది? వాడు గూడా వచ్చినాడా?" అన్నది. తనున్నచోటే నిలబడి చుట్టూ చూసింది. కొట్టంలోకి తొంగిచూసింది. తరవాత వీధి తలుపు గుండా బయటకు వెళ్ళి, వీధిలో నిలబడి చూసింది. జయరాముడు కనబడలేదు. అల్లంత దూరాన కంకర రోడ్డు మీద నుంచి దిగి ఒక గొర్రెల మంద ఇటే వస్తుండడం గమనించి అలాగే నిలబడింది. మంద చేరువగా వచ్చాక, ఎవురు మంద వెనక వచ్చేది? ... నరసిమ్మా. ఆడేడన్నా మావాడు కనిపించినాడా?" అనడిగింది. తనకు కనిపించలేదని చెప్పి అతడు మందను కొట్టుకుంటూ వెళ్ళిపోయాడు.

సాయమ్మత్త మళ్ళీ లోపలికొచ్చింది. అప్పటికి బొల్లిగిత్త కడుపుబ్బరించేలా నీళ్ళు తాగి, కొట్టంలోకి వెళ్ళి పడుకుంది. బొల్లిగిత్త ఎలా తిరిగొచ్చింది? జయరాముడు ఎందుకు దాని వెంట రాలేదు? వాడు ఎక్కడున్నాడు? తరుగులోడు ఏడీ? అసలు వీళ్ళు పరసకు వెళ్ళారా? బొల్లిగిత్త అమ్ముడయిందా? కొత్త గొడ్డును పట్టుకున్నారా? అది ఏమయింది?

ప్రశ్నలు, ప్రశ్నలు.

ప్రశ్నల భారంతో నడుములు, మోకాళ్ళు వంగుతుండగా అత్తా, కోడళ్ళు పొగడ చెట్టునీడన కూర్చున్నారు. సూర్యుడు క్రమక్రమంగా పైకెక్కి వస్తున్నాడు. ఎండమూలాన కొంతసేపటికి కలాపినీళ్ళ తేమ ఆరిపోయింది. తేమ ఆరిపోయాక పిండి ముగ్గు స్పష్టంగా కనబడసాగింది.

ఇలాంటి క్లిష్ట పరిస్థితులొచ్చినప్పుడు సాయమ్మత్త నేరుగా మా ఇంటికొచ్చేస్తుంది. వాళ్ళు మాకు చాలా దగ్గర బంధువులే. ఐతే ఆ బంధుత్వంలో నా కర్థంకాని తకరారు ఒకటుంది. మా నాయన వైపు నుంచి వెదుక్కుంటూపోతే సాయమ్మ నాకు అత్త అవుతుంది. జయరాముడు బావ అవుతాడు. మునెమ్మ అక్క అవుతుంది. మా అమ్మవైపు నుంచి వెదు



క్కుంటూ పోతే వాళ్ళు నాకు వరుసగా పెద్దమ్మ, అన్న, వదిన అవుతారు. ఆ తక రారు కత ఎలా ఉన్నా జయరాముడికి ఈ సంబంధం తెచ్చిందీ, పెండ్లి పెద్దగా నిల బడి అన్ని పనులు చేసిందీ మా నాయనే.

ఆ పెండ్లి పత్రికను మా ఇంటి తలుపు మీద నేనే అతికించాను. అక్కడది రెండు సంవత్సరాలపాటు చెక్కుచెదరకుండా ఉండింది. ఆ తరవాత ఎండకు, వానకు



వెలిసిపోయి క్రమక్రమంగా చినిగిపో యింది. ఆ పత్రిక పసుపు రంగులో ఉండి అక్షరాలు ఎరుపు రంగులో ఉండేవి. ఆ అక్షరాలు ఇప్పటికీ నాకు కంఠపాఠమే.

"వివాహ శుభలేఖ

స్వస్తిశ్రీ పార్థివనామ సం॥ మాఘ బహుళ తదియ గురువారమునకు సరి యగు **16–2–1939** తేదిన ఉ॥గ॥ **10–15** ని॥లకు ఉత్తర నక్షత్ర యుక్త మేషలగ్న పుష్కరాంశమున ఒంటిల్లు గ్రామ వాస్తవ్యుడు తడకల దొరసామి రెడ్డి ఏకైక పుత్రుడు చి.జయరామిరె డ్డికి, మొగరాల గ్రామ వాస్తవ్యుడు కాదాటి శంకరరెడ్డి కనిష్ఠ కుమార్తె చి.సౌ.మునెమ్మ అను కన్యకతో కన్యాదాత స్వగృహమున జరుగు శుభ వివాహమునకు తామెల్లరు విచ్చేసి నూతన వధూవరులను ఆశీర్వ దించి, మా ఆతిథ్యమును స్వీకరించి మమ్ము ఆనందింపజేయ ప్రార్థన"

పెండ్లి పత్రికను అచ్చువేసే ముందు తడకల దొరసామిరెడ్డి అనే పేరు ముందర 'స్వర్గీయ' అనే పదం చేర్చాలా వద్దా అని చాలా తర్జన భర్జన జరిగింది. అప్పటికి దొరస్వామి బతికి ఉన్నాడో లేదో ఎవరికీ తెలియదు. ఇప్పటికీ తెలియదు. చివరకు పెద్దమనుషులందరూ కలిసి స్వర్గీయ అనే పదం అవసరం లేదని తీర్మానించారు. ఇక పెళ్ళి పందిట్లో బ్రాహ్మణుడు ఇంకోరకం పేచీ పెట్టాడు. కన్యాదానం స్వీకరించే సమయంలో స్వీక ర్తగా మా నాయన నిలబడ్డాడు. ఐతే ఆయన పక్కన సాయమ్మత్త నిలబడరా దని, అది శుభం కాదని బ్రాహ్మణుడు అభ్యంతరం చెప్పాడు. పెద్దమనుషులు అతన్ని బుజ్జగించి ఒప్పించాల్సి వచ్చింది 'అయితే మీ ఇష్టం' అంటూ చివరి కతడు ఒప్పుకున్నాడు.

మా నాయన జయరామునికి తెచ్చినది తగిన సంబంధం కాదని ఆయన ముందర్నే ఊర్లో ఒకరిద్దరు విమర్శిం చారు. "వీడేమో ఉతాళం మనిషి. కుండా కుదురుగా బతికేటోడు కాదు. ఇప్పటికే వానికి వాళ్ళ నాయన బుద్ధు లన్నీ వచ్చేసినాయి. ఆ పిల్ల జూస్తే ఎర్రి బాగుల్ది మాదిరుండాది. బండకింద కప్ప మాదిర బతకడమేగాని.. తూర్పు ఏదీ, పడమర ఏదీ అని తెలిసిన మనిషి మాదిరి లేదు. వానితో యట్ల ఏగు తుందో ఏమో" అన్నారు వాళ్ళు. మా నాయన, "కొరివి పక్కన కొరివి ఉంటే పూటకొక చిట్లాకుప్ప తగలబడిపోతుంది. కొరివి పక్కన ఎప్పుడూ నీళ్ళకుండే ఉండాలి" అని వాళ్ళకు సమాధానమి చ్చాడు. గ్రామంలో అత్యధికులు మా నాయనతో ఏకీభవించారు.




**బొ**ల్లిగిత్త ఒంటరిగా తిరిగి రావడంతో కరచరణాలాడని క్లిష్ట పరిస్థితిలో సాయ మ్మత్త మా ఇంటికి వచ్చింది. అప్పటికి భళ్ళున తెల్లవారింది. కణతల మీదనుంచి చెమటలు కారుతుండగా, కళ్ళలో నీళ్ళు చిప్పిలుతుండగా ఆమె మా ఇంటి అవర ణలో అడుగుపెట్టింది. మా నాయన విరి గిన నాగలిని మరమ్మత్తు చేయించడానికి దానిని భుజమ్మీదుంచుకుని వడ్రంగి వద్దకు అప్పుడే బయలుదేరుతున్నాడు. మా అత్తమ్మ రావడం చూసి, ఆమె

# ఊరికిద్దరు

## చతురప్రపంచం




**నా**ర్త్ డకోటాలోని మెర్రీ కోర్ట్ అనే గ్రామ జనాభా 1978లో 15. కానీ ఇప్పుడు రెండే. వారు మిస్టర్ ఎమిల్ గ్రైస్లర్, మిసెస్ ఎల్సీ గ్రైస్లర్.

గత కొన్నేళ్లలో అక్కడి ప్రజలు మరణించడమో, మరో ఊరుకి వెళ్ళిపోవడమో జరుగుతూ వచ్చి వీరిద్దరే మిగిలారు.

“మా ఊళ్లో మేమిద్దరమే సిటిజన్స్ అన్నది మాకు నమ్మశక్యం కాని విషయం అంటుంది 65 ఏళ్ల ఎల్సీ. తన భర్తతో కలిసి ఆమె గత 46 ఏళ్ళుగా మెర్రీ కోర్ట్‌లో నివశిస్తోంది.

“ఇది దయ్యాల ఊరు అనిపించేలా ఉంది. ఎటు చూసినా మట్టి కొట్టుకుపోయిన రోడ్లు, శిథిలమవుతున్న భవంతులు” అంటాడు ఎమిల్.

ఆ ఊళ్ళో జింకలు, కుందేళ్లు స్వేచ్ఛగా తిరుగుతుంటాయి. ఎక్కువగా జింకలు ఒకేసారి ఊళ్లోకి వస్తుంటాయి.

1940లో ఈ ఊరి జనాభా 153 మంది. అప్పట్లో ఇక్కడ ఓ ఛీజ్ ఫ్యాక్టరీ, రేడియో స్టేషన్, కొన్ని దుకాణాలు, రెండు బ్యాంకులు, ఓ చర్చి ఉండేవి. ఇప్పుడు అవేమీ లేవు.

75 ఏళ్ల వయసుగల ఇంట్లో నివశించే వీరికి అతి సమీపంలో ఉన్న దుకాణం 23 మైళ్ల దూరంలో, డాక్టర్ 30 మైళ్ల దూరంలో ఉన్నారు.

వారు ఒంటరిగా ఆ ఊళ్లో నివశించడానికి కారణం, డ్రగ్స్ నేరస్థులు, ఆస్తి పన్నులాంటి సమస్యలు లేకపోవడం. ఆ ఊరిని వదిలి వెళ్ళిన ప్రజలు తమ ఆస్తులని కొనేవాళ్ళు లేక ఎవరికీ అమ్మలేదు. వీళ్లకే ఈ ఊళ్ళో మరో మూడు ఇళ్లున్నాయి. ఒక్కోదాని ధర 100 డాలర్లు మాత్రమే!

అరుదుగా యాత్రికులు ఈ ఊరిని చూడటానికి వస్తుంటారు. ఎప్పుడైనా వాళ్ళు కనపడితే, ఏ ఇంటి చాటునించో ఎమిల్, ఎల్సీలు సరదాకి దయ్యాల్లా అరుస్తారు. చాలామంది భయపడి పారిపోతుంటే ఆపి నిజం చెప్తారు.

జూన్ 1990లో ఈ ఊరికి వందేళ్ల ఉత్సవం జరిగింది. సమీపంలోని ఊళ్లోనించి వచ్చిన అనేక వందలమంది, వీరిద్దరినీ కారులో ఊరేగించారు.

“వీళ్లు లేకపోతే ఆ ఊరు ఏనాడో చచ్చిపోయేది. ఎమిల్, ఎస్సీల వల్లేమెర్రీకోర్ట్ బతుకుతోంది” అన్నారు వాళ్ళు.

వాలకం చూసి మా నాయన నాగలిని దించి గోడకు ఆనించాడు. సాయమ్మత్త, "నాకు కాళ్ళు చేతులు ఆడడం లేదన్నా. కండ్లు బూసులు కమ్మకపోతా ఉండాయి" అంటూ నేలమీదనే కూర్చుని, మొన్న జయరాముడు బయలుదేరి వెళ్ళడము, ఈ దినం ఉదయం బొల్లిగిత్త ఒంటరిగా తిరిగి రావడమూ వివరించి చెప్పింది.

మా నాయన ఆమె చెప్పిందంతా విని, విన్నదంతా ఒకసారి వల్లె వేసుకుని, తిన్నె మీద కూర్చుని, దూరంగా చూస్తూ, "సూడబోతే పరికి మీద పరిచిన గుడ్డ మాదిరుంది యవారం. నువ్వు ఊరికే ఏడ్సి ఆగడం చేసేదెందుకు? బుద్ధి సోదీనంలోకి తెచ్చుకో. ఇదేఁవి నెత్తిబరువా దించుకోవడానికి" అన్నాడు. ఆ తరవాత నావైపు తిరిగి, "ఆ మడక తీసుకపోయి ఆచారి ఇంట్లో దించి రారా. వాడు దానికోసరం దోవచూస్తా ఉంటాడు" అన్నాడు. నేను నాగలిని ఎత్తి భుజాన పెట్టుకుని వడ్రంగి ఇంటికి బయలుదేరాను.

ఆ దినం చాలసేపు మా అత్తమ్మ, మా నాయన మాట్లాడుకున్నారు. చివరకు మా నాయన "వాడేఁవన్నా పసిబిడ్డా? ఆ తరుగులోడు గూడా తోడు ఉండాడు గదా, రేపు మావిటేళదాక సూద్దాం. అప్పటికీ రాకుంటే ఏఁవిజెయ్యాల్నో ఆలోచిద్దాం. అంతగా అయితే నేనే మద్దిపాలెం దాక పొయ్యొస్తా. ఆడ నాకు తెలిసినోళ్ళు శానా మంది ఉండారు" అన్నాడు.

ఆ రాత్రి మునెమ్మ ఇంట్లో పొయ్యి వెలగలేదు. మా ఇంట్లోంచే అన్నం, కూర వచ్చింది. సాయమ్మత్త, మునెమ్మ తిన్నసాంగించేసి చేతులు కడుక్కున్నారు. ఇరుగు పొరుగువాళ్ళు చాలమంది పలకరించడానికి వచ్చారు. వచ్చిన వారందరికీ ఎవరికి తగినట్టు వారికి సాయమ్మత్తే సమాధానాలు చెప్పింది. మునెమ్మ మోకాళ్ళమీద తల ఉంచుకుని ఇంటి గడపమీద కూర్చుంది. ఆ కూర్చున్న భంగిమను, ఆ మౌనాన్ని చూసి ఆమెతో మాట్లాడడానికి ఎవరూ ప్రయత్నించలేదు. ఆమె ఒక్కసారి గూడా తల పైకెత్తలేదు. సగం రాత్రి దాటాక వాళ్ళందరూ వెళ్ళిపోయారు. ఆ రాత్రి వాళ్ళింటిలోనే పడుకొమ్మని మా అమ్మ నాకు చెప్పింది.

మునెమ్మ, సాయమ్మత్త నట్టింట దీపం ఆర్పేసి చాపలు పరచుకుని ఇంట్లో పడుకున్నారు. నేను నడవలో మంచం వాల్చుకుని పడుకున్నాను. కిరోసిన్ లాంతరును ఆర్పి వేయకుండా, వత్తిని బాగ తగ్గించి మంచం పక్కన ఉంచాను.




ఇక కాసేపట్లో ఆకాశంలో గుడ్డిచుక్క పుట్టబోతుందనంగా నిద్రలో మునెమ్మకు ఒక కల వచ్చింది. మరునాడు కంకర రోడ్డుమీద నడుస్తున్నప్పుడు తనకు వచ్చిన కలను నాకు వివరించి చెప్పింది. ఆ వివరాలను ఆమె సాయమ్మత్తకు కూడా చెప్పలేదు. కల చాలా భయంకరమైనది. వింటుంటే నాకు ఒళ్ళు జలదరించింది.

"ఈ కలను గురించి అత్తమ్మకు ఎందుకు చెప్పలేదు?" అనడిగాను కంకర రోడ్డుమీద నడుస్తూ.




## నీటిలో వేట

'కోటి విద్యలు కూటికొరకే' అన్నట్లు ఉదర పోషణార్థం నీళ్లలోపల ఇలా వేటాడే పక్షులను మీరెక్కడైనా చూశారా? గిల్లిమోట్ అనే అరుదైన బాతుజాతికి చెందిన ఈ పక్షులు ఆర్కిటిక్ ఖండంలో ఉంటాయి. ఇవి నీటిలో రెండున్నర నిముషాలపాటు గడపడమేకాక యాభై మీటర్ల లోతువరకూ వెళ్లి చేపల్ని వేటాడగలవు.



"చెప్పలేదురా. నీ కొడుకు ఇక భూమ్మీద లేడు అని చెప్తే ఏ తల్లయినా తట్టుకోగ లదా? నీ విషయం వేరు. నువ్వు ఆయ నను నవమాసాలు మోసి కనలేదు గదా" అంది మునెమ్మ.

జయరాముడు ఈ భూమ్మీద లేడనే నమ్మకం మునెమ్మలో ఎప్పుడు ప్రారంభ మయింది? ఒంటరిగా తిరిగి వచ్చిన బొల్లి గిత్త కనబడినప్పుడు ప్రారంభమయింది. ఆ రాత్రి కలలో కనబడిన దృశ్యాలు ఆ నమ్మకాన్ని పరిపూర్ణం చేశాయి. ఆ నమ్మకం ఆమెలోని అణువణువును ఆక్ర మించుకుంది. తన నమ్మకాన్ని ఆమె నాకు చెప్పినప్పుడు అది ఆమెలో ఉన్న మూర్ఖ త్వానికి పరాకాష్ఠ అని భావించాను. కాని అది మూర్ఖత్వం కాదు, అంతః దృష్టి అని మరి నాలుగు రోజుల తరవాత నాకు అర్థ మయింది. విపరీతమైన వేదన ద్వారా సిద్ధించిన యోగమే ఈ అంతః దృష్టి అని కూడా నాకు అర్థమయింది.

కలలో మునెమ్మ చేద బావినుండి నీళ్ళు చేదుతూ ఉంది. సాధారణంగానైతే రెండు బొక్కెనలతో నిండిపోయే బిందె ఇప్పటికే ఆరు బొక్కెనలు చేది పోసినా నిండలేదు. మునెమ్మ ఏడవ బొక్కెనను చేదుతూ ఉంది. బొక్కెన మరీ భారంగా, చేంతాడు చివర ఒక పెద్ద గుండు ఉన్నట్టుగా అని పిస్తూ ఉంది. మునెమ్మ జబ్బల సత్తువ నంతా ఉపయోగించి చేదుతూ ఉంది. అప్పుడు మునెమ్మ ఒక విషయం గమనిం చింది. తన చేతులలో ఉన్నది కొబ్బరి పీచుతో పేనిన చేంతాడు కాదు. వెంట్రుక లతో పేనిన సన్ననిదారం ఆమె చేతుల్లో ఉన్నది. అది తనూ, జయరాముడు కలిసి పేని బొల్లిగిత్త ముకుతాడుకు వేసి ఉండిన పగ్గమే. ఆ సన్నటి దారంతో చేదుతూ ఉంటే అరచేతులు మంటలు పెడుతు న్నాయి.

కొంతసేపటికి బొక్కెన పైకి వచ్చినట్లని పించి ఆమె తన కుడిచేతిని రాట్నంవైపు చాచింది. ఆశ్చర్యం! దారం చివరన బొక్కెన లేదు. బొక్కెన బదులు ఒక మనిషి శవం వేలాడుతూ ఉంది. దారపు కొన ఉరి తాడులా మెడచుట్టూ బిగుసు కుని ఉంది. శవం తన బరువు మూలాన అటూ ఇటూ తిరుగుతూ కాసేపటికి సొంతం మునెమ్మవైపు తిరిగింది. ఆ శవం జయరాముడిదే. ఆమె ఎడమచేత్తో దారాన్ని అలాగే పట్టుకుని కుడిచేయి చాచి జయరాముడి జబ్బను దొరకబుచ్చుకోవడా నికి ప్రయత్నిస్తుండగా దారం జారిపో యింది. రాట్నం గలగలమని శబ్దం చేస్తూ వెనక్కు తిరిగింది. తృటికాలంలో శవం మళ్ళీ నీళ్ళలోపడి గబుళ్ళని శబ్దం వచ్చింది.

మునెమ్మ కెవ్వుమని కేకవేసి లేచి కూర్చుంది. కేక విని నేను మంచం మీద నుండి దూకి లాంతరు వత్తిని పెద్దగచేసి దాన్ని ఊగించుకుంటూ ఇంటిలోకి వచ్చాను.

మునెమ్మ పడుకుని ఉండిన చాప చిందర వందర అయి ఉన్నది. తలగడ అల్లంత దూరాన పడి ఉన్నది. ఆమె ని ట్రాతి మానుకు జారగిలబడి కూర్చుని వెక్కివెక్కి ఏడుస్తున్నది. డొక్కలు ఎగిరె గిరి పడుతుండగా గూళ్ళు కంపిస్తుండగా ఆమె ఏడుస్తున్నది. కన్నీళ్ళు కనుకొలకుల నుండేగాక కనురెప్పల మీదుగా గూడా దూకుతూ చెంపలను తడిపేస్తున్నాయి. ముఖం మీది కండరాలు విపరీతంగా కొంకర్లు పోతుండడం వల్ల ఆమె ఏడుస్తు న్నదా నవ్వుతున్నదా అన్న అనుమానం కూడా వచ్చింది నాకు. అలా ఏడుస్తూ ఆమె రెండు, మూడు సార్లు, "పిలగా - పిలగా" అన్నది. ఆమె ఎవరిని పిలుస్తు న్నదో కొద్దిరోజుల తరవాతగాని నాకు

అర్థం కాలేదు. అది ఆమె జయరామునికి పెట్టిన రహస్య నామమట. వాళ్ళు ఏకాంతంగా ఉన్నప్పుడు లేక ఆమె భావావేశంలో ఉన్నప్పుడు అలా పిలుస్తుంది. ఆ విషయం సాయమ్మత్తకు కూడా తెలియదు.

సాయమ్మత్త చాపమీద కూర్చుని మౌనంగా ఉండిపోయిందేగాని మునెమ్మను ఓదార్చడానికి ఒక్కసారి గూడా ప్రయత్నించలేదు. ఆ విషయం గురించి నేను కొద్దిరోజుల తరవాత అడిగినప్పుడు సాయమ్మత్త, "ఓదారిస్తే ఆగే దుఃఖం కాదురా అది. చెరువు కట్టకు గండిపడితే ఊరి జనమంతా వెళ్ళి గడ్డీగాదం వేసి దాన్ని మూసేస్తారు. కట్టే తెగిపోతే ఇగ చేసేదేముంది. నీళ్ళన్నీ వెళ్ళిపోయేదాక దూరంగా నిలబడి చూడడమే" అంది.

"ఓదారిస్తే ఆగే దుఃఖం కాదురా అది. చెరువు కట్టకు గండిపడితే ఊరి జనమంతా వెళ్ళి గడ్డీగాదం వేసి దాన్ని మూసేస్తారు. కట్టే తెగిపోతే ఇగ చేసేదేముంది. నీళ్ళన్నీ వెళ్ళిపోయే దాక దూరంగా నిలబడి చూడడమే"

కన్నీటి గ్రంథులన్నీ ఇంకిపోయి, ఎండిపోయేదాక మునెమ్మ ఏడుస్తూనే ఉంది. తూర్పున గుడ్డిచుక్క పుట్టినప్పుడు ప్రారంభమైన ఏడుపు తొలికోడి కూశాక గాని ఆగలేదు. ఏడ్పు ఆగిపోయాక తాను ఎంతసేపు ఏడ్చిందో అంతసేపు బెక్కుతూ, తదేకంగా నేలను చూస్తూ కూర్చుంది మునెమ్మ. తరవాత తలెత్తి నన్నూ, సాయమ్మత్తను మొదటిసారి చూస్తున్నట్టు చూసి, "కలొచ్చిందత్తమ్మా. కలలో ఆయన కనిపించినాడు" అంటూ పైకి లేచింది. జుత్తును మెడమీద ముడివేసుకుంటూ పెరడులోకి వెళ్ళింది. కలను గురించిన వివరాలు అడిగే ధైర్యం నాకు లేకపోయింది. ఇక సాయమ్మత్త "అడిగేదేందిరా. అది ఉన్న పరిస్థితిలో ఎలాంటి కలలొస్తాయో నాకు తెలవదా? ఆ కలలు ఎంత భయంకరంగా ఉంటాయో నాకు తెల్సు" అంది కొన్ని రోజుల తరవాత.

కాని మునెమ్మకు వచ్చిన కల సాయమ్మత్త భావించినంత సాధారణమైనదేమీ కాదు. కలలోని దృశ్యాలు సాయమ్మత్త పెట్టుకున్న ప్రమాణాల ప్రకారం సాధారణమైనవే కావచ్చు. కాని అవి మునెమ్మ మెదడుకు ఇచ్చిన కుదుపు మాత్రం అసాధారణమైనది. వాస్తవ జగత్తులోని సంఘటనలు మనిషి జీవితాన్ని పూర్తిగా మార్చివేయడం మనం చూసినదే. అలాగే స్వప్న జగత్తులో జరిగిన సంఘటనలు కూడా జీవిత దృక్పథాన్ని మార్చివేయగలవని నేను చెప్పగలను. అందుకు మునెమ్మే సాక్ష్యం. స్వప్నంలో ఆమె చూసిన దృశ్యాలు ఆమెలోని ప్రతి అణువునూ కుదిపివేశాయి. స్వప్నానంతరం ఆమె కార్చిన కన్నీళ్ళు ఆమెలోని సకల సందిగ్ధతలను, సకల సంశయాలను, సకల జడత్వాలను కడిగివేశాయి.

మునెమ్మ మెడమీద జుత్తును ముడివేసుకుంటూ పెరడులోకి వెళ్ళింది. ఊర్లో కోళ్ళు గంపలకింద ఒక్కటొక్కటిగా, జంటలుగా, గుంపులుగా ఏకధాటిగా కూస్తుండగా ఆ అపరాత్రివేళ ఆమె ఒంటికి, తలకు సిగర పొడి రుద్ది చల్లటి నీళ్ళతో స్నానం చేసింది. ఇంటిలోకి వచ్చి తల ఆరబెట్టుకుని జుట్టు దువ్వుకుంది. ఉతికిన చీరను, రవికను తొడుక్కుంది. దండెంమీది బట్టలను తీస్తూ ఆమె "అత్తమ్మా. నేను యలబార్తాను. ఆయన ఎక్కడున్నాడో కనుక్కోవాలి. ఆయనకు ఏమయిందో కనుక్కోవాలి" అంది.

ఆ మాటలు విని నేను దిమ్మరపో యాను. ఆ మాట అన్నది ఆమేనా. లేక ఆమె వెనక గోడకవతల ఎవరైనా నిలబడి అంటున్నారా అన్న అనుమానం కూడా కలిగింది. నేను లాంతరు వెలుగులో ఆమె ముఖంలోకి చూశాను. అంతటి ఆత్మవిశ్వా సం ఎవరి ముఖంలోగాని, ఎప్పుడుగాని నేను చూడలేదు.

మునెమ్మ చెప్పిన మాటలు మెదడులోకి ఇంకేదాక ఆగి సాయమ్మత్త. "నీకెందుకు పాపా ఈ ఊర్లో మనమేమన్నా దిక్కులేనో ళ్ళమా? నిన్ననే సుబ్బయ్య మామతో మాట్లాడినా. ఈ దినం మావిటేళదాక చూసి ఆయనే బయల్దేర్తానన్నాడు..."

ఆ మాటలకు అడ్డువస్తూ మునెమ్మ, "సుబ్బయ్య మామే గాదు, ఈ ఊర్లో వియ్యపోళ్ళు, పాలోళ్ళు, మిగిల్నోళ్లు అంతా కలసి ఐదు నూర్లమంది ఉన్నారు. కాని వాళ్ళ వాళ్ళు వాళ్లకున్నారు. ఇప్పుడు కన బడకుండా పోయింది నావాడే కదా. నా వాడి కోసం నేను వెదకాల" అంది.

సాయమ్మత్త పైకి లేచి దండెం మీద నుండి తనూ కొన్ని బట్టలు తీసుకొని, "వాడు నీకెంతో నాకూ అంతే. వాడు నా



కడుపున పుట్టినోడు. నేను వస్తా. ఇద్దరం బయలుదేరదాం" అంది.

మునెమ్మ ఆమె చేతిలోని బట్టలను తీసుకొని మళ్ళీ దండెంపై వేసి, " వొద్ద త్తమ్మా నువ్వు తట్టుకోలేవు. ఆయన ఎట్లా కనిపిస్తాడో నాగ్గూడ తెలియదు. నుదుటికి బాసికం కట్టుకొని మాత్రం కనిపించాడు" అంది.

సాయమ్మత్త కోళ్ళ కూతలను వింటూ కాసేపు ఊరుకొని, "ఎక్కడని వెదుకుతావు పాపా. మద్దిపాలెమంటే అది ఏ రాజ్జింవో ఏమో. నీకు తెల్సిన ఊర్లు రెండే. ఒకటి ఒంటిల్లు. ఇంగొటి మొగరాల. ఏ ఊరని వెళతావు! ఏ దారిన వెళతావు? " అంది.

మునెమ్మ తను తీసుకున్న బట్టలను మూట గట్టుతూ, "కాలుదీసి వీధిలో పెడితే దారి దానంతటదే తెలుస్తుంద త్తమ్మా. భూమ్మీదకు వచ్చేముందు మనం ఎలాంటి బతుకు బతుకుతాం. ఎక్కడ బతుకుతాం- ఇవన్నీ ఆలోచించే వచ్చామా? " అంది.

స్నానం చేసి వచ్చాక మునెమ్మ నోటి నుంచి వచ్చే ప్రతి మాటా నాకు దిగ్భ్రాం తిని కలుగజేస్తూ ఉంది. ఆమె ప్రయాణా నికి సిద్ధమవుతుండడం గమనించి నేను, "అక్కా. నువ్వొక్కదానివే ఎందుకు? నేను గూడా వస్తాను. ఇద్దరం కలసి వెళదాం" అన్నాను.

మునెమ్మ తనలో తాను అనుకుంటున్న ట్టుగా, "బయలుదేరే ముందు చురకత్తిని తీసి బొడ్లో దోపుకుందామనుకుంటా ఉంటిని" అని తల పైకెత్తి, నావైపు చూసి "నువ్వొస్తే నాకు దాని అవసరంలేదు. యలబారు" అంది.

ఆ విధంగా జయరాముడిని గురించి అన్వేషించడానికి మునెమ్మ, నేను ఒంటిల్లు గ్రామం నుండి బయలుదేరాం.




బయలుదేరేముందు మునెమ్మ నట్టింట దీపం వెలిగించి దండం పెట్టుకుంటుందని అనుకున్నాను. కాని ఆమె అలా చేయ లేదు. "బొల్లిగిత్త నొకసారి చూసి బయల్దే రదాం" అంది ఆమె. మేము లాంతరును పట్టుకొని కొట్టంలోకి వెళ్ళాం. కొట్టంలో బొల్లిగిత్త ఎడమవైపు పడుకుని మోరను కుడి జబ్బమీద ఉంచుకుని నిద్రిస్తున్నది. మా రాకతో అది కళ్ళు తెరచి, మోరను జబ్బమీద నుండి తీసివేసింది. ఆ తరు వాత అది మా ఉనికినే గమనించనట్లు నెమరువేయసాగింది. గత రెండు రోజు లుగ జరిగిన సంఘటనలను గురించిన రహస్యాలన్నీ దానికి తెలుసు. ఆ రహస్యా లను పంచుకోవడానికి మరొక ప్రాణి దహించుకుపోతున్నదని తెలుసుకునే జ్ఞానం దానికి లేదు. ఆ మేరకు అదొక మూర్ఖజీవి అని నా భావన. సకల చరా చర జగత్తుకు సృష్టిలయకారుడైన దేవుని ముందర నిలబడి దండం పెట్టుకోకుండా మునెమ్మ ఆ మూర్ఖజీవి ముందర నిలబడి తదేకంగా దాని కొమ్ములనే చూడసాగింది.

"దీనికి అన్నీ తెలుసుంటాయక్కా. ఇది గాని నోరు తెరచి మాట్లాడితే ఎంత బాగుండును" అన్నాను.

మునెమ్మ,"మాట్లాడుతుందిరా. సమయం వచ్చినపుడు ఈ గొడ్డేగాదు, ఈడనుండి మద్దిపాలెందాక రోడ్డుమీదుండే ప్రతి కంకర రాయీ నోరు తెరిచి మాట్లాడు

# ప్రేమికులని కలిపిన ఇంటర్‌నెట్




నువ్వాదరినీ నేనీదరినీ
'ఇంటర్నెట్' కలిపింది ఇద్దరినీ



**రెం**డో ప్రపంచయుద్ధం కారణంగా ప్రేమికులైన హెరాల్డ్, ఛెరిల్‌లు ఒకరికొకరు దూరమై పోయారు. 51 ఏళ్ళ తర్వాత 1994 లో వారిద్దరూ తిరిగి కలుసుకున్నారు-థాంక్స్ టూ ఇంటర్నెట్.

హెరాల్డ్ అమెరికన్ సైనిక ఉద్యోగి. 1943 లో అతను ఆస్ట్రేలియాలోని బ్రిస్బేన్ నగరంలోని ఆర్మీకేంప్‌లో పనిచేసేవాడు. అతనికి హాస్పిటాలిటీ వర్కర్‌గా పని చేసిన ఛెరిల్ అనే అమ్మాయితో పరిచయమై, అది ప్రేమకి దారితీసింది. అయితే, అప్పటికే హెరాల్డ్‌కి వివాహమై, ఓ కొడుకు కూడా పుట్టడంతో హెరాల్డ్ ఆ టీనేజర్‌తో ముందుకి వెళ్లలేకపోయాడు. వారిద్దరు పడవ షికార్లు చేసారు. పిక్నిక్స్‌కి వెళ్ళారు. డాన్స్ చేసారు!

1945లో రెండో ప్రపంచయుద్ధం పూర్తవగానే హెరాల్డ్ అమెరికాకి తిరిగివచ్చాడు. ఛెరిల్ ఓడలో వెళ్తున్న అతనికి ఏడుస్తూ చేతులూపుతూ గుడ్ బై చెప్పింది.

హెరాల్డ్‌కి తన భార్య మేరియా ద్వారా మరో ఇద్దరు పిల్లలు పుట్టారు. 51 ఏళ్ళ వైవాహిక జీవితానంతరం మేరియా 1993 లో మరణించింది.

హెరాల్డ్ కొడుకు నెల్సన్, ఓ కంప్యూటర్‌ని ఉపయోగించి, దూరప్రాంతంలోని ఇంకొకకంప్యూటర్ యజమానితో మాట్లాడే అవకాశం గురించి ఓ రోజు తండ్రికి చెప్పాడు.

అలాగా! ఐతే "నువ్వు బ్రిస్బేన్‌లో ఎవరితోనైనా అలా మాట్లాడితే, రెండో ప్రపంచ యుద్ధంలో, నాకు తెలిసిన ఛెరిల్ అనే ఆమె గురించి తెలుసుకోగలవేమో చూడు" అని కోరాడాయన.

నెల్సన్ బ్రిస్బేన్‌లోని ఇంటర్నెట్ ఉపయోగించే ఓ వ్యక్తికి, 50 ఏళ్ళక్రితం ఛెరిల్ ఉన్న ఇంటి చిరునామా ఇచ్చి, ఆమె గురించి తెలియచేయమని కోరాడు.

మర్నాడు జవాబు వచ్చింది. ఛెరిల్‌ని అతను కాంటాక్ట్ చేసాడు. హెరాల్డ్ గురించి ఆమె ఎంతో ప్రేమపూర్వకంగా మాట్లాడింది.

హెరాల్డ్, ఛెరిల్ ముందు కంప్యూటర్ ద్వారా ఛాట్ చేసి, తర్వాత ఫోన్‌లో మాట్లాడుకున్నారు. ఆమెకి ఇద్దరు పిల్లలు. ఆమె భర్తకూడా 1992లో మరణించాడు.

హెరాల్డ్ ఆస్ట్రేలియాకి ఆమెని చూడటానికి వెళ్ళాడు. ఎయిర్‌పోర్ట్‌కి వచ్చిన ఛెరిల్ వంద అడుగుల దూరంలో ఉన్న అతన్ని గుర్తుపట్టింది. ఒకరినొకరు సంతోషంగా కౌగలించుకున్నారు.

వారిద్దరూ వివాహం చేసుకున్నారు. ఆర్నెల్లు అమెరికాలో ఆర్నెల్లు ఆస్ట్రేలియాలో కాలం గడుపుతున్నారు.



తుంది" అని ఒక అడుగు ముందుకేసి, "ఇజ్జూడు సినబ్బా. ఇదేందో సూడు" అన్నది.

నేను దగ్గరగా వెళ్ళి చూశాను. బొల్లిగిత్త కొమ్ముకు ఒక తెల్లటి కాగితం అంటించి ఉంది. దానిమీద ఇలా రాసి ఉంది.

"మద్దిపాలెం ఎద్దుల పరస
అనుమతి చీటి

రసీదు నంబరు: **29790**

తారీఖు: **28–6–1945**

ఎద్దు స్వంతదారుని పేరు: తడకల జయరామిరెడ్డి

ప్రవేశరుసుము: రెండురూపాయలు పరస సంచాలకుని సంతకం

చీటిలోని పదాలన్నీ నల్లటి అచ్చులో ఉన్నాయి. ఎద్దు స్వంతదారుని పేరు, పరస సంచాలకుని పేరు మాత్రము నీలి రంగు సిరాలో ఉన్నాయి.

చీటిలోని అంశాలను చదివి వినిపించాను. మునెమ్మ, "అది నోరు తెరచి మాట్లాడదంటివే చూడు. అప్పుడే ఒక మడుగు మాట్లాడింది" అంది. ఆ తరవాత ఆమె బొల్లిగిత్త ముకుతాడుకు ఉన్న పగ్గాన్ని చేతిలోకి తీసుకొని చూసి, "ఇదో ఇది రెండో మడుగు. ఈ పగ్గం జూడు. ఇది గోగునార పగ్గం. దీనికి మనం వెంట్రుక దారం వేసుంటిమి" అంది.

బొల్లిగిత్తకు జయరాముడు ఎప్పుడూ వెంట్రుక దారమే వేస్తాడన్నది ఊరంతటికీ తెలిసిన విషయం. వెంట్రుక దారాలు పేనడంలో అతడు నేర్పరి.

ప్రతిదినము మునెమ్మ తల దువ్వుకున్నప్పుడు దువ్వెనలోకి వచ్చిన వెంట్రుకలను ఒక కుండలో జమచేస్తుంది. ఆ వెంట్రుకలను తడపలుగా జేసి జయరాముడు దారాలు పేనుతాడు.

ఇరవై ఎనిమిదో తారీఖున అనగా సోమవారం బొల్లిగిత్త పరసలో ఉండినట్లు దాని కొమ్ముకు ఉన్న చీటిని బట్టి తెలుస్తున్నది. పగ్గం మారింది. గనుక అది అమ్ముడై చేతులు మారిందని గూడా తెలుస్తున్నది. అమ్ముడైపోయిన గొడ్డు ఎలా తిరిగొచ్చింది? గొడ్డుతో పాటు వెళ్లిన జయరాముడు ఏమయ్యాడు? ఎన్ని ప్రశ్నలకు సమాధానం దొరికితే అన్ని కొత్త ప్రశ్నలు ఎదురవుతున్నాయి. ఆ ప్రశ్నలు ముందుండి మమ్మల్ని లాగుతుండగా మేము బయలుదేరాము.

బయలుదేరేముందు మునెమ్మ దోసిలితో నీళ్ళు తెచ్చి బొల్లిగిత్త కొమ్ముమీద పోసి కాగితాన్ని తడిపింది. కాగితాన్ని జాగ్రత్తగా ఊడదీసి, మడతపెట్టి నా జేబులో ఉంచింది.

మేము జయరాముడు నడిచిన కంకర రోడ్డు వెంబడి ప్రయాణిస్తూ అతడు విడిసిన మజిలీలో విచారిస్తూ ముందుకు సాగాలనుకున్నాం. ఐదు మైళ్ల కాలినడక తరవాత మాకు తారసపడిన మొదటి మజిలీ పోటుమిట్ట గ్రామం. పోటుమిట్టలో తరుగులోడిని కలిశాక వాడికి జయరాముడు మాయమైపోయిన వివరాలు చాలావరకు తెలుసుననీ, ఐతే వాడు వాస్తవాలు చెప్పడం లేదనీ మాకు అర్థమయింది.

తరుగులోడు ఆపాదమస్తకం నకిలీ మనిషి. వాడి జుత్తుకు, మీసాలకు ఉన్నది అసలు రంగుకాదు. పూసుకున్న రంగు. నోట్లో ఉన్నవి అసలు పండ్లు కావు. కట్టుడు పండ్లు. కళ్లకు అసలు చూపు లేదు. అద్దాల చూపే. వాడి అసలు పేరు పనబాకం వెంకటరెడ్డి. ఐతే వాడు పుట్టి బుద్ధి తెల్సినప్పట్నించి తరుగు వ్యాపారం చేస్తుండటంవల్ల అందరూ అతడిని తరుగుల వెంకటరెడ్డి అనీ, తరుగులోడనీ పిలుస్తారు. ఈ చుట్టూ పక్కల ఎవరైనా కొత్త గొడ్డును కొనాలంటే తరుగులోడిని సంప్రదించాల్సిందే. ఏ ఊర్లో ఎవరింట్లో ఎలాంటి గొడ్డు అమ్మకానికుందో వాడికి తెల్సు. వాడే బేరం కుదిర్చి పెడతాడు. అలాగే ఎవరైనా తన గొడ్డును అమ్ముకోవాలంటే తరుగులోడిని సంప్రదించాల్సిందే. ఏ ఊర్లో, ఎవరికి ఎలాంటి గొడ్డు అవసరముందో వాడికి తెల్సు. అమ్మేవాడికీ కొనేవాడికి మధ్యవర్తిత్వం చేసి ఇద్దరి దగ్గరా కమీషను లాగుతాడు. అమ్మేవాడు తన చేతిలో పడిన డబ్బు లెక్క పెట్టుకోవల్సిందేగాని, తన గొడ్డు వాస్తవంగా







ఎంతకు అమ్ముడయిందీ తెలుసుకునే అవకాశం ఉండదు. అలాగే గొడ్డును కొనేవాడు తన వస్త్రం నుంచి డబ్బు తీసి లెక్కపెట్టి వాడికి ఇవ్వాల్సిందేగాని, అమ్మినోడికి వాస్తవంగా దక్కేది ఎంత అని తెలుసుకునే అవకాశం ఉండదు. వాడు చేసే తరుగుల వ్యాపారం అంత పకడ్బందీగా ఉంటుంది. ఇక సంవత్సరానికొకసారి కల్లూరు, పలమనేరు, మద్దిపాలెం వంటి చోట్ల పశువుల పరస ప్రారంభం కాగానే తరుగులోడు అక్కడ వాలుతాడు. పరస జరిగినన్నాళ్ళు అక్కడే మకాం వేస్తాడు.

ఆరేడు నెలల క్రితం సిపాయిలు దండు ఒకటి వచ్చి పోటుమిట్ట వద్ద రోడ్డుకవతల విడిసింది. దాదాపు రెండు వందల మంది సిపాయిలు గుడారాలు వేసుకొని ఉన్నారు. ఎక్కడో రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నదనీ, జపాను వాళ్ళు మన గ్రామాలపైన బాంబులు వేసే అవకాశం ఉందనీ, అలాంటి పరిస్థితి వస్తే గ్రామాలను కాపాడడానికి రోడ్డువెంబడి అక్కడక్కడ సిపాయిలను ప్రభుత్వమే ఉంచిందనీ చెప్పుకుంటున్నారు. రోడ్డుకవతల డేరాలలో సిపాయిలు భార్యాపిల్లలకు దూరంగా నెలల తరబడి ఉన్నారు. అందరూ వయసులో ఉన్నారు. మూడు పూటలా ఉప్పు కారం తినేవాళ్ళు. రోడ్డుకవతల ఉండే గ్రామాల నుండి ఆడవాళ్ళను సిపాయిలకు తార్చే బాధ్యతను స్వీకరించడంతో తరుగులోడు తన గొడ్ల వ్యాపారాన్ని తగ్గించుకోవలసి వచ్చింది.

మొదట్లో వాడు ఆడవాళ్ళ వ్యాపారం చాటుమాటుగా చేసేవాడు. కొంత కాలమయ్యాక వాడు నలుగురి ముందరా, "నా కొగిటి అర్థం గావడం లేదు. ఈ తరుగు యాపారం నేనేమన్నా ఈ పొద్దు కొత్తగా మొదలు పెట్టినానా? బుద్ధి తెల్సినప్పట్నుంచి చేస్తా ఉండా. ఆడేడనో ఊర్లో ఒక మనిషికి గొడ్డు కావాల. ఈడ ఊర్లో మనిషి గొడ్డును ఇచ్చేస్తానంటా ఉండాడు. ఆ మనిషీనీ, ఈ మనిషీనీ కలిపి నా కమిషను నేను తీసుకుంటాను. ఈ పని తప్పని ఎవడూ అనలేదే. ఇప్పుడు నేను జేసేపని గూడా అదేగదా. రోడ్డు కవతల సిపాయోనికి ఆడది గావాల. ఊర్లల్లో ఉండే ఆడదానికి దుడ్డు గావాల. వాడినీ, దీన్ని కలిపి నా కమిషను నేను దీసుకుంటా ఉండా. ఇప్పుడు నన్నందరూ నిష్టూరం చేసేదెందుకు? అదే నా కర్థం గావడం లేదు" అన్నాడట.




మేము పోటుమిట్టను చేరేసరికి పొద్దు రెండు బారలెక్కింది. ఊరు ముందర రోడ్డుమీద, రోడ్డు పక్కన బూడిద రంగులో ఉన్న మిలిటరీ ట్రక్కులు చాలా కనిపించాయి. డేరాల లోపల, బయట సిపాయిలు అటూ ఇటూ తిరుగుతున్నారు.

రోడ్డు దిగి ఊర్లోకి ప్రవేశిస్తున్నప్పుడు మునెమ్మ, "తరుగులోడు నన్ను గుర్తుపడతాడో లేదో. ఈ ఆరు సంవత్సరాలలో వాడు మనింటికి రెండు మూడు సార్లొచ్చాడంతే" అన్నది. ఐతే ఆమె మాత్రం తరుగులోడిని అల్లంత దూరం నుంచే గుర్తుపట్టింది. వాడు ఇంటిముందర వీధిలో నిలబడి మరో ఇద్దరితో మాట్లాడుతున్నాడు.

మేము వాడి దగ్గరకొచ్చి నిలబడగానే వాడు "ఏ ఊరమ్మ మంది, ఇంత పొద్దున్నే ఇల్లెల బారొచ్చినారు? " అన్నాడు.

"మేము నీ కోసమే వచ్చినామన్నా. ఇల్లు వెదుక్కొనే పనిలేకుండా వీధిలోనే కనిపించినావు" అంది మునెమ్మ. తరుగులోడు బొళబొళమని నవ్వి,

"సామెజ్జెప్పినట్టుంది. ఈ ఊర్లో కొచ్చేవాళ్లలో నూటికి తొంభైమంది నా కోసరమే వస్తారు. ఈలిద్దరు జూడు ఈయన పాకాల నుంచి వచ్చినాడు. ఈయనకు పొరకసుడి ఉండే గొడ్డు కావాలంట. ఆయన దామల్ చెరువునుంచి వచ్చినాడు. ఆయనకేమో చక్రాలుండే గొడ్డు కావాలంట. ఇంగ నేను ఈళ్లకోసం దిక్కుదేశం తిరగాల. ఏ ఊర్లో, ఎవునిగాట్లో ఏ గొడ్డు ఉందో వెదకాల" అని ఆగి, "మన ఊరు ఏదో చెప్పనేలేదు తల్లీ" అన్నాడు.

"మాది ఒంటిల్లన్నా. నేను తడకల జయరామరెడ్డి భార్యను" అంది మునెమ్మ.

మునెమ్మ అలా అనగానే తరుగులోడి ముఖం రంగులు మారుతుందని, వాడిచేతులు వణుకుతాయని అనుకున్నాను. కాని అలా జరగలేదు. పోటుమిట్టను వదిలి మళ్లీ కంకర రోడ్డుమీద నడుస్తున్నప్పుడు నేనీ విషయం మునెమ్మను అడిగాను, "నువ్వు చూడవలసినచోట చూడలేదురా సినబ్బా. నేనెవరో చెప్పగానే దారికడ్డంగా నాగుపాము కనబడినట్టు వాడి పాదాలు రెండూ జానెడుదూరం వెనక్కు జరిగినాయి. ఎవరు ఏది గమనిస్తుంటారో వాడికి తెలుసు. ఎవరి దగ్గర ఏది దాచుకోవాలో వాడికి తెలుసు" అంది మునెమ్మ.

ఆ విధంగా మునెమ్మ తనను తాను ఎరుకపరచుకోగానే తరుగులోడు మళ్లీ బొళబొళ నవ్వి, "సామెజ్జెప్పినట్టుంది. నిన్నటిదాక జయరామునితో ఉంటి. వాడితోనే తింటి, తాగితి. వాడట్టబోయి మద్దిపాలెం చేరినాడు. నేనిట్టొచ్చి కొంపజేరినా" అన్నాడు.

"మరి బొల్లిగిత్త? " అనడిగింది మునెమ్మ.

"బొల్లిగిత్త సగం దోవలోనే నాగుల మర్రి కాడ అమ్ముడైపోయింది. ఆ ఊరి గాండ్లాయన దాన్ని చావు చవగ్గా కొనుక్కుని ఇంటికి తోలుకుని పోయినాడు"

"మద్దిపాలెం పరసలో దాన్ని అమ్మాలని గదన్నా మీరు బయలుదేరింది. నడిదోవలో దాన్ని ఎందుకు అమ్మేసినట్టు? " అనడిగింది మునెమ్మ.

జయరాముడు ఎట్టాటోడో నీకు తెలవదా? వానితో సంసారం చేసినదానివి.

## ఖర్చయిపోతున్నా..

'ఇలా మిగిలేం' అని చలసాని కమ్యూనిస్టుల పతనానికి కారణాలుగా చెబుతూ రాసిన పుస్తకం చాలా దుమారం లేపింది. ఆయన స్వయంగా మార్క్సిస్టు అయినా చాలామంది ఈ పుస్తకం విషయంలో దుమ్మెత్తి పోశారు. నిరసనలు తెలిపారు. ఆ ఘాటు ఇంకా చల్లాని రోజుల్లో ఓ సాహితీ సమావేశంలో కలిసిన ఓ మిత్రుణ్ని చలసాని 'ఎలా ఉన్నారు? ' అని పలకరించారు. ఆ వామపక్ష మిత్రుడు వెటకారంగా-

'ఇలా మిగిలేం' అన్నాడు. అందుకు చలసానిగారు నవ్వి -

'నేనే ఖర్చయిపోతున్నాను మరి' అని తిప్పికొట్టారు.





వాడు పడికి రెండు పళ్లు పట్టేటోడు. వద్దని నేను ఎంత సతపోరినా వాడు విన లేదు. పరసలో నిలబెట్టి ఉంటే దాన్ని యట్టలేదన్నా ఐదునూర్లకు అమ్మి ఉండచ్చు. నాగులమర్రికాడనే దాన్ని నిల బెట్టి రెండు నూర్లకు అమ్మేసినాడు. అట్టాటి ఉతాళం మనిషి ఈ భూమ్మీద పుట్టుండడు" అన్నాడు తరుగులోడు.

నేను జేబులో మడత పెట్టి ఉన్న చీటిని పైకి తీద్దామని జేబులో చేయి వేశాను. మునెమ్మ కళ్ళతోనే సైగచేసి నన్ను వారిం చింది. తరుగులోడు చేప్పే అబద్ధాలకు అడ్డుకట్ట వేయలేకపోయాక ఇక వాడు చెప్పేది నేను వినదలుచుకోలేదు. ఏదిఏ మైనా తరుగులోడు గొప్ప మాటకారి. సామెజ్జెప్పినట్టు అనడం వాడికి అలవాటు. అంటాడేగాని వాడుచెప్పే సామెతలన్నీ సందర్భశుద్ధి లేని సామెతలే. వాడు కాసేపు పాకాలమనిషి. కాసేపు దామల్ చె రువు మనిషి వైపు చూస్తూ, "జయరా ముడు ఎవరు గాబట్టి? చిన్నప్పట్టించి వాడు నా సావాసకాపు. అట్టాటోడు ఒక దినం ముందే వచ్చి, మా బొల్లిగిత్తను పరసలో అమ్మేయాల. ఆ దుడ్డుతో కొత్త గొడ్డును పట్టుకోవాల. నువ్వు రేపు పరస దాక నాతో రావాల అనంటే లేదనే దాని కుండాదా? నాకీడ ఎన్ని యవ్వారాలు! అవన్నీ పక్కన బెట్టి యలబారినా. సామె జ్జెప్పినట్టు కుందేలును బయటకు రప్పించి కుక్క ఏదో చేసేదానికి పోయిందంటా. అట్ట బయలుదేరినా..." అంటూ ప్రారం భించి చెప్పసాగాడు. వాడు చెప్పిందిది:

తరుగులోడు, జయరాముడు బొల్లి గిత్తను తోలుకుని ఆదివారం తెల్ల వారురఝామున బయలుదేరారు. కంకర రోడ్డుమీద ఇరవై మైళ్లు నడచి నాగులమర్రి గ్రామం చేరాడు. అప్పటికి చీకటయింది. నాగులమర్రి గ్రామంలో రోడ్డు పక్కన ఉన్న ఒక పూటకూళ్లింటిలో ఆ రాత్రి విడి శారు. ఆ పూట కూళ్లింటిని ఒక వృద్ధదం పతులు నడుపుతున్నారు. సామెజ్జెప్పినట్లు భలే జోడి- ఆయనకేమో బ్రహ్మ చెవుడు, ఈమెకేమో ధృతరాష్ట్రుని కండ్లు. అంత పండుముసలి వయసులో గూడా వాళ్లి ద్దరు రోజుకు ఐదారుమంది బాటసారు లకు ఆతిథ్యమిస్తున్నారు. ఒకరోజు బస కల్పించి తిండి పెట్టడానికి రెండణాలు తీసుకుంటారు.

పూటకూళ్లింటి దాపున కల్లంగడి ఉంది. ఆ రెండింటి మధ్య ఒక సిగర చెట్టు ఉంది. జయరాముడు బొల్లిగిత్తను సిగర చెట్టుకు కట్టేశాడు. ఉలవచారు, రాగిసం కటి తయారుగా ఉన్నాయని, త్వరగా బావి వద్ద స్నానం చేసి రమ్మని పూటకూ ళ్ళింటి యజమానురాలు చెప్పింది. ఇద్దరూ వెళ్లి చేద బావివద్ద స్నానం చేశారు. స్నానం అయ్యాక జయరాముడు ఒళ్లు తుడుచుకుంటూ నేరుగా కల్లంగడిలోకి దూరినాడు. రెండు చేతుల్లో రెండు నల్ల కల్లు సీసాలను పట్టుకుని బయటకొ చ్చాడు. సిగరచెట్టు కింద బొల్లిగిత్త దాపున కూర్చుని తాగడం మొదలుపెట్టాడు. తరు గులోడు అతన్ని వారించడానికి చాలా ప్రయత్నించాడు. "మనం పరాయి ఊళ్లో ఉన్నాంరా. ఐదునూర్ల చేసే సొత్తును పక్కన బెట్టుకోనుండాం. ఇట్టాటప్పుడు త్రాగడం మంచిది కాదురా..." అని చెప్పాడు. జయరాముడు వినలేదు. "చిన్న బన్నాదూరం నడిచినామా. మా ఊర్నించి మీ ఊరికి ఐదు మైళ్లు. ఆడినుంచి ఈడకు ఇరవై ఏడు మైళ్లు. మొత్తం ముప్పయి రెండు మైళ్లు నడిచాం. నా ఒళ్లు గుల్లయి పోయింది. పాదాలు రెండూ పచ్చిపుండ్లు అయిపోయాయి. ఇద్దాగితే గాని నిద్ర పట్టదు. నువ్వు గూడా రెండు సీసాలు తెచ్చుకో" అన్నాడు జయరాముడు. రెండు




## అమ్మకూచి

నిలబడితే దాదాపు మనిషి ఎత్తుండే ఆస్ట్రేలియాలోని ఎర్రకంగారిది. ఎనిమిది నెలల వయస్సున్న పిల్లకు పాలు కుడుపుతోంది. మామూలుగా ఆర్నెల్ల వరకూ తల్లిఒడిలో గడిపే కంగారుపిల్ల తర్వాతి కాలంలో అప్పుడప్పుడు బయటకువచ్చి తల్లితోకలిసి షికారు చేస్తుంది. మళ్లీ ఎంచక్కా సంచిలో దూరి భద్రంగా ఒదిగిపోతుంది. ఈ పిల్ల మాత్రం పెద్దదైనా అమ్మకూచిలా ఎప్పుడూ తల్లి సంచిలోనే తలదాచుకుంటోంది.



సీసాలు ఖాళీ అయ్యేటప్పటికి కైపు నెత్తి కెక్కి అతడు కాళ్లు బార్లచాపేసి సిగర చెట్టుకింద వెల్లకిలా పడిపోయాడు.

పూటకూళ్లింటి యజమానురాలు గోడలు తడుముకుంటూ వచ్చి "రాత్రయిపోతూ ఉంది. ఉలవచారు, సంగటి ఉట్టిమీదు న్నాయి. తినేసి పడుకోండి" అని చెప్పి వెళ్లి పోయింది. తరుగులోడు భోజనం చేసి బీడి కాల్చుకుంటూ సిగరచెట్టు కింద కూర్చున్నాడు. అప్పుడొచ్చినాడు ఆ ఊరి గాండ్లాయన సిగర చెట్టు కిందికి. "సామె జెప్పినట్లు ఉడుము ఊర్లోకి వచ్చినట్లు వచ్చినాడు గాండ్లాయన. నెత్తిన నూనె డబ్బా పెట్టుకుని కంకరరోడ్డు దిగి ఊర్లోకి పోబోతూ ఆగి సిగర చెట్టుకింద కొచ్చాడు. నూనె డబ్బాను కిందకి పెట్టి, "అగ్గిపెట్టె ఇచ్చి పుణ్యం కట్టుకో అన్నా" అని తరుగు లోడి పక్కన కూర్చున్నాడు. తరుగు లోడిచ్చిన అగ్గిపుల్ల గీసి బీడి ముట్టించు కుని పొగలాగి, "చెమటకారి జేబులో ఉండే చెకుముకి తడిసిపోయిందన్నా. అగ్గి పెట్టె అడుగుదామంటే రోడ్డుపైన నరమా నవుడు కనిపించలేదు. బీడి గుంజక నోరు చవి చెడిపోయిందనుకో" అన్నాడు.

తరుగులోడు "మందే ఊరన్నా?" అన డిగాడు.

గాండ్లాయన "మాదీ ఊరేనన్నా. గాండ్లోల్లం. పక్కూళ్లో ఇల్లిల్లూ తిరిగి ఆ డబ్బా నూనె అమ్మేటప్పటికి ఇంత రాత్ర యింది" అన్నాడు.

"యట్టుండాదన్నా గానిగ పని? గిట్టుబా టుగా ఉండాదా?"

"పరవాలేదన్నా. తిండికీ, బట్టకూ సరి పోతా ఉండాది. మాది ఒంటెద్దు గానిగ. ఎద్దు ముసల్దయిపోయి దాని చిగుర్లరిగి పోయినాయి. నిన్నటిదాక అది దినానికి నాలుగు కాండ్లు అలగ్గా తిప్పుతా ఉండింది. ఇప్పుడది రెండోకాడి అయిపో గానే పడకేసేస్తా ఉండాది. లాభం లేదన్నా. దానికత ఇడిసి పెట్టేసి కొత్త గొడ్డును పట్టుకోవాల" అన్నాడు గాండ్లా యన.

"గొడ్డును పట్టుకోవాలంటే నాతో జెప్పు. నేను తరుగుల యాపారం జేసేటోణ్ణి. నీకు యట్టాటి గొడ్డు కావాలి. దుడ్డు యామాత్రం పెట్టుకుంటావు?" అనడి గాడు తరుగులోడు.

"నాకు సేద్దిం నాద్దిం లేదన్నా. నేను గొడ్డును పెట్టుకునుండేది గానిగి ఈడ్చేదా నికే. దినానికి మూడు కాండ్లు ఈడ్చే గొడ్డ యితే సాలన్నా. ఇన్నూరు, ఇన్నూట యాభైలో ఒదిగే బేరం యాడన్నా ఉంటే సూడన్నా..." అన్నాడు గాండ్లాయన.

అంతవరకు కదలకుండా పడుకుని ఉండిన జయరాముడు కండ్లు తెరచి, లేచి కూర్చుని, "అట్టయితే ఇంగేంవి. ఇన్నూర్రూ పాయలిచ్చి ఆ గిత్తను తోలుకుపో" అంటూ బొల్లిగిత్తను చూపించాడు.

ఇంతవరకు పాకాల మనిషి వైపు, దామల్ చెరువు మనిషివైపు తిరిగి మాట్లా డుతూ ఉండిన తరుగులోడు సొంతం మునెమ్మ వైపు తిరిగి, "ఇదొగటి నాకు గోచిరం కావటం లేదు తల్లీ. జైరాముడికి బొల్లిగిత్త మీద ఎందుకంత కంటు? ఓపి నంత దూరం రోడ్డుమీద నడిపించినాడు కదా. దోవలో యాడా నీళ్లు గూడా తాపి నోడు గాదు. సిగర చెట్టుకు కట్టేసినాడు గాని దాని ముందర పిడికెడు గడ్డి ఏసి నోడు గాదు. దాన్ని దారబోసుకునే దానికి ఒంటికాలి మీదుండినాడు. సామెజెప్పినట్టు చెట్టు భూమికి బరువయ్యిందా. చెట్టుకు భూమి బరువయ్యిందా? ఇంగొక పది మైళ్లు నడిచి దాన్ని పరసలో నిలబెట్టి ఉంటే దాన్ని ఏ తలమాసినోడన్నా ఐదు నూర్లకు ఎగరేసుకుపోయుండును. అయిన కాడికి మద్యానంగా ఇన్నూరు రూపాయలు

# క్విక్ కోర్ట్

విడాకుల శాతం అమెరికాలో ఎక్కువ. వ్యాపారాత్మకమైన ఆ దేశంలో ఆరిజోనా రాష్ట్రంలోని ఫోనెక్స్ సిటీకి చెందిన క్రిస్టిని కొంట్ అనే ఆమె విడాకులు తీసుకోవాలనుకునే వారి కోసం ఓ పుష్ బటన్ యంత్రాన్ని కనిపెట్టింది దానిపేరు 'క్విక్ కోర్ట్'




దీని ముందు కూర్చుని కొన్ని బటన్స్‌ని నొక్కి సమాధానాలు టైప్ చేస్తే, పది హేను నిముషాల్లో 'ప్రింటవుట్ వస్తుంది. విడాకుల కోసం కోర్టులో సమర్పించాల్సిన ఫారాలన్నీ అలా ప్రింటవుట్స్ ద్వారా తీసుకోవడం వల్ల లాయర్‌కి, అవి తయారు చేయాల్సిన ఫీజుని ఇవ్వనక్కర్లేదు. లాయర్లు గంట కింతని, లేదా డాక్యుమెంట్‌కి ఇంతని క్లయింట్స్ నించి ఛార్జీ చేస్తారు. ఈ యంత్రం ద్వారా కేవలం 5 డాలర్లకే ఒకోఫారాన్ని సంపాదించుకోవచ్చు. భార్యాభర్తలిద్దరూ కలసి విడాకులు తీసుకోవాలనుకున్నప్పుడు ఈ యంత్రం ఎంతో ఉపయోగంగా ఉంటుంది. అలాగే తన బిడ్డలకి అతని తండ్రి నించి ఆర్థిక మద్దతు కావాలనుకున్నప్పుడు కూడా విడాకులు తీసుకునే తల్లులు ఈ యంత్రాన్ని ఉపయోగించి పొందిన ఫారాలని కోర్టులో ఫైల్ చేసి కేసు నమోదు చేయచ్చు

దీని వల్ల క్లయింట్సే కాక కోర్ట్ క్లర్క్‌లు కూడా సంతోషంగా ఉన్నారు. క్విక్ కోర్ట్ రాక మునుపు కోర్ట్ క్లర్క్‌లు సబ్మిట్ చేసిన డాక్యుమెంట్స్‌ని పరిశీలించి, వాటిలోని సాంకేతిక లోపాల వల్ల అవి రిజెక్ట్ చేసేవారు. కాని యంత్రం నుంచి వచ్చిన ప్రింటవుట్స్‌లో ఎలాంటి తప్పులూ ఉండవు కాబట్టి అవి రిజెక్ట్ కావు.

గత 18 నెలల్లో ఎలాంటి తప్పు లేని ఫారాలు కోర్ట్‌లు సబ్మిట్ అవుతున్నాయని ఆరిజోనా సుప్రీం కోర్ట్ క్లర్క్ చెప్పాడు. ఆరిజోనా రాష్ట్ర కోర్ట్ లాబీల్లో 150 క్విక్ కోర్ట్ యంత్రాలని అమర్చారు. వీటిని అమర్చిన అమెరికాలోని రెండో రాష్ట్రం కేలిఫోర్నియా. ఊటా మూడో రాష్ట్రం. మిగతా రాష్ట్రాలు కూడా 'క్విక్ కోర్ట్' ని పరిశీలించి ఇన్‌స్టలేషన్‌కి ఓకే చేస్తున్నాయి. ఈ ఆటోమెటిక్ యంత్రాన్ని ఉపయోగించడం కూడా తేలికే ఏటియంలోలా ఏం చెయ్యాలో ఇన్‌స్ట్రక్షన్స్ కనిపిస్తూ తర్వాత స్టెప్‌ని సూచిస్తుంటాయి.





తీసుకుని గిత్తను గాండ్లాయన చేతిలో పెట్టేసినాడు" అన్నాడు.

మునెమ్మ, "ఆయన తాగి ఉండినాడం టివి. నువ్వు అన్నీ తెల్సినోడివి. నువ్వు వద్దని చెప్పరాదా అన్నా" అన్నది.

"అయ్యో తల్లీ, సామెజెప్పినట్లు కడుపు చించుకుంటే కాళ్లమీద పడుకుంది. నేను అడ్డం పోతే నా మీదకే ఎగబడినాడు. 'గొడ్డు నాది. కొనేవాడు ఆయన. మధ్య నువ్వెవరు?' అని నామీదకొచ్చినాడు. ఆఖరుకు వాళ్లిద్దరు కలిసి నన్ను జుట్టు పట్టి వంగదీసి వీపుమీద పిడిగుద్దులు గుద్దినారు. ఇట్ట జూడు, వీపంతా కదు ములు కట్టిపోయింది" అంటూ వెనుది రిగి, చొక్కా పైకెత్తి వీపు చూపించాడు తరుగులోడు.

పాకాల మనిషికి, దామల్ చెరువు మని షికి ఆ వీపుమీద ఏమి కనిపించిందో గాని, "చ్చొచ్చొచ్చొ" అన్నారు. మునెమ్మకు, నాకు ఏమీ కనబడలేదు.

తరుగులోడు చొక్కాదించివేసి, "ఆ పిడి గుద్దులు తిని చెవుల్జాడించుకుంటా వొచ్చి ఇల్లు జేరినా. జైరాముడు ఇన్నూరూపా యలు పెట్టి ఎట్టాటి గొడ్డును పట్టుకొ స్తాడో ఏమో" అన్నాడు.

మునెమ్మ, "అద్దెల్సుకుందామనే వొచ్చి నానన్నా. ఆయన ఆదివారం తెల్లవారు జామున ఇల్లెల బారినాడు. ఇంతవరకు తిరిగి రాలేదు. మనసు ఉండబట్టలేక నిన్నడగదామని వచ్చినానన్నా" అంది.

తరుగులోడు, "తెల్సుకునేదేముంది. వాని దగ్గర ఇన్నూరూపాయలుండాయి గదా. పరసంతా తిరిగి గుడ్డిదో, కుంటిదో ఒక గొడ్డును పట్టుకుని రేపో, ఎల్లుండో తిరిగొస్తాడు. వాడేడికి పోతాడు? సామెజెప్పినట్టు రాయి పోగానే వడిసెల గూడా పోతుందా" అన్నాడు.




పోటుమిట్టను వదిలి కంకర రోడ్డుమీద నడుస్తూ మేము చాలాసేపు తరుగులోడిని గురించే మాట్లాతున్నాం. తరుగులోడు చెప్పిన ప్రతి మాటా అబద్ధమేనని నేను భావించాను. కాని మునెమ్మ అలా భావిం చలేదు. అమె, "నాకట్ల అనిపించడం లేదురా. జయరాముడు బొల్లిగిత్తను వొది లించుకోవడానికి ఒంటి కాలిమీదుండినా డని చెప్పినాడు. అది నిజమేగదా. కల్లం గడి కనిపిస్తే లోపలికి పోకుండా జయరా ముణ్ణి ఎవరూ ఆపలేరు. విషయం ఎంత పెద్దదయినా ముందు వెనకా చూడకుండా నిర్ణయం తీసుకుంటాడు. ఒట్టి ఉతాళం మనిషి. ఇవన్నీ మనకు తెలిసినవే గదా. ఇంగ తరుగులోడు అబద్ధం చెప్పింది ఎక్కడ? " అంది.

"బొల్లిగిత్త సోమవారం పరసలో ఉండింది గదా. మరి ఈ గాండ్లాయన కత ఏంది? " అనడిగాను.

"గాండ్లాయన దాన్ని చావు సవగ్గా కొన్నాడు. దాన్ని మారుబేరం పెట్టి అమ్మే దానికి పరసకు తీసుకుపోయినాడేమో. అదాలోచించినావా? " అంది మునెమ్మ.

నేను మా నాయన నిన్న సాయమ్మ త్తతో చెప్పిన మాట నా స్వంత మాటే అయినట్టు "సూడబోతే పరికి కంపమీద పరచిన గుడ్డమాదిరుంది ఈ యవారం" అన్నాను.

"మనుషుల యవారాలన్నీ అట్టనే

ఉంటాయిరా సినబ్బా. ఏ యవారమైనా మనకు అర్థమైన విషయాన్నే పట్టుకుని కూచుంటాం. అర్థంకాని వాటిని పక్కన పెట్టేస్తాం. ఇది గూడా ఒక రకమైన సోమరితనమే" అంది మునెమ్మ.

ఆమె కాసేపు మౌనంగా నడిచి, "నా లెక్క ప్రకారం తరుగులోడిని గురించి ఆలోచించాల్సింది ఒకటేరా. నేనెవరో తెల్సుకోగానే వాడి పాదాలు నేలమీద జాన దూరం వెనక్కు జరిగినాయి. దాన్ని గురించి ఆలోంచాల్సి ఉంది" అంది.

"ఆలోచించేదేందక్కా. ఎర్రోడు మాదిర మాట్లాడతాడుగాని వానికి అన్ని తెల్సు. అడగాల్సినట్టు అడిగి ఉంటే వాడు అంతా చెప్పి ఉండేవాడు" అన్నాడు.

"అడుగుదాం.. సమయమొచ్చినప్పుడు గొంతుమీద కాలేసి అడుగుదాం. చేపకోసం గాలం వేసినప్పుడు బెండు తైతక్కలాడ గానే గాలాన్ని లాగుతామా? బెండు నీళ్ళలో మునిగినప్పుడు గదా గాలాన్ని లాగుతాం" అంది మునెమ్మ.

తరుగులోడు మునెమ్మ ఎవరో తెలుసు కున్నంక తడబడి ఆ తొట్రుపాటులో సందర్భశుద్ధి లేకుండా సామెతలు చెప్పాడని అనుకున్నాను. కాని వాడు ఎప్పుడూ అలాగే మాట్లాడతాడని నాగులమర్రి చేరాక మాకు తెలిసింది.




మేము కంకర రోడ్డు వెంబడి నడుస్తూ సందెచీకట్లు అలుముకుంటూ ఉండగా నాగులమర్రి చేరుకున్నాం.

నాగులమర్రి చాలా పెద్ద ఊరు. తరుగులోడు చెప్పినట్టుగానే రోడ్డు పక్కన ఒక పూటకూళ్ళిల్లు ఉంది. దానిని ఒక ముసలి దంపతులు నడుపుతున్నారు. ఈమెకు రేచీకట్లు. ఆయనకు చెవుడు. నానా జాతుల వాళ్ళు వచ్చి ఆ పూటకూళ్ళింట్లో బసచేసి పోతుంటారు. అప్పుడప్పుడు పోలీసులు విరుచుకు పడతారు. ఫలానా ఆనవాళ్లు కలిగిన మనిషి ఫలాన దినం ఇక్కడ బసచేశారా? ఆ మనిషితో పాటు ఇంకెవరున్నారు? ఇలాంటి ప్రశ్నలతో వేధిస్తుంటారు. వాళ్లకు సరిపోయే సమాధానాలు దొరికితే సరి, లేకపోతే ఈ ముసలి దంపతులను మాటిమాటికి పోలీసు స్టేషన్‌కు పిలిపిస్తుంటారు. కాబట్టి అతిథుల వివరాలను వీలైనంత వరకు సేకరించి, జ్ఞాపకముంచుకోవడం ఆ ముసలి దంపతుల విధి నిర్వహణలో భాగమైపోయింది.

కనుక గత ఆదివారం రాత్రి పూటకూళ్లింట్లో విడిసిన జయరాముడు, తరుగులోడు ఆ దంపతులకు బాగ జ్ఞాపకమున్నారు. వాళ్లిద్దరిలో ఒకడు సన్నగా, పొడుగ్గా, కాస్త వంగిన నడుంతో ఉంటాడనీ, అతడు మీసాలకు, జుత్తుకు రంగేసుంటాడనీ, అతనివి కట్టుడు పళ్లని ముసలాయన చెప్పాడు. ఆ మనిషి గెచ్చకాయల కుండలో చేయి పెట్టి కదిపినట్టు మాట్లాడతాడనీ, మాటిమాటికి సందర్భశుద్ధిలేని సామెతలు చెబుతాడనీ ముసలమ్మ చెప్పింది. రెండోవాడు నల్లగా, బొద్దుగా, భూమిలోకి దిగేసిన గడ్డపారలాగ నిటారుగా ఉంటాడనీ, అతని కనుబొమలు గుబురుగా ఉండి ఒకదాన్నొకటి కలుసుకుంటూ ఉంటాయని ముసలాయన చెప్పాడు. అతడు మితభాషి అనీ, పది మాటలకు ఒక్కమాటే మాట్లాడుతాడనీ ముసలమ్మ చెప్పింది. ఆ బాటసారులు

తమతో ఒక బొల్లిగిత్తను పట్టుకొచ్చారనీ, దాని ముకుతాడుకు వెంట్రుక దారం ఉందని, దాని శరీరం కుడివైపున చర్మం చెక్కుకుపోయి ఉందని కూడా ఆ దంపతులు చెప్పారు. అతను కన్నదీ, ఆమె విన్నదీ కలబోసుకుని ఆ ముసలివాళ్ళిద్దరూ మాకు చాలా విషయాలు చెప్పారు.

ఐతే గాండ్లాయన బొల్లిగిత్తను కొనలేదు. ముసలాయన తన కండ్లతో చూసింది జ్ఞాపకం చేసుకుంటూ, "నేను ఈడ మంచ మేసుకొని పడుకోనుంటి. వాళ్ళిద్దరు ఆ సిగరచెట్టు కింద కూసోని మాట్లాడుకుంటా ఉండిరి. మా ఊరి గాండ్లాయన గూడా వచ్చి వాళ్ళతో చేరినాడు. వాళ్ళు ముగ్గురు బీడీలు తాక్కుంటా చాన రాత్రిదాక మాట్లాడినారు. కడాన గాండ్లాయన లేచి నూనె డబ్బా నెత్తిన బెట్టుకుని ఊర్లోకి పోవటం సూసినా" అని చెప్పాడు.

ముసలమ్మ తన చెవులతో విన్నది జ్ఞాపకం చేసుకుంటూ, "ఈ నాగులమర్రి పాపిష్టి ఊరు. ఈ ఊర్లో ఆడవాళ్ళు బయట పడుకోవాలంటే భయం. నేను లోపల పడుకుని, ఉక్కకు నిద్రపట్టక సగం రాత్రిదాక మేలుకునే ఉంటి. గాండ్లాయన బొల్లిగిత్తను ఇన్నూర్రూపాయలకు అడిగినాడు. జయరాముడు ఒప్పుకోలేదు. ఐదునూర్లకు దమ్మిడీ తక్కువయితే ఆ మాటే ఎత్తద్దు. అది నా కొట్టంలో పుట్టి, నా చేతి కింద పెరిగిన గొడ్డు. ఎందుకో ఒకందుకు అమ్మేయాలనుకున్నాను. అమ్మేస్తాను. అట్టన్జెప్పి సచ్చిన సలీసుగా నీ చేతిలో పెట్టేస్తానా? రేప్పొద్దున లేచి పదిమైళ్ళు నడిస్తే మద్దిపాలెం చేర్తాం. దాన్ని పరసలో నిలబెడితే గడిసేపట్లో కర్పూరాన్నెత్తక పోయినట్లు దాన్నెత్తకపోతారు" అన్నాడు.

> **"ఈ నాగులమర్రి పాపిష్టి ఊరు. ఆడవాళ్ళు బయట పడుకోవాలంటే భయం. నేను లోపల నిద్రపట్టక సగం రాత్రి దాక మేలుకునే ఉంటి. గాండ్లాయన బొల్లిగిత్తను ఇన్నూర్రూపాయలకు అడిగి నాడు. జయరాముడు ఒప్పుకోలేదు"**

గాండ్లాయన చాలా సేపు గోజారినాడు. ఈ మనిషి ఒక మెట్టు గూడా దిగలా. ఆఖరుకు గాండ్లాయన, 'ఒదగని బేరానికి నిద్దర చేటెందుకు, సగం రాత్రి దాటింది. ఇంటికన్నా పోతా' అనడం వినిపించిందని చెప్పింది.

ఆ దంపతులు చెప్పింది వింటూ మునెమ్మ మౌనంగా కూర్చున్నది. మధ్య ఒక్క అడ్డుప్రశ్న గూడా ఆమె వేయలేదు. అడ్డు ప్రశ్నలు వేయవలసిన అవసరమే లేనంత వివరంగా వాళ్ళు చెప్పారు. వాళ్ళు చెప్పడం ముగించాక గూడా వాళ్ళింకా చెబుతూనే ఉన్నట్లు, తనింకా వింటున్నట్లు అలాగే మౌనంగా కూర్చుంది మునెమ్మ.

ఆ దంపతులు వాళ్ళ పూట కూళ్ళింట్లో మాకు ఏ లోటు రాకుండా చూసుకున్నారు. మొదటి కాన్పుకు పుట్టింటికొచ్చిన కూతురిలా భావించి మునెమ్మపై ప్రేమాదరణాలు చూపించారు.

ఐతే తొలుత అక్కడ ఆశ్రయం దొరుకుతుందన్న ఆశ అడుగంటిపోయింది. నేను మొదట వాళ్ళిద్దరిని కలిసి ఇద్దరు బాటసారులం చాలా దూరం నుంచి వచ్చామని ఒక రాత్రికి ఆశ్రయం కావాలని అడిగినప్పుడు వాళ్ళు నన్ను సంతోషంగా ఆహ్వానించారు. ముసలాయన, "ఇద్దరేం ఖర్మ, నలుగురున్నా మాకు సంతోషమే. ఈ దినం అమావాస్య. ఎవరూ ప్రయాణాలు పెట్టుకోరు. మాకింకే అతిథులూ రారు. మేముండేది ఇద్దరమే. లింగి లింగడు. మాకిద్దరికి ఈ మూల కాస్త వదిలేసి ఈ

# పోయిదొరికిన నమ్మకం




ఆర్కియాలజిస్ట్ జెఫ్ మార్కోస్ అమెరికాలోని 'ఊటా' రాష్ట్రంలో ఓ సైట్‌లో సర్వే చేస్తుంటే అతనికో పర్స్ కనిపించింది. దాన్లోని డ్రయివర్స్ లైసెన్స్‌లోని అక్షరాలు పూర్తిగా చెరిగిపోయాయి. కాని, కొన్ని క్రెడిట్ కార్డ్‌ల మీద ఎంబోస్ చేసిన పేరు స్పష్టంగా ఉంది రిచర్డ్ డిక్సన్ అని.




మార్కోస్ ఆ క్రెడిట్ కార్డ్‌లు జారీచేసిన కంపెనీలని కాంటాక్ట్‌చేసాడు. ఓ హెల్త్ ఇన్సూరెన్స్ ఫర్మ్, రెండు పోలీసు డిపార్ట్‌మెంటుని కాంటాక్ట్ చేసాక కాని, ఆ క్రెడిట్‌కార్డ్ యజమాని ఫోన్ నంబర్ లభ్యంకాలేదు.

చివరికి రిచర్డ్ డిక్సన్ అనే రియల్ ఎస్టేట్ ఏజెంట్ ఫోన్ నంబర్ దొరికింది.

ఊటా రాష్ట్రంలోని హంట్స్‌విల్లేకి చెందిన రిచర్డ్ డిక్సన్ పద్నాలుగేళ్ళ క్రితం ఎడారిలోని మోటార్ సైకిల్ రేస్‌లో పాల్గొన్నప్పుడు ఆ పర్స్‌ని పారేసుకున్నాడు. తర్వాత దాని కోసం వెదికాడు. కాని అది దొరకలేదు. అది అతని నైజాన్ని నెగెటివ్‌గా పభావితం చేసింది. పర్స్‌తో పాటు మనుషుల మీద నమ్మకమే పోయింది. కాని పద్నాలుగేళ్ళ తర్వాత అది దొరికిన ఓ కొత్త వ్యక్తి శ్రమించి తన అడ్రస్, ఫోన్ నంబర్ పట్టుకుని దాన్ని తిరిగి తనకి చేర్చడం డిక్సన్‌కి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది.

అందులోని 550 డాలర్లలో సగం మార్కోస్‌కి ఇవ్వబోతే అతను దాన్ని సున్నితంగా నిరాకరించాడు. "నాలో మనుషుల మీద పోయిన విశ్వాసం తిరిగి ఇప్పుడు నెలకొన్నది." అంటాడు రిచర్డ్ డిక్సన్.

---

ఇల్లంతా మీదేననుకోండి" అన్నాడు. ఐతే నాతో వచ్చిన ఇంకో బాటసారి ఆడమనిషి అని చెప్పగానే వాళ్లిద్దరూ ముఖాలు మాడ్చుకున్నారు. అకస్మాత్తుగా మారిపోయారు. ధుమధుమ లాడడం ప్రారంభించారు. 'ఇది పూటకూళ్లిల్లా? సత్రమా? దీన్ని నడిపేది సంసారులా, బాడుకావ్‌లా?' అనడిగారు.

రాత్రిపూట, అందునా అమావాస్య రాత్రి పూట ఒక పూటకూళ్లింట్లో బస చేసేదానికొచ్చే ఆడది ఎటువంటి ఆడది? లేచిపోయిన ఆడది వస్తుంది. ముండల కొంపనించి పారిపోయిన వేశ్య వస్తుంది. దొంగతనాలు చేసే చిత్రాంగి వస్తుంది. వీళ్లు బసచేసి వెళ్లిన మరునాడు అక్కడ శివతాండవం జరుగుతుంది. లేచొచ్చిన దాన్ని వెదుక్కుంటూ దాని మొగుడు వస్తాడు. వేశ్యను వెదుక్కుంటూ తార్పుడుగాడు వస్తాడు. చిత్రాంగిని వెదుక్కుంటూ పోలీసు జవాను వస్తాడు. అందరూ వచ్చి నానాయాగి చేస్తారు. పూట కూళ్ళింటిని నాలుగుదోవలు చేస్తారు. ".... ఆడవాళ్ళను చూసి అయ్యోయ్యమన్నప్పుడల్లా మా నెత్తికి చేతులొచ్చాయి. అందుకే ఆడవాళ్ళను లోపలికి రానియ్యకూడదని ఎప్పుడో కట్టడి చేసుకున్నాం. నువ్వు ఆ మనిషిని తీసుకుని ఊర్లోకి పో. ఊర్లోకి పోయి కరణపోడినో, మునసబునో కాళ్ళు పట్టుకో" అన్నాడు ముసలాయన.

నేను ప్రాధేయపడడం ప్రారంభించాను. ఆమె ఎవరో కాదు. మా అక్కేననీ, మాది పరువుమర్యాదలు గల కుటుంబమనీ, ఇప్పటికే ముప్ఫయి రెండు మైళ్ళు నడిచి మా అక్క అలిసిపోయి ఉందనీ, కంకర రోడ్డుమీద నడిచి నడిచి ఆమె పాదాలు వాచిపోయి ఉన్నాయనీ, ఒకరాత్రి విశ్రాంతి

తీసుకుంటేగాని పాదాల వాపు తగ్గదనీ చాలా బ్రతిమిలాడాను. ఆ ముసలాయనకు నా గొంతులో ఏమి వినిపించిందో ఏమో, ఆ ముసలమ్మకు నా ముఖంలో ఏమి కనిపించిందో ఏమో- వాళ్ళిద్దరూ "ఏదీ... ఎక్కడుందావిడ? " అంటూ కిరోసిన్ లాంతరు తీసుకుని బయటకు వచ్చారు. మునెమ్మ సిగరచెట్టు కింద నిలబడి ఉంది. వాళ్ళిద్దరు డెబ్బదేండ్ల జీవితానుభవం ఉన్న వాళ్ళు. పూటకూళ్ళింటిని నడుపుతూ వందల, వేల సంఖ్యలో అపరిచిత బాటసారులను సమాళించినవాళ్ళు. ఈ పాయకట్టులో ఎంతమంది జనం ఉన్నారో అన్నిరకాల మనస్తత్వాలను, అన్నిరకాల పోకడలను ఎరిగిన వాళ్ళు. ఒకే ఒక్క చూపుతో మనిషి గతాన్ని, వర్తమానాన్ని అంచనా వేయగలిగినవాళ్ళు. ఆవులించకముందే ప్రేవులను లెక్క పెట్టగలిగిన వాళ్ళు. అలాంటి ఆ ఇద్దరు లాంతరును పైకెత్తి, దాన్ని అటూ ఇటూ ఊపుతూ మునెమ్మ ముఖాన్ని జాముసేపు పరిశీలించారు. నాలుగడుగులు వెనక్కు జరిగి ఆమెను ఆపాదమస్తకం ఎగాదిగా చూశారు. ఆ తరవాత ముసలాయన లాంతరును కిందబెట్టి, గోడకు నిలబెట్టి ఉన్న మంచాన్ని వాల్చి "బాగ అలిసిపోయినావు తల్లీ. కాసేపు నడుం వాల్చు. ఆ తరవాత స్నానం చేసి భోజనం చేద్దువు. బచ్చలాకు కూర చేసినాం. పుల్లపెరుగు, ఉస్తికాయ పచ్చడి ఉండనే ఉండాయి" అన్నాడు.

"బాగ అలిసిపోయి నావు తల్లీ. కాసేపు నడుం వాల్చు. ఆ తరవాత స్నానం చేసి భోజనం చేద్దువు. బచ్చలాకు కూర చేసినాం. పుల్ల పెరుగు, ఉస్తికాయ పచ్చడి ఉండనే ఉండాయి" అన్నాడు ముసలాయన.

ఆ దంపతులు చెప్పేదాక ఆరోజు అమావాస్య అనే విషయం మునెమ్మకుగాని, నాకుగాని తట్టనే లేదు. "అట్టని తెల్సుంటే ఈరోజున బయలుదేరకనే పోయుందుం" అన్నాను నేను ముసలాయనతో.

ఆయన "అదంతా మన వెర్రి నాయనా. మనం సాధించ దలచుకున్నది ధర్మసమ్మతమైనదైతే, దాన్ని పొందడానికి మనకు యోగ్యత ఉంటే, దానికోసం సాగే ప్రయత్నం నిజాయితీగా సాగితే దాన్ని సాధించే తీరుతాం. ఏ అమావాస్యగాని, పౌర్ణమిగాని అడ్డురావు" అని, "ఇంతకూ మీరు ఏ పనిమీద బయలుదేరినారు? " అనడిగాడు.

అప్పుడు మునెమ్మ ఆదివారం ఉదయం జయరాముడు బొల్లిగిత్తను పట్టుకుని ఒంటిల్లు గ్రామం నుంచి బయలుదేరడంతో ప్రారంభించి, మేము నాగులమర్రి చేరేదాక జరిగిందంతా చెప్పింది. ఆ తరవాత ఆ దంపతులు జయరాముని గురించి, తరుగులోడిని గురించి, బొల్లిగిత్తను గురించి, గాండ్లాయనను గురించి తమకు తెలిసిందంతా చెప్పారు.

ఒక దశలో ముసలాయన "నువ్వు పసిదానివి తల్లీ. నీ తమ్ముడూ అనుభవం లేనోడే. తప్పిపోయిన మనిషిని ఎక్కడని వెదుకుతారు? ఏ ఊరని వెదుకుతారు? ఒక్కొక్క రోజు గడిచేకొద్దీ ఆనవాళ్ళు ఒక్కొక్కటే మాయమైపోతాయి. ఆలస్యం చేయకుండా పోలీసులకు ఫిర్యాదు చెయ్యండి. అన్నీ వాళ్ళు చూసుకుంటారు" అని సలహా ఇచ్చాడు. ఆ సలహాకు మునెమ్మ ఎలా స్పందిస్తుందోనని ఉత్సుకతతో ఎదురుచూశాను. కాని ఆ సలహా తన చెవిలో పడనే లేదన్నట్టు ఆమె రాతి బొమ్మలా కూర్చుంది.




మరుసటి దినం ఉదయం మేము నాగులమర్రి గ్రామాన్ని వదిలిపెట్టి కంకర రోడ్డెక్కి మద్దిపాలెంవైపు ప్రయాణం ప్రారంభించాం. సుదీర్ఘ ప్రయాణం మూలాన మునెమ్మ పాదాలు వాచి ఉండడం నిన్న నేను గమనించాను. ఐతే గత రాత్రంతా పూటకూళ్ళింట్లో పడుకుని విశ్రాంతి తీసుకోవడంవల్ల పాదాల వాపు పూర్తిగా తగ్గిపోయింది. పూట కూళ్లింట్లోనే ఆమె బట్టలు మార్చుకుంది. చెమటతో తడిసి ఉప్పు తేలిన బట్టలను ఉతుక్కుంది. ఉతికిన బట్టలను మూటలోంచి తీసి కట్టుకుంది.

కంకర రోడ్డుమీద మైలు దూరం నడిచాక నాకు అకస్మాత్తుగ గాండ్లాయన జ్ఞాపకమొచ్చి గబుక్కున నడక ఆపేశాను. మునెమ్మ కూడా ఆగి వెనుదిరిగి చూసింది.

"ఒక ముఖ్యమైన విషయం మర్చిపోయామక్కా. గాండ్లాయన్ను గురించి పూర్తిగా మర్చిపోయాం" అన్నాను.

"నేనేమీ మర్చిపోలేదురా. అతడిని గురించి ప్రతి క్షణమూ ఆలోచిస్తూనే ఉన్నాను. అందుకేనా ఆగిపోయినావు? నడు" అని నడక ప్రారంభించి, "అతడు బొల్లిగిత్తను బేరం చేసినాడు. అతడికి దానిపైన కన్ను పడింది నిజం. అతడు దాన్ని దక్కించుకోవడానికి చేయవలసిన ప్రయత్నాలన్నీ చేస్తాడన్నదీ నిజం. అలాంటి వాడిని ఎలా మరిచిపోతాం?" అంది మునెమ్మ.

"మరి మనం ఆ ఊర్లో ఉన్నప్పుడే అతడినొకసారి కలిసి మాట్లాడకపోతిమి"

"అవసరం లేదురా. అతడు పూటకూళ్ళింట్లో ఆడిన మాటలు, చేసిన పనులు ముసలోళ్ళు మనకు చెప్పినారు గదా" అంది మునెమ్మ.

"ముసలోళ్ళు మననుంచి ఏదైనా దాచి పెట్టుంటే..?"

మునెమ్మ కాసేపు మౌనంగా నడిచి "నువ్వు చూడబోతే ఆ ముసలోళ్ళను, తరుగులోడినీ ఒకే గాటన కట్టేట్టుండావురా సినబ్బా. లాంతరు పైకెత్తి నా ముందర ఆడిస్తూ ముసలోళ్ళు జాంవుసేపు నా ముఖాన్ని చదివినారు. వాళ్ళు నా ముఖాన్ని చదువుతున్నంతసేపు నేనూ వాళ్ళ ముఖాలను చదివినాను. వాళ్ళకు నా ముఖంలో ఏమి కనిపించిందో నాకు వాళ్ళ ముఖాల్లో అదే కనిపించింది. వాళ్ళు అబద్ధాలు చెప్పేవాళ్ళు కాదురా. ఐతే నువ్వు చెప్పేది గూడా నిజమే. మనం పొయ్యిని ఆర్పాలంటే పెద్ద పొయ్యిలోనేగాదు మారు పొయ్యిలో గూడా నీళ్ళు పోస్తాంగదా. గాండ్లాయన బేరం చేసిన మర్నాటి దినం పొద్దున్నే జయరాముడు బొల్లిగిత్తను తోలుకుని పరసకు వెళ్ళిపోయినాడు. ఇక ఈ గాండ్లాయన చేసేది పెట్టేదీ ఏమైనా ఉంటే అది పరసలోనే చేస్తాడు. మనం ఇప్పుడు పరసకే పోతా ఉండాంగదా. ఆడయాడైనా అతని పేరు వినిపిస్తుందేమో చూద్దాం" అంది.

మేము అలా మాట్లాడుకుంటూ ఒక చిట్టడవిని కడిచాం. అప్పటికి పొద్దు రెండు బారలెక్కింది. ఎండ తీవ్రత రాజుకుంటోంది. ఆ చిట్టడవి తరవాత మద్దిపాలెం వస్తుందని రోడ్డుమీద ఎదురుగా వస్తున్న బాటసారుల ద్వారా తెలుసుకున్నాం.

కాసేపటికి రోడ్డుకిరువైపుల పంట పొలాలు కనిపించాయి. వేరుసెనగ చేలు, ఆ చేలలో వరుసలు వరుసలుగా నిలబడి ఉన్న కంది చెట్లు కనిపించాయి. పచ్చటి ఆకులతో, పసుపురంగు పూతతో వేరుసె నగ చేలు విస్తారంగా పరచుకుని ఉన్నాయి. ఆ తరవాత బంగారు రంగు కంకులతో వరిచేలు, ధగధగ మెరిసే పూతతో చెరకు తోటలు కనిపించాయి. కపిల తోలుతున్న రైతులు, నాగలి దున్ను తున్న రైతులు, పారచేతబట్టుకుని పొలం గట్ల వెంబడి తిరుగుతున్న రైతులు కనిపిం చారు.

మరికొంత సేపటికి ఊరి తాలుకు ఇండ్ల పైకప్పులు కనిపించాయి.

నేను ఆ ఊరి గురించి చెప్పబోతూ "అక్కా.. ఆడ కనిపించేది మద్దిపాలెం...." అని, ఆమెవైపు చూసి ఆగిపోయాను. ఆమె నా కంఠస్వరాన్ని వినే స్థితిలో లేదు. ఆమె నడక వేగం ద్విగుణీకృతమై ఉన్నది. ఆమె పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడుస్తున్నది. ఆమెను అనుసరించడానికి నేను చిన్న పరుగులాంటి నడక సాగించా ల్సివచ్చింది.

మద్దిపాలెం చేరుకున్న తరవాత ఆమె "ఊరు కనబడగానే నా వొళ్ళంతా పులక రించిపోయిందిరా. పాదం మొదలుకుని శరీరమంతా గాలిలో తేలిపోతున్నట్టనిపిం చింది. రోడ్డుకిరువైపులా ఉండే ప్రతి చెట్టు కింద ఆయన నిలబడి చేతులు చాచి నన్ను పిలిచినాడు. ఆకాశంలో ఎండకు బదులు వెన్నెల కాస్తున్నట్టు, రోడ్డుమీద కంకర బదులు బంతిపూలు పరచుకుని ఉన్నట్లు అనిపించింది" అని చెప్పింది.

అలాంటి ఉద్విగ్న స్థితిలో ఆమె, ఆమె వెంట నేను నడిచి మద్దిపాలెం చేరు కున్నాం. మేము సాగించిన నలభై రెండు మైళ్ళ ప్రయాణంలో రోడ్డుకిరువైపులా

ఎన్నో గ్రామాలను చూశాం. అన్నిటికన్న ఇది పెద్ద ఊరు.

ఊర్లో అడుగు పెట్టగానే నాకు గూడా కాసేపు ఒళ్ళు జలదరించింది. ఈ ఊర్లో, దాని పరిసరాలలో జయరాముడి రహస్యాలు ఎన్నో దాగి ఉన్నాయి. ఆ రహస్యాలలో ఎన్ని శాశ్వతంగా అంతర్ధానమైపోయాయో! ఎన్ని బయట పడతాయో!

ఊరికి పడమటి అంచున పరస జరుగుతున్నదని వీధిలో నడుస్తున్న గ్రామస్థుల ద్వారా మేము తెలుసుకున్నాం. రెండు పెద్ద వీధుల గుండా. ఒక చిన్న వీధిగుండా నడిచి పరస వద్దకు చేరుకున్నాం. పద్నాలుగెకరాల మైదానంలో పరస నెలకొని ఉన్నది.

అదొక జనసముద్రం! అదొక జనప్రవాహం! అదొక పశువుల సముద్రం! అదొక పశువుల ప్రవాహం!

ఎంతమంది జనం! ఎన్నిరకాల జనం! అడ్డపంచెలవాళ్ళు, గోచి పంచెల వాళ్ళు. చొక్కా ఉన్న వాళ్ళు, చొక్కాలేని వాళ్ళు. తలపాగలవాళ్లు, పాగాలు లేనివాళ్ళు. తువ్వాలు భుజమ్మీద వేసుకున్న వాళ్ళు, మెడ చుట్టూ వేసుకున్న వాళ్ళు. తెలుగు మాట్లాడేవాళ్ళు, తమిళం మాట్లాడేవాళ్ళు. ఎద్దులను అమ్మేవాళ్ళు, కొనేవాళ్ళు. ఇక ఎద్దులు కొన్ని వందల సంఖ్యలో ఉన్నాయి. తెల్లెద్దులు, నల్లెద్దులు, పుల్లెద్దులు, బొల్లెద్దులు, గూడు కొమ్ములవి. ఎలి కొమ్ములవి, ముందు కొమ్ములవి. పరసలో ఎంత కోలాహలం! ఎంత సందడి!

పరస చుట్టూ కూడ అంతటి కోలాహలం, అంతటి సందడి ఉంది. తినుబండారాల దుకాణాలు. బొమ్మల దుకాణాలు. బట్టల దుకాణాలు. దారాలు, మోకులు, పట్టెడలు అమ్మే దుకాణాలు. ఇక వినోదాలకు కొదవేలేదు. కోతులను ఆడించే వాళ్ళు. పామును ఆడించేవాళ్ళు. సాముగారిడీలు చేసేవాళ్ళు. గంగిరెద్దును ఆడించే వాళ్ళు. చిలక జోస్యం చెప్పేవాళ్ళు. చేతి జోస్యం చెప్పేవాళ్ళు, తాయెత్తులు, మూలికలు అమ్మే వాళ్ళు.

మేమిద్దరం సముద్రపు ఒడ్డున రెండు గులకరాళ్ళవలే నిలబడ్డాం. మనుషుల అరుపులు, కేకలు, ఎద్దుల రంకెలు, అంబారావాలు సముద్రపు అలలవలె లేస్తూ, తగ్గుతూ ఉన్నాయి. అంతమంది జనం ఒక్కచోట చేరి ఉండగా చూడడం నాకిదే మొదటిసారి. మునెమ్మ జనాన్ని కళ్ళు పెద్దవి చేస్తూ చూసి, నా రెక్కను గట్టిగా పట్టుకుంది. చాలారోజుల తరవాత ఆమె నాతో, "ఆ జనాన్ని చూస్తా ఉంటే నాకు బయమనిపించిందిరా. వాళ్ళందరి దగ్గర చురకత్తులున్నట్టు, వాళ్ళ చేతులు నెత్తురుతో తడిసి ఉన్నట్టనిపించింది" అని చెప్పింది.

జనసందోహాన్ని చూస్తూ మేము చాలసేపు అలా నిల్చుండిపోయాం. జయరాముడిని గురించి ఎవర్ని అడగాలి? ఎక్కడ విచారించాలి?

రోడ్డుమీద నడుస్తుండినప్పుడు గాలిపాటుకు చెమట ఎప్పటికప్పుడు ఆరిపోతూ ఉండింది. ఒకేచోట నిలబడి ఉండడం వల్ల నాకు కణతలమీద, ఛాతీమీద, వీపు మీద చెమట కారసాగింది. ఉడకపోత భరించతరం గాకుండా తయారయింది. చొక్కాను తీసివేసి భుజంమీద వేసుకున్నాను. అప్పుడు బొల్లిగిత్త కొమ్ము మీద నుంచి తీసి మడతపెట్టి జేబులో వేసుకుని ఉండిన చీటీ కిందపడింది. వంగి చీటిని తీసి మడత విప్పి చూశాను. సిరాతో రాసి ఉండిన జయరాముని పేరు చెమట మూలాన తడిసిపోయి తుడిచిపెట్టుకుపోయింది. "అక్కా. జయరాముని పేరు కనిపించడం లేదు" అని చెబుదామని నోరు తెరచి ఆగిపోయాను. కలలో కనిపించిన




## ఆంటెన్నాలా... మజాకా!

ఈ అట్లాస్ చిమ్మటకు ఈత ఆకులను తలపించేలా పైకి పొడుచుకొచ్చిన ఆంటెన్నాలను చూశారా? వీటిలో చాలా మాయ ఉందండోయ్! దాదాపు రెండు కిలోమీటర్ల దూరంలో జతకట్టేందుకు ఆడజీవి ఉన్నా... వీటి ద్వారా దానికి తెలిసిపోతుందట. అది విడుదలచేసే వాసనలను ఈ ఆంటెన్నాలు ఇట్టే పసిగట్టేస్తాయన్నమాట.



దృశ్యాలకే అంత ప్రాముఖ్యతనిచ్చి ఈ యాత్ర చేస్తున్న మనిషి దీనిలో మరికొన్ని అర్థాలు తీసి మరింత కుంగిపోతుంది. కొద్దిరోజుల తరవాత నేనీ విషయం ప్రస్తావించినప్పుడు మునెమ్మ "నువ్వు చెప్పి ఉండినా నేను కుంగిపోయి ఉండేదాన్ని కాదురా. ఆ మాటకొస్తే మనం ఇల్లెలబారింది అమావాస్య రోజునని తెలిసినప్పుడు నేను పట్టించుకున్నానా? ఐనా నువ్విలాంటి విషయాలను నాకొచ్చిన కలతో పోల్చలేవు. కలలో నాకు ఆయన సందేశమిచ్చాడు. అది తిరుగులేనిది" అన్నది.

చేతిలోని చీటిని పారవేయబోతూ దాన్ని ఒకసారి తిప్పి చూశాను. చీటీ వెనకభాగాన అచ్చులో చాలా విషయాలు రాసి ఉన్నాయి. అందులో పరసకు వచ్చేవారు పాటించవలసిన సూచనలు పది, పన్నెండు దాకా ఉన్నాయి. ఒక సూచన ఇలా ఉంది- "పరసలో మీ పశువులు తప్పిపోయిన యెడల వెంటనే పరస సంచాలకునికి తెలియజేయవలెను." ఆ సూచనను మునెమ్మకు చదివి వినిపించాను.

"సంచాలకుడంటే ఈ పరస నడిపేటాయనే గదా, ఆయననే అడుగుదాం. బొల్లిగిత్త పరసలోనే తప్పిపోయి ఉంటే ఆ విషయం ఆయనకు తెలిసి ఉంటుంది" అంది మునెమ్మ.




పరస సంచాలకుని ఆఫీసు పరసకు దాపుననే ఉంది. అది రెండంకణాల పెంకుటిల్లు. వాస్తవానికది ఊరి పడమటి వీధిలోని చివరి ఇల్లే. సంవత్సరానికొకసారి పరస జరిగినన్నాళ్లు దాన్ని ఆఫీసుగాను, మిగిలిన దినాలలో నివాసగృహంగాను వాడుతున్నట్టున్నారు. దాని తలుపు పక్కన 'మద్దిపాలెం పరస. సంచాలకుని ఆఫీసు' అని రాసి ఉన్న అట్టముక్క వ్రేలాడుతూ ఉంది.

మేము వెళ్ళేటప్పటికి ఆఫీసులో బెంచీల మీద ఐదారుగురు మగవాళ్ళు కూర్చుని చుట్టలు, బీడీలు కాల్చుకుంటూ గడబిడగా మాట్లాడుకుంటున్నారు. కిటికీ దగ్గర గోడ వారన కుర్చీలో ఒక బుర్రమీసాల మనిషి కూర్చుని ఉన్నాడు. అతని ముందరున్న టేబుల్ మీద కొన్ని రిజిష్టర్లు, కొన్ని రసీదు బుక్కులు, ఒక సిరాబుడ్డీ వగైరా ఉన్నాయి. ఆ బుర్ర మీసాల మనిషే పరస సంచాలకుడని మేము భావించాం. మేము లోపలికి అడుగు పెట్టగానే మగవాళ్ళంతా నిశ్శబ్దమైపోయారు. బీడీలు, చుట్టలు పట్టుకుని ఉండిన చేతులు కిందకు దిగాయి. ఎద్దుల పరసకు ఒక ఆడమనిషి రావడమే వింత. ఇక ఆ ఆడ మనిషి పరస పంచాలకుని ఆఫీసుకు రావడం మరీ వింత. మగవాళ్ళందరూ మాటలు దగ్గి మునెమ్మ వైపే చూడసాగారు.

మునెమ్మ పరస సంచాలకుని ఎదుట నిలబడి, "అన్నా, మాది ఒంటిల్లు గ్రామం. ఇక్కడకు నలభై మైళ్ళుంటుంది. నా పెనిమిటి నాలుగురోజుల క్రితం మా బొల్లిగిత్తను ఈ పరసలో అమ్మేదానికి తోలుకొచ్చినాడు. ఆయన ఇంతవరకు తిరిగి రాలేదు. బొల్లిగిత్త మాత్రం ఒంటరిగా తిరిగొచ్చింది" అని చెప్పింది.

పరస సంచాలకుడు "గొడ్డు ఒంటరిగా తిరిగొచ్చేసిందా? ఐతే కష్టమేనే. అట్ల కూర్చుని చెప్పమ్మా. ఈ పరస ప్రారం

అన్నట్టే నిజం

# అతి విలువైనది

రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభమైన రోజులవి. టెలివిజన్ కనుగొన్న జాన్ బెయిర్డ్‌ను లండన్‌లో ఉన్న ఆయన మిత్రులు సిడిన్‌హామ్‌ను వదిలి తమ వద్దకు లండన్ వచ్చెయ్యమని కోరారు. సిడిన్‌హామ్ ప్రాంతం యుద్ధం వల్ల ప్రమాదకరమైన స్థితిలో ఉందనీ జాన్ వెంటనే లండన్ రావడం మంచిదనీ వారు సలహా ఇచ్చారు. వారు పదేపదే చెప్పిన తర్వాత జాన్ లండన్ వెళ్లాడు.




ఆయన లండన్ చేరిన రెండు గంటల తర్వాత స్నేహితులతో అన్నాడు- "నేను వెంటనే బయల్దేరి సిడిన్‌హామ్ వెళ్లాలి."

"ఎందుకు?" మిత్రులు అడిగారు.

"ఇంట్లో అతి విలువైనదాన్ని మరచిపోయి వచ్చాను. నేను వెళ్లి ఆ వస్తువును ఇక్కడికి తీసుకు వస్తాను" చెప్పాడు జాన్ వెంటనే ఆయన ఇరువురు మిత్రులతో కలిసి కార్లో బయల్దేరాడు. ఆయన కార్లో ఎంతో గంభీరంగా, ఏదో ఆతృత చెందుతున్నట్లు కూర్చున్నాడు. జాన్ ఇంట్లో మరచిన వస్తువు ఏమై ఉంటుందబ్బా? అది కలర్ టెలివిజనా? లేదా బంగారంతోగానీ, ప్లాటినమ్‌తోగానీ తయారు చేసిన వస్తువు ఏదైనా అయ్యుంటుందా? అని స్నేహితులు ఆలోచిస్తూ కూర్చున్నారు.

ఇంటి తాళం తీయగానే జాన్ వేగంగా లోనికి పరుగుతీశాడు.

"మీరిక్కడే ఉండండి. రెండు నిమిషాల్లో వచ్చేస్తాను" అన్నాడు మిత్రులతో లోనికి వెళ్తూ.

ఆయన చెప్పిన ప్రకారమే రెండు నిమిషాల్లో కారు వద్దకు తిరిగి వచ్చాడు. చేతిలో ఏ విలువైన కళాఖండంగానీ, ఖరీదైన ఏ ఇతర వస్తువుగానీ లేదు. కేవలం ఓ పిల్లి పిల్ల మాత్రమే ఉంది! దాన్ని చూసిన మిత్రులిద్దరూ తెల్లబోయారు.

---

భమై ఇది ఎనిమిదో దినం. గొడ్డు తప్పిపోయినట్లు ఇంతవరకు ఒక ఫిర్యాదు కూడా రాలేదు. అసలాగొడ్డు పరసలోకి వచ్చిందంటావా? " అన్నాడు.

మునెమ్మ నా చేతిలోని చీటీని తీసుకుని పరస సంచాలకునికి అందించింది "ఇది మా బొల్లిగిత్త కొమ్ముకు అంటించి ఉండిందన్నా" అన్నది.

పరస సంచాలకుడు చీటిలోని రసీదు నంబరును చూసి తరవాత ఒక పెద్ద రిజిష్టరులోని పేజీలు తిప్పి, ఒక పేజీ దగ్గర ఆగి, అందులోకి చూస్తూ "రసీదు నంబరు 29790. తారీఖు: 28 సోమవారం. ఎద్దు సొంతదారుని పేరు: తడకల జయరామిరెడ్డి" అని చదివి, తలపైకెత్తి "నీ పెనిమిటి పేరు అదేనా అమ్మా? " అనడిగాడు.

"ఔనన్నా" అంది మునెమ్మ.

పరస సంచాలకుడు తలమీద గోక్కుని "గొడ్డు పరసలోకి వచ్చింది నిజమే. ఐతే అది ఈడ తప్పిపోలేదు. బయట ఎక్కడో తప్పిపోయినట్టుంది. కొనుక్కున్న మనిషి ఏమైనట్టు? నీ పెనిమిటి తిరిగి రాలేదంటివి? పరసకొచ్చేటప్పుడు అతనితోబాటు ఇంకెవరైనా వచ్చారా? " అనడిగాడు.

మునెమ్మ ఒకసారి నావైపు చూసి, తరవాత తల వంచుకుని నేలవైపు చూస్తూ "ఆయనొక్కడే గిత్తను తీసుకుని వచ్చాడన్నా. తోడుగా ఎవర్నీ తీసుకురాలేదు"

## సమీక్ష

**ఓ** పుస్తక సమీక్ష చివర్లో ఒకానొక సమీక్షకుడు - ప్రతిఒక్కరూ కొని చదవాల్సిన పుస్తకం - అని రాశాడు.

అదిచూసి చలసాని 'చదవడమే తగ్గిపోతున్న రోజులివి. కొని చదవాల్సిన అంటే ఆ మాత్రం కూడా చదవరేమో జాగ్రత్త' అని చమత్కరించారు. 'చదవాల్సిన' అనేంతవరకే మనం చెప్పాలి మినహా కొనడం, కొనకపోవడం పాఠకుల ఇష్టానికి వదిలేయాలన్నది ఆయన అభిప్రాయం.



అని అబద్ధం చెప్పింది.

పరస సంచాలకుడు చేతులు పిసుక్కుని, "ఇది పెద్ద యవారమే. పోలీసులేమన్నారు? " అనడిగాడు.

మునెమ్మ, "పోలీసులకు చెప్పలేదన్నా. వాళ్ళకు చెప్పాలన్నా కొన్ని వివరాలు కావాలగదా? గొడ్డును కొనుక్కున్నదెవరో తెలిస్తే తరవాత ఏదైనా చేయొచ్చు" అంది.

పరస సంచాలకుడు "ఆ మనిషి ఎవరో యట్లు తెలుస్తుంది? మేమిక్కడ గొడ్లను అమ్మే వాళ్ళ పేర్లు రాసుకుంటాంగాని, కొనే వాళ్ళ పేర్లు రాసుకోం" అని కాసేపు ఆగి "నువ్వొక పనిచెయ్యి. ఈడొక సాంగిం ఉంది. బేరం కుదిరినాక, గొడ్డూ దుడ్డూ చేతులు మారినాక కొనుక్కున్నోడు వాని సంతోషంకొద్దీ అమ్మినోనికి కల్లు, సారా తాపిస్తాడు. నువ్వు కల్లంగడికి పోయి ఈడిగాయనతో విచారించు. ఆడ నీకు పనికొచ్చే సమాచారం దొరుకుతుంది" అని కిటికీ గుండా కనిపిస్తున్న కల్లంగడిని చూపించాడు.

మునెమ్మ బయలుదేరుతుండగా అతడే వారించి, "ఆడ మనిషివి. నువ్వేంబోతావాడికి. అక్కడంతా తాగేసి తూల్తా ఉంటారు. ఎవునికీ తలకాయ దరిణీ మీదుండదు. ఆ ఈడిగాయన్నే ఈడికి పిలిపిస్తా" అని తన పక్కనున్న వాడితో "ఒరే, ఆ ఈడిగాయన్ను ఒకసారి ఇట్ట రమ్మని చెప్పు" అన్నాడు.

కాసేపటికి ఈడిగాయన ఆఫీసులోకొచ్చాడు. పరస సంచాలకుడు విషయమంతా వివరించి చెప్పి "...అదీ సంగతి. ఆయమ్మ కాలూ కాలూ కొట్టుకుంటూ కానరాని దేశం నుంచి వచ్చింది. ఏమిజేస్తావో చెయ్" అన్నాడు.

ఈడిగాయన తను బెంచీమీద కూర్చుని, పాదాలను గూడా పైకెత్తి బెంచిమీద పెట్టుకుని, "ఈడ గొడ్డును కొనుక్కున్న ప్రతోడు అమ్మినోడిని, గొడ్డును వెంటబెట్టుకొని నా కల్లంగడి కొస్తారు. తాగి, తాగించి జల్సాలన్నీ ఐనాకనే ఇంటిదోవ పడతారు. కడదోవన్నే ఎవురూ ఇంటికి పోరు. నీపెనిమిటి యట్టుంటాడు? ఒడ్డూ, పొడవూ- అట్టాటి ఆనవాలు చెప్తే నేను పోల్చుకుంటా" అన్నాడు.

మునెమ్మ భారంగా బెంచిమీద కూర్చుని "బొల్లిగిత్త పరసకొచ్చిందనడానికి రుజువుండాది గాని, నా పెనిమిటి గూడా వచ్చినాడనడానికి రుజువు ఏముండాది. ఆయన పరసకు రాకనే పోయుండొచ్చు. దోవలోనే ఏదైనా జరిగిపోయుండొచ్చు. వేరేమనిషి ఆయన పేరుతో గొడ్డును పరసలో నిలబెట్టి ఉండొచ్చు. కాబట్టి నేను నా పెనిమిటి ఎట్టుంటాడో చెప్పి ఏవి లాభమన్నా? మా బొల్లిగిత్త ఆనవాలు చెప్తా. దానికి రెండు ఏండ్ల వయసుంటుంది.

పుల్లరంగు చర్మం మీద తెల్లమచ్చలుంటాయి. కరువాయి మూతి. గూడుకొమ్ములూ కాదు, ఎలి కొమ్ములూ కాదు. మధ్యస్తంగా ఉంటాయి. దాని ఒంటిమీద కుడిపక్కన చర్మం చెక్కుకు పోయి ఉంటుంది..."

తల ఊపుతూ, జాగ్రత్తగా వింటూ ఉండిన ఈడగాయన బెంచిమీద నుంచి పాదాలు దించేసి, "ఉండుండు ఉండమ్మా. ఆ గిత్త ముకుతాడుకు వెంట్రుకదారం ఉండిందా?" అనడిగాడు.

"ఔనన్నా. ఇంటికాడ బయలుదేరినప్పుడు దాని ముకుదాడుకు వెంట్రుక దారం ఉండింది"

ఈడిగాయన, "ఐతే నువ్వు కోరుకున్న కొండమీద వాన కురిసినట్టే అట్టాటి గిత్తను నా కల్లుపాక కాడ సూసిన" అని పక్కనున్న వాడి దగ్గర బీడీ, అగ్గిపెట్టె తీసుకొని బీడి వెలిగించి తల పైకెత్తి ఆలోచిస్తూ నాలుగుసార్లు పొగ పీల్చి, "చెప్తా ఇను. ఆ దినం సోమవారం. నాకు బాగ గెవనమే. పొద్దు ఇంకా రెండు బారలుండాది. కల్లుపాకలో ఏడెనిమిది మంది తాక్కుంటా కూసోనుండారు. ఒంటేలు పోసుకుందావని కల్లుపాక వెనుక్కి పోయినా. ఆడసూసినా తల్లీ, ఆ గిత్తను గూటానికి కట్టేసుండారు. దాని ఒళ్ళంతా ఒక పక్కన సెలిగేసి నట్టుండాది. నంజర నంజర అయిపోయుండాది. దానిమీద ఈగలు జుమ్మని వాలతా ఉండాయి. అది నిలవ లేకుండా తోకతో కొట్టుకుంటూ ఉండాది. ఎవుని గొడ్డయితే నేమి, నా కడుపు దగోత్తరంగా కాలిపోయింది తల్లీ. ఒంటేలు గూడా పోసుకోకుండా లోపలికొచ్చి అర్సినా. 'ఎవురిదయ్యా, బయటుండే గొడ్డు? దాని ఒళ్ళంతా నంజర నంజర అయిపోయుండాది. ఎవుర్దా గొడ్డు?' అనర్సినా. తాగుబోతులంతా తలలు తిప్పి నావైపొకసారి చూసి మళ్లీ తలలు తిప్పుకున్నారు. ఒక మనిషి మాత్రం పైకి లేచి నిలబడ్డాడు. లేవటం లేవటమే సారాసీసా చేతిలో పట్టుకొని లేచాడు. ఆ మనిషి నల్లగా ఉంటాడు. కొంచెం పొట్టిగా ఉంటాడు. కనుబొమలు గుబురుగా ఉండి రెండూ కల్సుకుని ఉంటాయి. కుమ్మేదానికొచ్చే పొట్టేలు మాదిరుంటాడు. నోట్లో మాట గూడా బలే పెళుసు. ఆ మనిషి లేచి ఊగుతూ నిలబడి, 'అది నా గొడ్డే. దాని ఒళ్లు నంజర నంజరైపోతే నీకెందుకు? నల్ల బాగులైపోతే నీకెందుకు?' అన్నాడు.

అందుకు నేను, 'గొడ్డు గోస పడతా ఉంటే నేను సూడలేనన్నా. నేను గూడా సేద్దినాద్దిం చేసినోడినే. మడక మాను కొట్టినోడినే. గొడ్డు కష్టం తెల్సినోడినే. ఆ గిత్త నీదంటివి. దాన్ని తీసుకొచ్చి దినమంతా పరసలో ఎండలో యట్ట నిలబెడ్తివి? అది సొంతగోడు చేసేపనా? పగోడు చేసేపనా?' అనడిగినా. ఆ మనిషి ఫకాలుమని నవ్వినాడు. సీసాపైకిత్తి, మరి నాలుగు గుక్కలు తాగి, దానికి నేను పగోడినా? ఎంత మాటంటివిరా మగడా. ఆ గిత్త ఎవరనుకున్నావు? అది నాతమ్ముడు. నా తోడబుట్టినోడు. అది నా పెండ్లిదినమే నా గాట్లోనే పుట్టింది. నేను నాపెండ్లానికి తాళిగట్టి ఇంటికి తీసుకొచ్చిన దినమే అది నేలమీద పడింది. దానిమీద నాకుండే

"చెప్తా ఇను. ఆ దినం సోమవారం. నాకు బాగ గెవనమే. పొద్దు ఇంకా రెండు బారలుండాది. కల్లుపాకలో ఏడెనిమిదిమంది తాక్కుంటా కూసోనుండారు. ఒంటేలు పోసుకుందావని కల్లుపాక వెనుక్కి పోయినా"

మరులు నీకేవి దెల్సు? ఇట్ట జూడు..' అని కుడిచేయి పైకెత్తి, 'దాని బొమ్మ ఈడ పచ్చ పొడిపించుకున్నాను, జూడు' అన్నాడు. నిజంగానే ఆ మనిషి ముంజేతి మీద బొల్లిగిత్త బొమ్మ పచ్చ పొడిచివుంది. అప్పుడు నేనడిగినా. దానిమీద అంతగా పాణం పెట్టుకుని ఉన్నోడివి, దాన్ని అమ్మ కానికెందుకు పెడితివి? అనడిగినా. ఆ మనిషి 'అదడగొద్దన్నా... అదడగొద్దు. నిల్చి నిలువునున్న దాన్ని అమ్మెయ్యాలని పించింది. పరసకు తోలుకొచ్చేసినా. అంతే ఇద్దో, ఈ తల మాసిన మనిషి కొనుక్కుంటానన్నాడు. ఐదు నూర్లు దీసుకొని ఈయన చేతిలో పెట్టేసినా' అన్జెప్పినాడు. ఆ మనిషి అట్టజెప్పి ముగించినాక ఆయన పక్కనుండిన మనిషి పైకి లేచి నాడు. ఈ మనిషి గూడా సీసా చేతిలో పట్టుకునే లేచినాడు. తూలుతూ నిలబడి, 'ఔ. తలమాసినోణ్ణి నేనే. ముడ్డిమాసినోణ్ణీ నేనే. నేనే దాన్ని ఐదు నూర్లు పెట్టి కొనుక్కున్నా. ఐతే నువ్వనుకుంటా ఉంటావు. ఆ గొడ్డు ఇల్లు చేరిన రెండ్రోజులకే చీములు పట్టిపోతుందని, దానికి పుట్టెడు జొరమొచ్చేస్తుందని, అది నీలిగి చచ్చి బండమీదకు చేర్తుందని నువ్వనుకుంటా ఉంటావు. నేనెవరో నీకు దెలవదు. నేను గొడ్లకు వైద్యం చేసేటోణ్ణి. అందులో మా పాయపట్టుకంతా నేనే మొనగాణ్ణి. నా చెయ్యి తగిలితే చచ్చిన గొడ్డుగూడ లేచి నిలబడి కాడి భుజానేసుకుంటుంది. ఈ వైద్యం నేను నా పుటకల్నుంచి చేస్తా ఉండా. ఇది మా అయ్యనా కిచ్చిపోయిన విద్య. నా దగ్గర రెండు దొడ్డ పుస్తకాలుంటాయి. ఒక్కొగిటి మోకాటెత్తు. వాటిలో ఉండేదంతా నాకు కంఠ పాఠమే. ఇప్పుడీ గిత్తను ఇంటికి దీసక పోయి వారం దినాల్లో దాన్ని పెండ్లికొడుకు మాదిర చేసి మళ్ళీ పరసకు దీసుకొచ్చి డబుల్ రేటుకు అమ్మతా. డబుల్ రేటుకు' అన్జెప్పినాడు. నాకు దెల్సింది. ఆమటుకే తల్లి. బొల్లిగిత్తను గురించి, దాన్ని అమ్మినోణ్ణి గురించి కొనుక్కున్నోణ్ణి గురించి నాకు దెల్సిన మట్టుకు చెప్పి నాను తల్లీ" అని ముగించాడు.

**ఈడిగాయనలో గొప్ప కథకుని లక్షణాలు న్నాయనిపించింది. మనిషి రూపురేఖలను సూటిగా, క్లుప్తంగా చుక్క పెట్టినట్లు వర్ణించడంలో అతడు అఖండుడు. అతని కథనమంతా విన్నాక జయరాముడే బొల్లిగిత్తను పరసకు తీసుకొచ్చాడని, అతడే దానిని అమ్మేశాడని మాకు అర్థమయింది.**

ఈడిగాయనలో గొప్ప కథకుని లక్షణాలున్నాయని పించింది. మనిషి రూపురేఖలను సూటిగా, క్లుప్తంగా చుక్క పెట్టినట్లు వర్ణించడంలో అతడు అఖండుడు. అతని కథనమంతా విన్నాక జయరాముడే బొల్లిగిత్తను పరసకు తీసుకొచ్చాడని, అతడే దానిని అమ్మేశాడని మాకు అర్థమయింది. ఇక దానిని కొనుక్కున్నది గొడ్ల వైద్యుడని తెలిసింది గానీ, అతడి ఊరు, పేరు గోప్యంగానే ఉండిపోయాయి. ఆ విషయంలో తన నిస్సహాయతను అతడు తెలియజేశాడు. నా కల్లుపాకకు రోజూ వందమంది వచ్చిపోతుంటారు తల్లీ. వాళ్ల పేర్లతో నాకేంపని?

ఇట్లా జరుగుతుందని నేను కలగన్నానా? అతని పేరు, ఊరు అడగలేదు తల్లీ" అన్నాడతను.

పరస సంచాలకుడు మాత్రం "అన్నీ మనం తెలుసుకుంటే ఇక పోలీసోల్లుండేదెందుకు? నీకు కష్టంగా ఉంటే నాకు

చెప్పమ్మా. నేను పోలీసు స్టేషనుకు పోయి ఫిర్యాదు చేస్తా. గెడిసేపిట్లో ఆ గొడ్ల వైద్యు డెవరో తెలిసిపోతుంది" అన్నాడు.

పోలీసులకు ఫిర్యాదు చేయమని మునెమ్మకు సలహా లభించడం ఇది రెండో సారి. మొదటిసారి పూట కూళ్లింట్లో మునలాయన ఆ సలహా ఇచ్చాడు. అప్పుడు మునెమ్మ ఎలా స్పందించిందో నాకు జ్ఞాపకముంది. ఆ సలహా తన చెవిలో పడనే లేదన్నట్లు ఆమె మౌనంగా రాతిబొమ్మ వలె కూర్చుంది. ఇపుడు గూడా రెండవ సారి ఆ సలహా విని సరిగ్గా అలాగే స్పందించింది.




జయరాముడు తన కుడిచేతిపైన పచ్చ పొడిచి ఉన్న బొల్లిగిత్త బొమ్మను బాహాటంగా ప్రదర్శించిన వైనాన్ని, బొల్లిగిత్తపైన తనకున్న మరులను బాహాటంగా ప్రకటించిన వైనాన్ని ఈడిగాయన వర్ణిస్తుండిన ప్పుడు మునెమ్మ కనుగుడ్లపైన నీళ్లు నిలవడం నేను గమనించాను.

ఆ కన్నీటికి ఆనకట్టలేసే ప్రయత్నంలో ఆమె ఎద ఎగిరెగిరి పడటం నేను గమనించాను. ఐతే మునెమ్మ కుడిచేతిమీద గూడా బొల్లిగిత్త బొమ్మ పచ్చపొడిచి ఉంది. ఆ విషయం ఆమె ఈడిగాయనకు చెబుతుందని నేను ఆశించాను.

ఆమె అలా చెయ్యలేదు. పరస సంచాలకుని ఆఫీసు నుంచి బయటకు వచ్చి చెట్టునీడన కూర్చుని అటుకులు తింటున్నపుడు నేనా విషయం ప్రస్తావించాను. అందుకు మునెమ్మ,

"అది వాళ్లకు చెప్పడమెందుకురా. ఇలాంటి పనిమీద బయల్దేరినపుడు ఎక్కువగా ఉపయోగించాల్సింది కళ్లనూ, చెవులనే గాని నోటిని కాదురా. మనం బయల్దేరింది మన ఒడిలో ఉండే వాటిని రోడ్డుమీద పారేసుకోవడానికి కాదు. రోడ్డుమీద దొరికినవి ఏరి ఒళ్లో వేసుకోవడానికి" అని చెప్పింది.

ఈ కారణం చేతనే ఆమె పరస సంచాలకుని ఆఫీసులో గాండ్లాయన ప్రస్తావనే తీసుకురాలేదు. "ఏ తీగ ఎక్కడెక్కడ పాకి ఎవర్నెవర్ని కలుపుతుందో తెలియకుండా ఉంది. గాండ్లాయన మారుపొయ్యిలో నిప్పు మాదిరి మిణుకు మిణుకు మంటూనే ఉన్నాడు. అట్లని చెప్పి చేతికి తగిలిన ప్రతి తీగనూ కదిలిస్తూ ఉంటే మిగిలేది గందరగోళమే" అంది మునెమ్మ.

ఈ కారణం చేతనే ఆమె జయరాముడికి తోడుగా, తరుగులోడు పరసకు వచ్చిన విషయం దాచి పెట్టింది. "చూసినావా సినబ్బా. ఈడిగాయన అంత ఇలావరిగా చెప్పినాడు గదా. అందులో యాడైనా తరుగులోని ఊసు వినిపించిందా? " అనడిగింది.

"ఔనక్కా. ఈ నాటకంలో తరుగులోడిది పెద్ద వేషమే ఉంది. ఐనా వాడి పేరు యాడా వినిపించడం లేదు"

"వినిపించని వాటిని గురించి, కనిపించని వాటిని గురించేరా మనం బాగా ఆలోచించాల్సింది. తరుగులోణ్ణి గురించి ఆలోచించాల్సింది శానా ఉంది. ఇప్పుడు మనం ఈ గొడ్ల వైద్యుని ఆచూకీ తీయాల" అంది మునెమ్మ అటుకుల కాగితాన్ని పారవేస్తూ.




గొడ్లను అమ్మడానికి, కొనడానికి పరసకు వచ్చిన వాళ్లతో మాట్లాడి ఆ ప్రాంతంలో పశువైద్యం చేసే వాళ్ళ వివరాలను సేకరించాం. ఆ ప్రాంతంలో ముగ్గురు పశు వైద్యులున్నట్టు తేలింది. అందులో ఒకడు నెల రోజుల క్రితమే చనిపోయాడట. మూలికల కోసం తలకోన అడవిలో తిరుగుతూ ఉంటే కొండచిలువ అతన్ని ఆపాద మస్తకం చుట్టుకుని పళపళ విరిచేసిందట. రెండోవాడు వారం రోజుల క్రితమే బ్రహ్మంగారి మఠాన్ని దర్శించుకోవడానికి ప్రయాణమై వెళ్ళాడట. ఇక మూడవ మనిషి పేరు కదిరప్ప. పూర్తి పేరు ఐరాల కదిరప్ప. గొడ్లకు వైద్యం చేయడం అతని వృత్తి. పుట్టినప్పట్నుంచి ఆ పనే చేస్తుండడం వల్ల అతన్ని మందులోడని, మందుల కదిరప్ప అని గూడా పిలుస్తారు. కార్వేటి నగరం రాజా వారి సంస్థానంలో కొంత కాలం గుర్రాలకు, పశువులకు వైద్యం చేశాడట. అతనింట్లో 'ఒగిటాగిటి మోకాటెత్తు' ఉండే వైద్య గ్రంథాలు రెండున్నాయట. రామనాయుడుపల్లె అతని స్వస్థలం. మద్దిపాలెం నుండి పడమరగా వెళ్ళే మట్టి బాటమీద నాలుగు మైళ్ళు నడిస్తే కొండల మధ్య ఆ ఊరు కనిపిస్తుంది.

మేము మట్టి బాటమీద రామనాయుడు పల్లికి ప్రయాణం ప్రారంభించేటప్పటికి మిట్ట మధ్యాహ్నమయింది. ఎండ ప్రచండంగా ఉంది. ఎండ తాకిడిని తట్టుకోలేక పిట్టలు భూమివైపు సూటిగా దూసుకొచ్చి టప్పుమనే శబ్దంతో భూపతనమవుతున్నాయి. భూమిమీద పడి కాళ్ళు రెక్కలు ఒక నిమిషంసేపు కొట్టుకుని ప్రాణాలు ఒదిలేస్తున్నాయి. మేమీ మట్టిబాట మీద

# ఒకటైన రెండు కుటుంబాలు



సాంద్రా, లిండా, జాయెస్‌లు అనే అమ్మాయిలు పెళ్ళిళ్ళు చేసుకున్నారు. వాళ్ళు పెళ్ళి చేసుకుంది, జర్రి, లేరి, మేక్స్‌లని. ఇందులోని విశేషం ఏమిటంటే, పెళ్ళి కూతుళ్ళు అక్కాచెల్లెళ్ళు. అంతేకాదు పెళ్ళికొడుకులు కూడా అన్నదమ్ములు.

వ్యక్తిత్వానికి, స్వతంత్రానికి ప్రాధాన్యత ఇచ్చే అమెరికాలో ఇలా ఓ కుటుంబంలోని అమ్మాయిలు ఇంకో కుటుంబంలోని అబ్బాయిలనే పెళ్ళి చేసుకోవడం అరుదైన సంఘటన.

సాంద్రా తన 23వ బర్త్‌డే పార్టీ కేలిఫోర్నియాలోని సావినాస్ అనే ఊళ్ళో ఇచ్చినప్పుడు, దానికి ఆమె తల్లి పిలవగా జెర్రీ అనే యువకుడు వచ్చాడు. ఇద్దరూ ఒకరి చేతమరొకరు ఆకర్షింపబడ్డారు.




ప్రేమలో కూడా పడ్డారు. నాలుగు నెలల తర్వాత జూలై 1966లో వారిద్దరి వివాహం అయింది.

జెర్రీ తమ్ముడు లేరి తన 17వ బర్త్‌డే పార్టీకి తన వదిన సెంద్రా చెల్లెలు 14 ఏళ్ళ లిండాని ఆహ్వానించాడు. అదే సమయంలో జెర్రీ లేరీల అన్నయ్య మేక్స్ కూడా తన భార్యనించి విడాకులు తీసుకున్నాడు. మూడోసారి ఆ కుటుంబానికి మన్మథబాణం తగిలి జాయెస్ మేక్స్ ప్రేమలో పడ్డారు. జూన్ 1976లో వారి వివాహం జరిగింది.

ఈ మూడు జంటలకి కలిపి మొత్తం 13 మంది పిల్లలు, 16 మంది మనవలు, మనవరాళ్ళు కలిగారు. ఆ రెండు కుటుంబ సభ్యుల సంఖ్య 104. వీరు చర్చికి వెళ్తే సగం చర్చి వీళ్ళతోనే నిండిపోతుంది. సావినాస్ నించి కొందరు ఫ్రెస్కోకి మారితే మిగిలిన వాళ్ళంతా కూడా అక్కడికి మారారు.

ఈ అక్కాచెల్లెళ్ళకి పెళ్ళయిన కొత్తల్లో ఉన్న ఏకైక సమస్య తమ అత్తమామలని పంచుకోవడం. తమ పిల్లల బేబీ సిట్టింగ్‌కి వేరే అత్తమామలు లేక అంతా ఒకరే కావడంతో ఇబ్బంది పడ్డారు. అది తప్ప వేరే ఇబ్బందులు లేవు.



ప్రయాణం ప్రారంభించాక అలా ప్రాణాలొదిలిన పిట్టలను నాలుగైదింటిని చూశాం. సూర్యుడు పడమటికి వాలి, ఎండ తీవ్రత తగ్గేదాక ఇలా పిట్టలు రాలిపోవడం ఆగక పోవచ్చు. అలా భూపతనమైన పిట్టలను కబళించడానికి బావురు పిల్లులు గూడా రావడం లేదు. ఎండకు జడుసుకుని జంతుజాలం గుహల్లో, పొదల్లో ఒగుర్చుతూ పడుకుని ఉన్నాయి.

పరిసరాల్లో ఎక్కడా నరసంచారం లేదు. జంతు సంచారమూ, నర సంచారము లేని ఆ మట్టిబాటమీద మా నీడలను తొక్కుకుంటూ మూడుమైళ్లు నడిచాం. మూడో మైలు గడిచాక మునెమ్మ నడక వేగం తగ్గింది. ఆమె రోడ్డు పక్కనున్న చెట్టు నీడలోకి నడిచి, "ఈడ కాసేపు ఆగుదాం సినబ్బా. ఎండ యట్టుండాదో సూడు.. కొరివి ఎగేసినట్టుండాది" అంది. అలా అంటూనే కొంగు పరుచుకుని, బట్టల మూటను తలగడగా జేసుకుని నేలమీద పడుకుంది. ఎండవడ ముఖానికి తగలకుండా ఉండేందుకు కొంగును తలమీదుగా రానిచ్చి ముఖం మీద కప్పుకుంది. ఎండలో మైళ్లకు మైళ్లు నడవడం వల్లను, వేళకు అన్నపానాలు లేకపోవడం వల్లను, నిద్ర, విశ్రాంతి లేకపోవడం వల్లను ఆమె వడలిపోయింది. ఆగకుండా చెమట పట్టుతూ ఆరుతూ ఉండటం వల్ల ఆమె శరీరం ఉప్పుతేలుతూ ఉంది. నేలమీద పడుకుని ఉన్న ఆమె ఎక్కడనుంచో కొట్టుకుని వచ్చి రోడ్డు పక్కన పడిన మసి పాతవలె ఉంది.

మునెమ్మ తన కొంగు ముసుగులోంచి ఎడమ చేతిని బయటకు చాపి "సినబ్బా పులక పులకగా ఉందిరా... జొరమొచ్చిందేమో చూడు" అంది. ఆమె చెయ్యి చాలా వేడిగా ఉంది. ఐతే అది లోపల జ్వరం వల్లనో, లేక బయట కళపెళ లాడుతున్న ఎండ మూలానో తెలియదు.

"జొరమున్నట్టే ఉందక్కా, ఈడ చల్లగా ఉంది గదా. ఒక కునుకు తియ్యి.. పొద్దు వాలాక బయలుదేరదాం. రామనాయుడు పల్లి ఇంగొక మైలే" అన్నాడు.

ఆమె తన ఎడమ చేతిని మళ్లీ లోపలకు తీసుకోలేదు. ఆ చేతిమీద పచ్చపొడిచి ఉన్న జయరాముడి పేరు ఎండలో మెరుస్తూ కనిపిస్తున్నది. వీళ్లిద్దరూ ఒకసారి తిరుపతిలో బ్రహ్మోత్సవాలకు వెళ్లారు. అక్కడ పచ్చ పొడిచే మనిషి దగ్గర కూర్చుని తమ చేతులను ఆ విధంగా అలంకరించుకున్నారు. అతడు తన కిష్టమైన బొల్లిగిత్త బొమ్మను కుడిచేతిమీద, మునెమ్మ పేరును ఎడమ చేతిపైన పొడిపించుకున్నాడు. ఈమె కూడా ఒక చేతిపైన జయరాముని పేరును, మరొక చేతిపైన బొల్లిగిత్త బొమ్మను పొడిపించుకుంది.

ఆకు అల్లాడకుండా ప్రకృతి యావత్తు మూర్ఛిల్లినట్లు నిశ్చలనంగా ఉంది. ఉడకపోత భరించలేక చిమ్మటలు రావిడి చేస్తున్నాయి.

"అక్కా"

"మ్"

"పూటకూళ్లింటి ముసలాయన ఒక మాట చెప్పాడు, పోలీసులకు ఫిర్యాదు చెయ్యమని. పరస సంచాలకుడు గూడా అదే మాట చెప్పాడు. ఆయనైతే తనే వెళ్లి ఫిర్యాదు చేస్తానని గూడా చెప్పాడు. ఆ పనిచేస్తే మనకు సగం భారం తగ్గుతుంది గదా..." అన్నాను.

మునెమ్మ చాలాసేపు మౌనంగా ఉండి, ముసుగు వెనక నుంచి "ఆ పని చెయ్యలేను సినబ్బా. జయరాముడు సంతు లేకుండా ఎల్లిపోయినాడురా. అంత్యక్రియలు గూడా సక్రమంగా జరక్కుంటే

ఆయనకు గతులుండవు. అంత్యక్రియలంటే పీనుగును పాతిపెట్టడము, పది దినాలైనాక దశదినకర్మ చేయడము- ఇవి కాదురా" అని, ముఖం మీదున్న కొంగు ముసుగును తొలగించి, "నీకు తెల్సునా సినబ్బా. ఆ రాత్రి నాకు కలొచ్చినప్పట్నించి నేను వేస్తున్న ప్రతి అడుగూ ఆయన అంత్యక్రియల్లో ఒక భాగమే. ఆయన ఏమయ్యాడో తెల్సుకోవాల. ఆయనపైన చెయ్యేసినోళ్లు- వాళ్లు ఇద్దరో, ముగ్గురో- వాళ్లను దొరకబట్టాల. వాళ్లను పాడెమీద పెట్టి, వాళ్ల నోట్లో రూకలెయ్యాల. అంత్యక్రియలంటే ఇవే. ఇది నా లెక్క. కడదాకా ఇవి నేనే చెయ్యాల. ఈ భారాన్ని పోలీసోళ్లపైన గాని, మరొకరిపైనగాని పెట్టను. ఈ బరువు కింద నేను నలిగిపోయినా సరే. ఎండి ఒరుగ్గె ఇట్ట రోడ్డు పక్కన రాలిపోయినా సరే. అందులోనే నాకు తృప్తి, ఆనందం ఉంటాయి. నీకు గెవనముందా. ఊర్లో బయల్దేరేటప్పుడు నేను ఒక్కతెనే బయల్దేరాను. అత్తమ్మ కూడా వస్తానన్నది. సుబ్బయ్య మామ కూడా వస్తాడన్నది. నేను వద్దన్నాను" అని మళ్లీ కొంగును ముఖం మీద కప్పుకొని "ఐతే నీ విషయం వేరు. నేను బయలుదేరుతుంటే నువ్వు వస్తానన్నావు. నేను రమ్మన్నాను. ఎందుకంటే నువ్వు నా మరిదివి గాబట్టి. నీకు భారతమంతా తెల్సు కదరా. క్రిష్ణుడు రథం తోలింది అర్జునునికే. భీమునికీ కాదు. ధర్మరాజుకూ కాదు. ఎందుకంటే ఆయనకు అర్జునుడు మరిది కాబట్టి" అన్నది.

మునెమ్మ చెప్పిన మాటలకు నేను ఆశ్చర్యపోలేదు. నేనామెను పాలివాళ్లవైపు బంధువుగా పరిగణిస్తున్నప్పటికీ ఆమె నన్ను వియ్యపు వాళ్లవైపు బంధువుగా పరిగణిస్తున్నదని నాకు ఎప్పటినుంచో తెలుసు. ఐతే నేను ఆమెను అక్కా అని సంబోధిస్తే ఆమె ఎప్పుడూ అభ్యంతరం చెప్పలేదు.

## 18



మా అన్వేషణ ఒక సొరంగం గుండా సాగుతూ ఉందనీ, రామినాయుడుపల్లి వద్ద ఆ సొరంగానికి ఒక పెద్ద తలుపు ఉందనీ, ఆ తలుపు గనక తెరుచుకుంటే మా అన్వేషణ సుగమమవుతుందని భావించాను. మేము తీరా ఆ ఊరు చేరాక మందులోడు చావు పడక మీదున్నాడని, మాట్లాడేస్థితిలో లేడని తెలిసింది.

రామినాయుడుపల్లిలో మందులోడి ఇల్లు వెదుక్కుంటూ వెళ్లేటప్పటికి ఆ ఇల్లు బంధువులతో కిటకిటలాడుతూ ఉంది. అతడెలాగూ చనిపోతాడని భావించి అతని భార్య, కొడుకులు బంధువులందరికీ కబురు పంపేశారు. కాని ఈ మొండి ప్రాణం పోవడం లేదు. చూసి చూసి దగ్గర ప్రాంత బంధువులు వెళ్లిపోయారు. దూరప్రాంత బంధువులు ఇంటే ఉండిపోయారు. వాళ్లతోనే ఇల్లు కిటకిటలాడుతూ ఉంది.

మందులోడు పడుకుని ఉన్న మంచం ఇంటి లోపల ఉంది. బయట ఇంటి గడపకిరువైపుల రెండు తిన్నెలున్నాయి. నడవలో కొన్ని చాపలు పరచి ఉన్నాయి.

మందులోడి భార్య ఏడ్చి ఏడ్చి ఉబ్బిపోయిన ముఖంతో చాపమీద కూర్చుని ఉంది. అప్పుడప్పుడు చీదుతూ శోకాలు



## కోటా మించొద్దు

ఆల్కహాలికులైనా చలసాని అందులోనూ క్రమశిక్షణ పాటించేవారు. మితిమీరడం ఆయన చరిత్రలోనే లేదు. అలవాటేదైనా మన మర్యాద, ఆరోగ్యమూ, ఆర్థికస్థితీ అన్నీ దృష్టిలో ఉంచుకోవాలని చెబుతుండే వారు. అలా లేనివా ళ్లతో ఇలా సరదాగా చెప్పేవారు-'నేను నాస్తి కుడ్ని. దేవుణ్ని నమ్మను. కానీ మీరు నమ్ముతారు గదా? మీ నమ్మకంతోనే ఆలోచించండి. మనిషి పోతే నూకలు చెల్లాయంటారు. నూకలతో పాటు మందు, సిగరెట్, కోడికూర, కిళ్లీలు- ఇలా అన్నీ ఇంతేసి అని రాసేస్తాడు మీ దేవుడు.



మీ కోటా మీ వాటా నూరేళ్లు కొంచెం కొంచెం వాడుకుంటారో గబగబా వాడేస్తారో మీ ఇష్టం. మీరే ఆలోచించుకోండి..'

తీస్తోంది.

అక్కడ చేరి ఉన్నవారిలో మందులోని బంధువులే గాక అతడి వైద్యం వల్ల ప్రయోజనం పొందిన శ్రేయోభిలాషులు గూడా ఉన్నారు. మునెమ్మను, నన్ను అలాంటి శ్రేయోభిలాషులుగా ఆ ఇంటి వాళ్లు భావించారు. మేము రాగానే మందులోని పెద్ద కోడలు రెండు గుండు చెంబులలో నీళ్లు తెచ్చి ఇచ్చింది. మునెమ్మ నీళ్లు తాగాక తిన్నెపైన కూర్చుంది. "ఈడ కూచోవడమెందుకక్కా, వాడు చచ్చేట్లుం డాడు. ఇంగ వాడేం మాట్లాడతాడు" అన్నాను. మునెమ్మ తిన్నెమీద గోడకు జారగిలబడి కూర్చుని,

"మాట్లాడతాడురా.. నేను చెప్పినాను గదా, సమయమొచ్చినప్పుడు రోడ్డుమీద కంకర రాళ్లు గూడా మాట్లాడతాయని. ఇప్పుడు ఈ సచ్చేవాడు గూడా మాట్లాడ తాడు" అంది.

మరికొంతసేపటికి మందులోని పెద్దకో డలు ఏడుస్తున్న రెండేళ్ల పాపను చంకనే సుకొని వచ్చి మునెమ్మ పక్కన తిన్నెమీద కూర్చుంది. శోకాలు పెడుతూ చాపమీద కూర్చుని ఉన్న మందులోడి భార్య తనను పరామర్శించడానికి బంధువులుగాని, శ్రేయోభిలాషులుగాని వచ్చిన ప్రతి ఒక్క రికీ తన భర్తకు వచ్చిన విపత్తును వివ రించి చెబుతూ ఉంది. ఆ కథనం ఏక సూత్రత ఏమీ లేకుండా ఆడవాళ్లకు ఒక తీరుగా, మగవాళ్లకు మరొక తీరుగా, వియ్యపు వాళ్లకు ఇంకొక తీరుగా, పాలివా ళ్లకు మరొక తీరుగా సాగుతూ ఉంది. ఆ కథనాన్ని మునెమ్మ అత్యంత శ్రద్ధగా విన సాగింది. ఆమె విన్న వివరాలన్నిటినీ ఒక క్రమంలో పెడితే కనిపించే చిత్రం ఇది:

"సోమవారం ఉదయం మందులోడు మద్దిపాలెం పశువుల పరసకు బయలుదేరి వెళ్లాడు. రోజంతా పరసలో పనులు చూసుకొని సాయంత్రం ఇంటి ముఖం పట్టాడు. దారిలో ఒక రైతు అతనికి తార సపడ్డాడు. ఆ రైతు అతనిని గుర్తు పట్టి తన ఆవు క్రితం రాత్రి ఈనిందని, దూడ క్షేమంగా ఉందిగాని మాయ పడడంలేదనీ, మాయ గర్భంలోనే ఉండిపోవటం వల్ల రక్తస్రావం జరుగుతూ ఉందనీ, ఆవు యమయాతన పడుతోందని చెప్పి, తన ఇంటిదాక వచ్చి వైద్యం చేసి దాని యాతన పోగొట్టవలసిందని అభ్యర్థించాడు. అది తన వృత్తి గనక ఆవుకు వైద్యం చేయడా నికి మందులోడు ఒప్పుకున్నాడు. అతడు ఆవు గర్భంలో చేయి పెట్టి పరీక్షిస్తుండగా ఆకస్మాత్తుగా, అనూహ్యా కారణాల వల్ల ఆవుకు గంగవెర్రులెత్తింది. అది గిర్రున వెనక్కు తిరిగి అతని వీపుమీద బలంగా కుమ్మింది. అతని వెన్నుపాము విరిగిపో యింది. ఆ రైతే మందులోడిని ఎడ్లబండి

మీద వేసుకొని ఇంటికి చేర్చాడు. ఇల్లు చేరిన తరవాత ఒక గంటపాటు స్పృహలో ఉండి తన విపత్తును గురించి భార్యకు, కొడుకులకు చెప్పగలిగాడు. తరవాత అపస్మారక స్థితిలోకి వెళ్లిపోయాడు. మలమూత్రాలు ఆగిపోయాయి. మాట పడిపోయింది..."

మందులోడి భార్య చెబుతున్నది వింటూంటే అంతూ పొంతూ లేని సోది వింటున్నట్లనిపించింది నాకు. ఎరుకలిసాని సోది చెప్పేటప్పుడు తను చెప్పే విషయాన్ని, చెప్పే పద్ధతిని సోది చెప్పించుకునే వాళ్ల ముఖాలను బట్టి మారుస్తూ ఉంటుంది. మందులోడి భార్య గూడా





అలాగే చేస్తోంది. ఈ విధంగా ఆమె చెప్పే మాటలలో నెల్లు ఎంత? పొల్లు ఎంత? ఇది తెలుసుకోవాలంటే మందులోడితోనే మాట్లాడవలసి ఉంటుంది. అతడేమో మాట పడిపోయి చావు పడక మీదున్నాడు. మందులోడి పెద్ద కోడలి ఒడిలో ఉన్న రెండేళ్ల పాప గుక్కపట్టి ఏడుస్తున్నది. మునెమ్మ చేతులు చాచి ఆ పాపను తన ఒడిలోకి తీసుకుంది. ఆశ్చర్యంగా ఆ పాప ఏడుపు మానేసి మునెమ్మ చేతికి ఉన్న గాజులతో ఆడుకోసాగింది.

ఇంతలో మందులోడి రెండో కోడలు కంగారు కంగారుగా ఇంటిలోపల్నుంచి వచ్చి పెద్ద కోడలితో ఏదో మాట్లాడింది. పెద్దకోడలు గబుక్కున తిన్నె మీదనుంచి దిగి లోపలికెళ్ళింది. మునెమ్మ గూడా పాపను చంకనేసుకొని ఆమెను వెంబడించింది.

లోపల ఒక పొడగాటి గదిలో కిటికీ దగ్గరగా మంచంవేసి ఉంది. అది కొబ్బరి దారాలతో అల్లిన మంచం. దానిమీద జింబుగడ్డి చాప పరచి ఉంది. చాపమీద మందులోడు చలనరహితంగా వెల్లకిల పడుకుని ఉన్నాడు. పాదాలనుండి గొంతు వరకు దుప్పటి కప్పి ఉంది. మందులోడు అప్పుడప్పుడు సన్నగా మూలుగుతున్నాడు.

మునెమ్మ మంచంపట్టె మోకాళ్లకు తగిలేంత చేరువగా నిల్చుంది. రెండేళ్ల పాప మునెమ్మ చీరను పట్టుకొని కాళ్ల వద్ద నిలబడింది. ఆమె కిరువైపుల ఇద్దరు కోడళ్ళు నిలబడ్డారు. కాసేపట్లోనే మరికొందరు ఆడవాళ్లు, మగవాళ్లు బిలబిలమని లోపలికొచ్చి మంచం చుట్టూ నిలబడ్డారు.

మరికొంతసేపటికి మందులోడు నోరు కొద్దిగ తెరచి పెదవులు చప్పరించాడు. మునెమ్మ, "ఏదైనా ఇస్తే ఆయన తాగేట్టున్నాడు. పాలుగాని, నీళ్లుగాని తెస్తే బాగుండును" అంది. వెంటనే పెద్దకోడలు ఒక అల్యూమినియం లోటాలో పాలు తెచ్చి మునెమ్మ కిచ్చి "నీ చేత్తో తాగించమ్మా. ఎవరి చెయ్యివాసి ఎట్లుందో ఏమో" అంది. మునెమ్మ వంగి ఒక గుక్కెడు పాలు తాపించింది. మందులోడి పీక ఒకసారి పైకి కిందకు ఆడింది. పాలు కడుపులోకి పోయినట్టుంది. మరి రెండు గుక్కలు పోసినప్పుడు గూడా పీకపైకి కిందకు ఆడింది. మూడు గుక్కల పాలు తాగాక మందులోడు మెల్లగా కళ్లు తెరిచి పాల లోటాను పట్టుకొని ఉన్న చేతిని, ఆ తరవాత ముంజేతిని, ముంజేతి మీదున్న బొల్లిగిత్త బొమ్మను చూశాడు. నాలుగో గుక్క పాలు పోశాక అతని పీకపైకి కిందకు ఆడలేదు. పలకమారినట్టు అతడు చిన్నగా ఒకసారి దగ్గాడు. నోట్లో ఉన్న పాలు నోటి అంచుల వద్ద తప్పించుకుని చెంపల మీదకు జారాయి. మునెమ్మ మరింత వంగి కొంగు చివరను ఎడమ చేతిలోకి తీసుకుని అతడి చెంపల మీదకు కారిన పాలను తుడిచింది. అతడు మునెమ్మ ఎడమ చేతిమీదున్న జయరాముడి పేరును చదివాడు. అతని కనుగుడ్లు రెండు ఉరులలో చిక్కుకున్న పిట్టల వలె గిలగిల కొట్టుకున్నాయి. ముఖం మీది కండరాలు దిక్కుకొక్కటిగా కొంగర్లు పోయాయి.

అతడు నోటిని మరికొంత తెరచి అక్కడున్న వాళ్లందరూ దడుచుకునేలా ఒక వికృతమైన కేక వేశాడు. రెండేళ్ల పాప మళ్ళీ ఏడుపు లంకించుకుని మునెమ్మ కాళ్లకు చుట్టుకుని చీరలో ముఖం దాచుకుంది. మందులోడి శరీరం మధ్య భాగం విల్లువలె ఒక్కసారి పైకి లేచి దబ్బున వెనక్కుపడి పోయింది. కొంతసేపటికి మంచం కిందినుంచి టప్పుటప్పుమని శబ్దం వినిపించింది. నేను కొంత దూరం జరిగి వంగి చూశాను. కొబ్బరిపీచు

దారాలు సందుల నుంచి నెత్తురు బొట్లు బొట్లుగా నేలమీద పడుతూ ఉంది. కొంత సేపటికి రక్తం ధారగా కారుతూ నేలమీద వెల్లువలా పారసాగింది.

అప్పటికి ఆ గది జనంతో నిండిపో యింది. పెద్ద తలపాగాలు ధరించిన ఇద్దరు లోపలికి వచ్చి మందులోడి నాడిని చూశారు. ముక్కుకింద, అరచేయి వెనకభా గంలో పరిశీలించారు. నడుములెత్తి తలలు అడ్డంగా ఊపారు.

ఆ తరువాత పనులు చకచక జరిగిపో యాయి. రూపాయిబిళ్లను మృతుని నోటిలో వేశారు. మొలతాడు తెంపివేశారు. కాలి బొటనవేళ్లను ఒకటిగా ముడివేశారు. తల వద్ద దీపస్తంభం నిలబెట్టి దానిమీద వెలుగుతున్న ప్రమిదను ఉంచారు.




రామినాయుడుపల్లి పొలిమేరలు దాటు కునే వరకు మేము ఒకరితోనొకరు మాట్లా డుకోలేదు. పొలిమేర దాటాక మట్టి బాట మీద నడుస్తూ మునెమ్మ, "జయరాముణ్ణి పడగొట్టింది ఈళ్లిద్దరేరా సినబ్బా. ఒకని నోట్లో రూక పడింది. ఇక తరుగులోని నోట్లో రూక పడాలి" అంది.

"వీడు నోరిడిసి రెండు మాటలు మాట్లాడి ఉంటే బాగుండేది. వీళ్లు జయ రాముణ్ణి ఏఁవిజేసిరో తెల్సి ఉండేది. నోట్లో మాట రాకనే నీలిగి సచ్చినాడు. నీళ్లకింద గులకరాయి కనిపించినట్టే కనిపించింది. దగ్గరకు పోగానే నీళ్లు కలకబారి పోయి నాయి"

"నీళ్లు కలక తీరతాయిరా సినబ్బా. కొంచెం ఓపిక పట్టు. వాడు నోరు తెరిస్తే మాత్రం నిజం చెప్పి ఉంటాడనుకు న్నావా? వాడు స్పృహలో ఉన్న గంట సమయంలో భార్యకు, కొడుకులకు చెప్పిన వన్నీ వాస్తవాలేనంటావా? వాడు వైద్యం చేస్తుంటే ఆవు తిరగబడి వెన్నుపాము ఇర గ్గొట్టిందని చెప్పినాడు. దానికి సాక్షి ఏముండాది?" అంది మునెమ్మ.

"మరింగెట్టా జరిగిందంటావు?"

మునెమ్మ చాలాసేపు మౌనంగా నడిచి తరువాత అన్నది, "వాణ్ణి బొల్లిగిత్తే చంపిం దిరా... వాడూ, తరుగులోడు ఎప్ప ట్నుంచో సావాసగాళ్లు. బొల్లిగిత్తను కొను క్కోమని తరుగులోడే మందులోణ్ణి ఎగదో లినాడు. మందులోడిచ్చిన ఐదునూర్లు జయరాముడు వస్త్రంలో పెట్టుకుని నడు ముక్కట్టుకున్నాడు. ఆయన్ను సంపేసి ఆ దుడ్డు దక్కించుకోవాలని వాళ్లిద్దరు గుస కొట్టుకున్నారు. మందులోడు చీకటి పడేదాక జయరాముడికి తాగించినాడు. బాగా చీకటైనాక మందులోడు, 'గొడ్డును కాలవ దాటించన్నా. కాలవ దాటించి పగ్గం మార్చి చేతికిస్తే నేను మా ఊరికి పోతా. శానా రాత్రయిపోయింది' అన్నాడు. మందులోడు, జయరాముడు ఊరికి చాలా దూరంగా వెళ్లి కాలవ దాటి నారు. జయరాముడు బొల్లిగిత్త ముకుదా డుకు ఉండే వెంట్రుకదారాన్ని విప్పి భుజానేసుకుని, గోగునార పగ్గం వేసి మందులోని చేతిలో పెట్టాడు. అన్నీ నడి పిస్తూ ఉండిన తరుగులోడు ఆడ తేలి నాడు. వాళ్లిద్దరూ కలిసి జయరాముని మీద పడి చంపేశారు. జయరాముడు ఒక పట్టాన కిందపడి ఉండడు. చాలాసేపు పెనుగులాడి ఉంటాడు. అదంతా బొల్లి



గిత్త కళ్లారా చూసింది. దాని తలకాయలో ఏదో పురుగు మెదిలింది. అది మొరటు ఆవేశంతో ముందుకు దూకి మందులోణ్ణి సంపేసింది. వాడు మూలుగుతూ పడి ఉంటే తెల్లవారుజామున తలారోడో, నీరు గట్టోడో చూసి వాణ్ణి ఇల్లు చేర్చినారు. నేను పోసిన పాలు తాగేదాక వాడు కొన ప్రాణంతో ఉన్నాడు. నా చేతిమీద బొల్లి గిత్త బొమ్మను చూశాక వాని గుండె ఆగి పోయింది" అన్నది.

"మరి తరుగులోడు? "

మునెమ్మ "తరుగులోడు తప్పించుకుని పారిపోయాడు. అడ్డదారిగుండా రాత్రంతా నడిచి పోటుమిట్ట చేరుకున్నాడు. ఇగ బొల్లిగిత్త అక్కడే కాసేపు తచ్చాడి కంకర రోడ్డు వెంబడి నడుచుకుంటూ ఇంటికొచ్చే సింది" అని, కొంతదూరం మౌనంగా నడిచి, దీర్ఘంగా నిట్టూరుస్తూ, "ఇదంతా కేవలం నా అనుమానమేరా సినబ్బా... నువ్వు చెప్పినట్లు సత్యం నీటి అడుగున గులకరాయివలె పడి ఉంది. నీళ్లు కలకబారి ఉన్నాయి. నీళ్ళు కలక తీరేవరకు వేచి ఉండడమే మనం చేయాల్సిన పని" అందామె.

**20**

పొద్దు పడమరకు వాలి చాలా సే పైనప్పటికీ ఎండ దుర్భరంగానే ఉంది. నేను చొక్కాను తీసి భుజం మీద వేసుకు న్నాను. మునెమ్మ మట్టిబాట పక్కన పారుతున్న కాలువ వద్దకు వెళ్లి ముఖం మీద, మెడమీద నీళ్లు చల్లుకుంది. బట్టల మూటలోంచి తువ్వాలును తీసి, తడిపి నెత్తిన వేసుకొని నడవసాగింది.

అలా కొంతసేపు నడిచి మునెమ్మ "సినబ్బా, సావు బతుకుల్లో ఉండేవాడు అబద్ధాలు చెప్తాడా? " అనడిగింది.



"యట్ట చెప్తాడక్కా... అబద్దాలు చెప్పా లంటే ముందు యనక చూసుకుంటూ మాట్లాడాల. సావు బతుకుల్లో ఉండే వాని గ్గానీ, తాగేసినోడిగ్గాని ముందు యనక సూసుకుంటూ మాట్లాడేదానికి యాడ తీరుతుంది. అట్టాటోళ్లు ఎక్కువ మాట్లాడినా తక్కువ మాట్లాడినా నిజమే మాట్లాడతారు" అన్నాను.

మునెమ్మ "అట్టనే నేనూ అనుకుంటూ ఉండా. మందులోడు స్పృహలో ఉన్న ప్పుడు భార్యకు, కొడుకులకు వాస్తవాలే చెప్పివుంటాడు. ఆ వాస్తవాలకు మసిపూసి వాడి భార్య ఏవేవో కతలు చెప్పింది.



వాడు చెప్పిన వాస్తవాలు మనం తెల్సుకో గలిగితే ఈ నీళ్లు కలకతీరిపోతాయి" అంది.

నీళ్లు కలక తీరడానికి మేము ఎక్కువ కాలం వేచి ఉండవలసిన అవసరం లేకుండా పోయింది. మందులోడిని చావు మంచంమీద చూడడానికి వస్తున్నవారి ద్వారా, చూసి వెళ్లతున్నవారి ద్వారా మాకొక ముఖ్యమైన విషయం తెలిసింది. మందులోడి భౌతిక కాయాన్ని రేపు ఉదయం భూస్థాపితం చేస్తారట. అతని పెద్దకొడుకు తలకొరివి పెడతాడు. కుటుంబ సాంప్రదాయం ప్రకారం అతడు రేపు సాయంత్రం కాణిపాకం గ్రామానికి వెళ్లి, అంత్యక్రియలలో భాగంగా కాణిపాకం సిద్ధివినాయకుని సన్నిధిలో ఒక రాత్రి గడుపుతాడు.

రామినాయుడుపల్లె పొలిమేరను దాటి, ఆ గ్రామాన్ని వదిలిపెడుతున్న తరుణంలో మాకీ విషయం తెలియడం ఒక అద్భుతమని నా మట్టుకు నాకు అన్పించింది. మునెమ్మ మాత్రం "అద్భుత మేముందిరా! పూటకూళ్ళింటి ముసలాయన చెప్పలేదా? మనం సాధించ దలచుకున్నది ధర్మ సమ్మతమైనదైతే, దానికోసం జరిగే ప్రయత్నాలు నిజాయితీతో సాగితే దాన్ని సాధించే తీరుతామని" అంది.

చావు బతుకుల్లో ఉన్నవాడే గాదు, తాగినోడే గాదు, కాణిపాకం వినాయకుని సన్నిధిలో ఉన్నవాడు గూడా అబద్ధం చెప్పలేడు. అక్కడ ప్రమాణం చేసి, కర్పూరాన్ని ఆర్పివేసి, అబద్ధం చెప్పి నాలుక్కాలాలపాటు బతికినోడే ఇంతవరకు లేడట. అలా అబద్ధం చెప్పినోడికి నిల్చి నిలువున కళ్లు పోతాయి. నోరు పడిపోతుంది. ఇవన్నీ మేము ఉగ్గుపాలతో తెలుసుకున్న విషయాలు.

కాణిపాకం గ్రామం ఇక్కడికి నాలుగుమైళ్లనీ, ఇదే మట్టిబాట పైన మళ్ళీ పడమరగా వెళితే ఆ ఊరు వస్తుందని తెల్సుకున్నాం.

మేము కాణిపాకం గ్రామానికి చేరేటప్పటికి చీకటి ప్రారంభమయింది. గుడి ఆవరణలో ఉన్న దేవగన్నేరు చెట్లలో మిణుగురులు గుంపులు గుంపులుగా ఎగురుతున్నాయి. మందులోడి పెద్దకొడుకు మాకు గర్భగుడి ఎదుటే కనిపించాడు. గుడి ఆవరణలో ఉన్న చేదబావిలో నీళ్ళు చేది స్నానం చేసినట్టున్నాడు. నుదుటి మీద, రెక్కల మీద, భుజాలపైన విబూదిరేకలు దట్టంగా కనిపిస్తున్నాయి. నిన్నంతా తండ్రిని భూస్థాపితం చేసే కార్యక్రమాలలో ఉండడం వల్ల, ఈ రోజంతా ఉపవాసంతో ఉండడం వల్ల అతని ముఖంలో బడలిక స్పష్టంగా కనిపిస్తుంది.

అతనితో మేము చాలాసేపు మాట్లాడినాం. మాట్లాడడం అయ్యాక తిరిగి వచ్చేటప్పుడు చీకట్లో నడుస్తూ మునెమ్మ, "ఈ మాదిరిగా దేవుళ్ళను నమ్మేవాళ్లు రెండు రకాలుగా ఉంటార్రా. మొదటి రకమేమో దేవునికి బయపడి నేలన నడిచే నల్లచీమకు కూడా హాని తలపెట్టలేరు. రెండో రకం వాళ్ళు దేవుని పేరు జపిస్తూనే దేవుని గుడిని, గుడిలో లింగాన్ని మింగేస్తారు. వీడు ఒకటో రకం మాదిరుండాడు. మొత్తానికి ఆ తండ్రి కడుపున పుట్టాల్సినోడు కాదు".

గర్భగుడి ఎదుట, ధ్వజస్తంభం వద్ద బాసిపట్టు వేసుకుని కూర్చుని ఉన్నాడు మందులోడి పెద్ద కొడుకు. అతని పక్కన ఒక సంచి, ఒక గుండు చెంబులో నీళ్ళు ఉన్నాయి. మేము దగ్గరగా వచ్చాక అతడు తల పైకెత్తి అయోమయంగా చూశాడు. మునెమ్మ "అయ్యా నన్ను గుర్తుపట్టి నావా? " అనడిగింది.

మందులోడి కొడుకు జ్ఞాపకం చేసు

కుంటూ, "నిన్న... మా ఇంటికీ..." అన్నాడు.

"నిన్న మీ ఇంటికి వచ్చినాను. మీ నాయనకు పాలు తాగించినాను. నా చెయ్యివాసి మంచిదని అందరూ అనుకున్నారు. కాని నా దురదృష్టం మిమ్మల్ని కూడా కొట్టింది."

అతడు తల వంచుకుని "దానికెవురేంజేస్తారమ్మా? అయన రాత కాడికి అట్టయింది" అని, తల పైకెత్తి "నిలబడే ఉండావు. అట్ట కూసో యాడనుంచొస్తా ఉండావు?" అన్నాడు.

మునెమ్మ అతని ఎదుట కూర్చుని "నేను గూడా నీ మాదిరిగానేనయ్యా. నీ తండ్రి అంత్యక్రియల్లో భాగంగా ఈ రాత్రి ఈడ నిద్ర జేసేదానికి నువ్వొచ్చినావు. నేనూ నా పెనిమిటి అంత్యక్రియల్లో భాగంగా ఈడికొచ్చినాను. ఐతే నేనిక్కడ నిద్ర చేయడానికి రాలేదు. నువ్వు నాకొక సహాయం చెయ్యాల. దానికోసమే ఇంత దూరం నిన్ను వెతుక్కుంటూ వచ్చినాను" అంది.

**"నేను గూడా నీ మాదిరిగానే నయ్యా. నీ తండ్రి అంత్యక్రియల్లో భాగంగా ఈ రాత్రి ఈడ నిద్ర జేసేదానికి నువ్వొచ్చినావు. నేనూ నా పెనిమిటి అంత్యక్రియల్లో భాగంగా ఈడికొచ్చినాను. ఐతే నేనిక్కడ నిద్ర చేయడానికి రాలేదు.**

మందులోని కొడుకు ముఖంలో ఉండిన అయోమయం పోయి, ఆ స్థానాన్ని ఆశ్చర్యం ఆక్రమించుకుంది. అతడు, "నేనా? సహాయమా?" అని, బలహీనంగా నవ్వి, "అమ్మా నువ్వెవరివో నాకు తెలియకపోయినా నాకు పగరాలివి మాత్రం కావు. అంత మట్టుకు నాకు తెల్సు. నువ్వడిగే సహాయం నాకు చేతనైనదైతే ఎందుకు చెయ్యను? అదేదో చెప్పమ్మా" అన్నాడు.

అప్పుడు మునెమ్మ అతనికి అష్ట దిగ్బంధనం చేసింది. అతడు బాసింపట్టు వేసుకుని కూర్చుని ఉన్న స్థల ప్రత్యేకతను అతనికి జ్ఞాపకం చేసింది. ఆ స్థలంలో అసత్యం చేప్పేవాడి కోసం కాచుకుని ఉండే నరకాలను గురించి చెప్పింది. అతడు ఈ స్థలానికి వచ్చిన సందర్భంలోని ప్రత్యేకతను అతనికి జ్ఞాపకం చేసింది. అతడు వచ్చింది తండ్రి అంత్య క్రియలలో భాగంగాననీ, ఈ పూట అసత్యమాడితే అతనికి సంప్రాప్తించే నరకాలన్నీ అతని తండ్రికి గూడా సంప్రాప్తిస్తాయని చెప్పింది. అలా చెప్పి "సినబ్బా, ఆ మూటలో కర్పూరముంది. దాన్నీడ పెట్టి ముట్టించు" అన్నది. నేను మూటలో నుంచి నా పిడికెడు ప్రమాణమున్నగడ్డ కర్పూరాన్ని తీసి మునెమ్మకు, మందులోడి పెద్ద కొడుక్కు మధ్య నేలమీద ఉంచి వెలిగించాను. కర్పూరం కాసేపు చిటపటలాడుతూ వెలిగి తరువాత నిలకడగా, నిర్మలంగా వెలగసాగింది.

అలా వెలుగుతున్న కర్పూర శిఖవైపు చూస్తూ మునెమ్మ, "అయ్యా మాది ఒంటిల్లు గ్రామం. ఇక్కడకు యాభైమైళ్ల పైగా ఉంటుంది. నా పెనిమిటి మా బొల్లిగిత్తను పరసలో అమ్మెయ్యడానికి ఆదివారం ఉదయం బయలుదేరివచ్చాడు. ఆయన మళ్లీ కనబడలేదు. ఆయననెవరో చంపి వేశారనడానికి నాకు రుజువులు దొరికాయి. నిన్న నువ్వు నీ తండ్రికి తల కొరివి పెట్టినావు. ఈ రెండు చావులు ఒకదాని మూలాన ఇంకొకటి జరిగిందని నా అనుమానం. అనుమానం కాదు, అది నా గట్టి నమ్మకం. ఈ నమ్మకానికి రుజువేదంటావా? ఇదో ఇట్ట జూడు" అని తన కుడి చేతి ముంజేతిని చూపిస్తూ, "ఈ పచ్చబొట్టు జూడు. దీన్ని జూడగానే నీ

## నీ కంటేనా?

మేధావుల్లోనూ కొన్ని కుళ్లలక్షణాలు ఉండడం చాలా మందికి తెలిసిందే. అలాంటి కుళ్ల మేధావి ఒకరు ఓరోజున చలసానిగారి దగ్గరకు వచ్చేసరికి ఆయన ఓ కుర్రరచయితతో మాట్లాడుతున్నారు. ఆ యువరచయిత తంటే ఆ మేధావిగారికి ఎందుకో కోపం. అందుకే అతను వెళ్లిపోగానే, 'ఇలాంటి సన్నాసులందరినీ ఎందుకు దగ్గరకు రానిస్తారు?' అని చలసానిగారిని చనువుగా నిలదీశాడు. దానికి చలసాని రిటార్టులాంటి సమాధానం- 'నీలాంటివాళ్లనే రానిచ్చాక ఆ కుర్రాడిదే ముందిలే'



తండ్రి ఎంత విలవిలలాడిపోయాడో నువు గమనించే ఉంటావు. అప్పుడు నువు గూడా మంచం దగ్గర ఉంటివి. నీ తండ్రి తన గుండెల్లో దాచుకున్నవన్నీ నాకు చెప్ప డానికి చాలా ప్రయత్నించినాడు. ఆ ప్రయ త్నంలోనే ఆ గుండె ఆగిపోయింది. ఇప్పుడు నువ్వు చెప్పు. స్పృహలో ఉన్న పుడు నీ తండ్రి నీకు, నీ తమ్ముడికి, నీ తల్లికి చెప్పినవన్నీ చెప్పు" అంది.

మందులోడి పెద్దకొడుకు పచ్చబొట్టును కాసేపు చూశాడు. చూసి సూర్యకాంతిని అట్టేసేపు చూడలేకపోతున్నట్లు కండ్లు మూసుకున్నాడు. తరవాత తలతిప్పి కర్పూర శిఖను, దేవగన్నేరు చెట్టును, ప్రహరీ గోడకవతల ఉన్న వేప చెట్టును చూశాడు. దీపం పురుగు అల్లిబిల్లిగా ఎగిరి మళ్లీ దీపం దగ్గరకే వచ్చినట్లు అతని చూపులు మళ్లీ పచ్చబొట్టు మీదకే వాలాయి. అతడలా కన్నార్పకుండా చూస్తూ చెప్పడం ప్రారంభించాడు. మునెమ్మా, నేనూ- ముందుకు వంగి వీలయినంత శ్రద్ధగా అతడు చెప్పింది విన్నాం. అంతా విన్నాక నాకు చాలా నిరాశ కలిగింది. అంతకు క్రితంరోజు మునెమ్మ తన అనుమానాల ద్వారా నాకు వ్యక్తం చేసిన దానికన్నా ఎక్కువగా అతడు చెప్పిందేమీ లేదు. కాణిపాకం నుంచి తిరిగి వస్తున్నప్పుడు నా నిరాశను గురించి చెప్పాను. "అవన్నీ నువ్వు ముందు నుంచీ అనుమానిస్తున్నవే గదక్కా. వాడు కొత్తగా చెప్పిందేంది? మనం అంతదూరం వెళ్లి కాశికి పోయి ఏదో తెచ్చినట్టయింది" అన్నాను.

మునెమ్మ నాతో ఏకీభవించక, "వాడితో మాట్లాడం వల్ల మనకు చాలా మేలు జరిగిందిరా. ఈ నాటకంలో తరుగులోని పాత్ర చాలా పెద్దదనే విషయం మనకు మొదటినుంచీ తెలుసు. ఐతే అది ఇప్పటిదాక ఒక అనుమానంగానే ఉండిపోయింది. దేవుడే ఎదురుగా నిలబడి సాక్ష్యమిచ్చినట్టు అదిప్పుడు రూఢి అయిపోయింది. నాకిప్పుడు లిబ్బి దొరికినట్టుందిరా సినబ్బా. రేపు నేను తరుగులోడిని పడగొట్టదామనుకుంటా ఉండాను. ఆ పని చేయడం ధర్మసమ్మతమేనని నాకిప్పుడు నమ్మకం ఏర్పడింది. మనిషి ఏ పని చేసినా ముందుగా ఇట్టాటి నమ్మకాన్ని సంపాదించుకోవడం చాలా ముఖ్యం రా" అన్నది.

"ఐతే తరుగులోడిని బొల్లిగిత్త రేపు చంపుతుందంటావా" అడిగాను.

మునెమ్మ సమాధానం చెప్పకుండా తలవంచుకుని నడవసాగింది. నేనా ప్రశ్న మళ్లీ వేయడంతో ఆమె తలఎత్తి నావైపు చూసి, "చెప్పలేంరా సినబ్బా! దుశ్శాసనుని రొమ్ము

చీల్చే ప్రతిజ్ఞ చేయాలని భీముడు ముందుగా అనుకున్నాడా? ద్రౌపది సిగను వాడు పట్టుకునేదాక భీమునికి ఆ తలంపే రాలేదు. అదలా ఉండగా రోట్లో వడ్లు పోసి దంచుతున్నప్పుడు మనంవేసే ప్రతి పోటూ రోట్లో పడుతుందనే భరోసా ఏమీ లేదు కదా" అంది.

బాసింపట్టు వేసుకు కూర్చుని ఉన్న మందులోడి పెద్ద కొడుకు పచ్చబొట్టును కన్నార్పకుండా చూస్తూ చాల విషయాలు చెప్పాడు. బడలిక వల్లనో లేక భయం వల్లనో అతని గొంతు చాలా బలహీనం గాను, అప్పుడప్పుడు అస్ప ష్టంగానూ ఉండింది. "తరుగు లోడు, మందులోడు చాలా ఏండ్లనుంచి సావాసగాళ్ళు. ప్రతి యేడూ పలమనేరు, పుంగనూరు, కల్లూరు, మద్ది పాలెం వంటి గ్రామాలలో జరిగే పశువుల పరసకు వాళ్ళు క్రమం దప్పక హాజరవుతారు. సోమవారం వాళ్ళిద్దరూ మద్ది పాలెం పరసలో కలుసుకు న్నారు. తరుగులోడు జయరా ముని బొల్లిగిత్తను గురించి మందులోడికి చెప్పి, ఆ గిత్తను ఐదు నూర్లకు పట్టుకొమ్మని మందులోడిని పురమాయిం చాడు. మందులోడిచ్చిన ఐదు నూర్లను జయరాముడు వస్త్రంలో పెట్టు కుని దానిని నడుం చుట్టూ కట్టుకున్నాడు. అతనిని హతమార్చి ఆ డబ్బును దక్కించు కోవడానికి వాళ్ళిద్దరూ పథకం వేసుకు న్నారు. మందులోడు జయరాముడిని కల్లుపాకలోకి తీసుకెళ్ళి చాలా రాత్రయ్యే దాక తాగించాడు. ఆ రోజు మధ్యాహ్నం నుండే తరుగులోడు జయరాముడికి కని పించలేదు. తిరునాళ్లలో తప్పిపోయిన పిల్లవాడు తండ్రిని గురించి అడిగినట్లు జయరాముడు చాలాసార్లు తరుగులోడిని గురించి అడిగాడు. ప్రతిసారీ మందులోడు, 'వాడు వెయ్యిండ్ల పూజారి. ఎవరితోనో కూసోని మద్దిస్తాలు జేస్తా ఉంటాడు. వాడే వస్తాడు. నువు తాగు,' అన్నాడు. మాటు మనిగే రాత్రయినాక వాళ్ళిద్దరూ 'కాలవ దాటి', 'పగ్గం మార్చుకు' నేందుకు కల్లుపాక నుంచి బయలుదే రారు. కాలువ దాటినాక, చీకటిలో చాలా దూరం నడిచి ముందుగానే నిర్ణయించు కున్న ఒక నిర్జన ప్రదేశానికి వాళ్ళు చేరుకు న్నారు. అక్కడే తరుగులోడు వాళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు. జయరా ముడు బొల్లిగిత్త ముకుదాడుకు ఉండిన వెంట్రుక దారాన్ని విప్పి భుజం మీద వేసుకు న్నాడు. గోగునార దారాన్ని ముకుతాడుకు వేసి దారాన్ని మందులోడి చేతిలో పెట్టాడు. పథకం ప్రకారం వాళ్ళిద్దరూ జయరాముడి మీదపడి గొంతు పిసికి చంపేశారు. చనిపోయే ముందు అతడు వాళ్ళిద్దరితో చాలాసేపు పెనుగులాడినాడు. ఇదంతా చాలా సేపటినుంచి చూస్తున్న బొల్లిగిత్త మొరటు ఆవేశంతో ముందుకు దూకింది. తరుగులోడు తృటిలో తప్పించుకుని పారి పోయి బొంతజెముడు పొదల వెనుక దాక్కున్నాడు. బొల్లిగిత్త తన బలమైన మెడను వంచి మందులోడి వీపుమీద కుమ్మింది. ఒక కొమ్ము కస్సుమని లోప లకు దూసుకుపోయింది. రెండో కొమ్ము వెన్నుపాముకు గుచ్చుకుని వెన్నుపాము విరిగిపోయింది. మందులోడు కుప్పగా కూలిపోయి మరీ లేవలేకపోయాడు. బొల్లి

> పథకం ప్రకారం వాళ్ళిద్దరూ జయరాముడి మీదపడి గొంతు పిసికి చంపేశారు. చనిపోయే ముందు అతడు వాళ్ళిద్దరితో చాలా సేపు పెనుగులాడినాడు. ఇదంతా చాలా సేపటినుంచి చూస్తున్న బొల్లిగిత్త మొరటు ఆవేశంతో ముందుకు దూకింది.

గిత్త ఆ చీకటిలో కాసేపు తచ్చాడి, కొమ్ములను ఆడించుకుంటూ, తోకను తిప్పుకుంటూ, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఇందాక వచ్చిన దారి వెంబడే వెళ్లిపోయింది. చాలాసేపయ్యాక తరుగులోడు బొంతజెముడు పొదల చాటునుండి బయటకు వచ్చి, మందులోడిని పైకెత్తడానికి ప్రయత్నించాడు. అతడు నిలబడడం కాదుగదా, కనీసం కూర్చునే స్థితిలో గూడా లేడు. అతడు హుటాహుటిన దగ్గర గ్రామానికి వెళ్ళి తన పరిచయస్థులనడిగి ఒక ఎడ్లబండిని తీసుకొచ్చాడు. మందులోడిని బండిలో వేసుకొని రామినాయుడుపల్లెకు తీసుకొచ్చి అతనిని కుటుంబ సభ్యులకు అప్పగించి అక్కడనుండి చల్లగా జారుకున్నాడు. మందులోడు గంటసేపు స్పృహలో ఉండి భార్యతో, కొడుకులతో మాట్లాడి తరవాత అపస్మారక స్థితిలోకి వెళ్ళిపోయాడు."

మందులోడి పెద్దకొడుకు తను చెప్పడం ముగించేటప్పటికి గడ్డ కర్పూరం పూర్తిగా హరించుకుపోయింది. కర్పూరం ఆరిపోవడంతో ఆ ప్రదేశాన్ని చిమ్మచీకటి ఆవరించింది. ఆ చీకటిలో ముందులోని కొడుకు గుండుచెంబును పైకెత్తి నీళ్ళు గటగట తాగడం అస్పష్టంగా కనిపించింది.

మందులోడి పెద్దకొడుకు చెప్పిందంతా విన్నాక తనకు 'లిబ్బి దొరికినట్లు' మునెమ్మ తృప్తి పడింది. ఐతే ఒక ముఖ్యమైన విషయం అతని కథనంలో ప్రస్తావనకు రాలేదు. వాళ్ళు జయరాముడిని గొంతు నులిమి చంపివేసిన ఆ నిర్జన ప్రదేశం ఏది? అతడీ విషయాన్ని కావాలని దాటవేశాడని మునెమ్మ భావించలేదు. ఈ విషయం చెప్పే అవకాశం రాకుండానే అతని తండ్రి అపస్మారక స్థితిలోకి వెళ్ళిపోయాడనే భావించింది.




మట్టి బాటమీద నడుస్తూ మళ్ళీ మేము మద్దిపాలెం గ్రామం చేరుకున్నాం. గ్రామం మొగుదల ఒక సత్రం దాని పక్కన గుర్రపు బండలతో ఒక చేద బావి కనిపించాయి. నీళ్లు చేదుకుని కాళ్లు, చేతులు, ముఖం కడుక్కున్నాం. కడుపులు ఉబ్బరించేలా నీళ్లు తాగాం. సత్రం మెట్లమీద కూలబడి గూట్లో పడుతున్న సూర్యుడినిచూస్తూ కూర్చున్నాం.

ఎండ చల్లబడిందిగాని అదే దృఢ నిశ్చయంతో సూర్యుడు పడమటి ఆకాశాన తన ప్రయాణం సాగిస్తున్నాడు.

తరుగులోడు, మందులోడు వీరిద్దరే హంతకులని ధ్రువపరచుకున్నాం. ఇందు గురించి కొన్ని చిన్నా, చితక సందేహాలున్నా అవి త్వరలో వాటంతటవే నివృత్తమవుతాయని మునెమ్మ నమ్ముతున్నది. హంతకులెవరన్నది తెలిపోయాక గూడ మా అన్వేషణలో తీవ్రత తగ్గలేదు. అయితే అనివార్యంగా దాని స్వభావం మారింది. బతికి ఉండిన మనుషుల కోసం వెదికిన రీతిలోనే చనిపోయిన వారి కోసం వెదకలేము కదా?

"అంతేమరి. బతికిన చేపలు పట్టాలంటే ఏటికి ఎగువన కొడం వెయ్యాలి. చచ్చిన చేపల్ని పట్టాలంటే ఏటికి దిగువన కొడం వెయ్యాలి" అంది మునెమ్మ.

బతికి ఉన్న మనిషి నాలుగుచోట్ల తిరు

గుతాడు. నలుగురితో మాట్లాడుతాడు. అతని ఉనికి నలుగురికి కనిపిస్తుంది. అతని గొంతు నలుగురికి వినిపిస్తుంది. చచ్చిపోయిన మనిషి ఎక్కడా తిరగడు. ఎవరితోనూ మాట్లాడాడు. అతని ఉనికి ఎవర్కైనా తెలియడం యాదృచ్ఛికం. అతని గొంతు ఎవర్కైనా వినబడడం అసంభవం.

జయరాముడి శవం గురించి పోలీసుస్టేషన్‌లో వాకబు చేద్దామన్న ఆలోచన నాకే వచ్చింది. అందుకు మునెమ్మ సుముఖంగా లేదు. తన విముఖతకు ఆమె ఇచ్చిన వివరణ మరీ విచిత్రంగా ఉన్నట్టు నాకనిపించింది. హంతకుల ఆచూకీ కన్నా ముందుగా శవం ఆచూకి కోసం వాకబు చేయడం తలకిందుల వ్యవహారమని ఆమె అభిప్రాయపడింది.

"ఇప్పటికిది తలకిందుల యవారమే గదక్కా. ఇదొక కొలిక్కి వస్తే అప్పుడది పాదాలమీద నిలబడుతుంది. ఇప్పుడు మనకింతకన్నా వేరే దోవ లేదు" అన్నాను.

"ఉండరా. నన్ను కొంచెం ఆలోచించనీ" అందామె. ఆమె సత్రం మెట్లమీద కూర్చుని, కింద పెదవిని పండ్లతో కొరుక్కుంటూ, ముఖంమీద కండరాలను బిగిస్తూ సడలిస్తూ, అంతకంతకు కిందకు దిగుతున్న సూర్యుడిని చూడసాగింది. సూర్యుడు మరి రెండు బారలు దిగేదాక కూర్చుని, "సరే, పదా. ఆ పోలీసు స్టేషను ఎక్కడుందో కనుక్కుందాం" అంటూ పైకి లేచింది.

కొద్దిరోజుల తరవాత నేనీ విషయం ప్రస్తావించినప్పుడు మునెమ్మ, "అది తలకిందుల యవారమని నేనేమీ అనుకోలేదురా. పోలీసువాళ్లు శవాన్ని చూపిస్తారని నాకు తెల్సు. కాని తీరా వాళ్లు శవాన్ని చూపిస్తే అది చూసి తట్టుకోగలనా అని పొద్దు రెండు బారలు దిగేదాక ఆలోచించినా. అంత నిబ్బరం నాకుందని నమ్మకం కుదిరినాకనే పైకి లేచినా" అంది.




పోలీసుస్టేషన్‌లో ఇద్దరే జవాన్లున్నారు. వారిద్దరు గూడా స్టేషను ఆవరణలో ఉండే పూల మొక్కలకు బొక్కెనతో నీళ్లు పోస్తున్నారు. మునెమ్మ వాళ్ల వద్దకు వెళ్లి, "అయ్యా. మేము చాలా దూరం నుంచి వచ్చినాం. పోయిన రెండు మూడు దినాలలో ఈ ప్రాంతంలో ఒక మనిషి శవం పడి ఉన్నట్లు మీకేమైనా సమాచారం అందిందా?" అంటూ ప్రారంభించి మేము వచ్చినపని, జయరాముని ఆనవాళ్ళూ వివరించి చెప్పింది.

అంతా విని ఆ ఇద్దరి జవాన్లలో ఒకడు "అడా కడవుళే. ఎవళవు పాపం సెంజిట్టేన్!" అని ఈశాన్యంవైపు తిరిగి దండం పెట్టుకుని, చెంపలేసుకున్నాడు. తరవాత తమిళంలోనే, "ఒక్కరోజు ముందుగా రాక పోతివిగదమ్మా" అన్నాడు.

సోమవారం రాత్రి మాటు మనిగే రాత్రప్పుడు జయరాముడిని చంపేశారు. చెరువు కట్ట చివరన బాగిమానుకింద శవాన్ని వదిలేశారు. మంగళవారం ఉదయం రెండు బారల పొద్దుకు ఆ సమాచారం మేకలు కాసే వాళ్ల ద్వారా పోలీసుస్టేషనుకు అందింది. అధికార్లు గ్రామమణియం సమక్షంలో పంచనామా చేశారు. బంధువులెవరూ రాలేదు





గనుక దర్యాప్తు ప్రారంభం కాలేదు. శవాన్ని ఉన్నచోటునే ఉండనిచ్చి కాపలా కాయమని, చుట్టుపక్కల గ్రామాలలో మృతుని గురించి దండోరా వేయించమని,

బుధవారం ఉదయంవరకు బంధువులెవరూ రాకపోతే శవాన్నీ అక్కడే కట్టెలు పేర్చి కాల్చెయ్యమనీ జిల్లాస్థాయి అధికారి ఆదేశాలు పంపాడు. బుధవారం మధ్యాహ్నం జవాన్లు గ్రామస్థుల సహకారంతో కర్రలు పేర్చి శవాన్ని కాల్చివేశారు. శవానికి కాపలా ఉండిన జవాన్లలో తాను ఒకడిననీ, శవాన్ని తగలబెట్టింది తన చేతులతో



నేనని తమిళం మాట్లాడే జవాను చెప్పాడు.

"...అగ్గిపుల్ల గీస్తుంటే చేతులు ఒణికినా యమ్మా. నువ్వొక దినం ముందుగా వచ్చి ఉంటే ఇవన్నీ జరక్కపోవును" అన్నాడతడు. బాధ కనిపించనవసరం లేని అతని కళ్ళలో బాధ కనిపించింది.

కాని బాధ కనిపించవలసిన మునెమ్మ ముఖంలో బాధ కనిపించలేదు. సత్రం మెట్లమీద కూర్చుని ఏమి ఆలోచించిందో; ఏమి సాధన చేసిందోగాని కావలసినంత నిబ్బరాన్ని సంతరించుకున్నట్లుంది. చివరకు భర్త శవానికి బదులు బూడిదను చూడాల్సి వచ్చినందుకు గూడా ఆమె బాధ పడుతున్నట్టు లేదు. పోలీసు జవాను జ్ఞాపకం చేసి తొందర పెట్టేదాక ఆమె ఆ బూడిదను చూడడానికి కూడా ఆసక్తి చూపలేదు.

ఆ నిరాసక్తత గురించి చాలారోజుల తరవాత నేనడిగినప్పుడు మునెమ్మ, "నేను బయల్దేరింది పీనుగు కోసము, ఎముకల కోసము, బూడిద కోసము కాదురా సినబ్బా. ఆయన్ను పడగొట్టిన వాళ్లెవరో కనుక్కోవాల. పులి జింకల్ను మలేసి చంపినట్టు వాళ్లను చంపాల. ఆయన అంత్యక్రియలు ఆ మాదిరిగా చెయ్యాలనుకున్నాను. నేను బయల్దేరింది అందుకు" అన్నది.

తమిళం మాట్లాడే జవాను, "అమ్మా



పొద్దుగూట్లో పడతా ఉండాది. మీరు కావాలనుకుంటే ఆ జాగా చూపిస్తా. ఆడ చూసేదానికి గూడా ఏమీ లేదు. జానె డెత్తు బూడిద తప్ప" అన్నాడు.

మునెమ్మ, "ఔ పొద్దు గూట్లో పడతా ఉండాది. దారి తీయ్" అంటూ వంగి బట్టల మూటను చేతిలోకి తీసుకుంది.

జవాను దారి తీయగా మేము అతని వెనక నడవసాగాం. చెరువు కట్టమీదకు మొరవ దగ్గర ఎక్కినాం. కట్టమీదకు ఎక్కి నాక జవాను, "మనం ఈ కట్ట వెంబడే పోవాలి. కట్టకు ఈ చివరన మొరవ ఉందా. ఆ చివరన పెద్ద బాగిమాను ఉంది. అద్దో ఈడకి కనబడతా ఉండాది చూడండి. ఆ మాను కిందనే కట్టెలు పేర్చికాల్చే సినాం" అని చెప్పాడు.

బాగిమాను రెండు మైళ్ళ దాక కనిపించేటంత ఎత్తుగా ఉంది. కట్ట చాలా ఎత్తుగా పొడవుగా ఉంది. కట్టకింద కనుచూపు ఆనేంత వరకు పంటపొలాలు కనిపిస్తు న్నాయి. చెరువులో సగానికి పైగా నీళ్ళున్నాయి. కొన్ని గేదెలు గుంపుగా నీటిలో ఈదు తున్నాయి. కట్టమీద అక్కడక్కడనీళ్ళలోకి గాలంవేసి కూర్చుని ఉన్నారు కొందరు మగవాళ్ళు.

జవాను ఎక్కువసేపు తమిళంలోను, అప్పుడప్పుడు తెలుగులోనూ మాట్లాడుతూ మా ముందర నడుస్తున్నాడు. ఈ చెరు వును నాలుగు తరాల క్రితం ఒక పాళె గాడు తవ్వించాడట. దీని కట్ట పదహారు వందల గజాల పొడవు ఉందట. చెరువు వెయ్యి ఎకరాలకు నీరందిస్తుందట. ఈ చెరువు మూలాన మూడు గ్రామాల జనం బతుకుతున్నారట.

జవాను వెనక మునెమ్మ, నేను పక్కప క్కన నడుస్తున్నాం. చెరువును గురించి, దాని ఆయకట్టు భూమిని గురించి వినే ఆసక్తి నాకు లేకపోవడం వల్ల నేను, "అయ్యా. కేసు దర్యాప్తు జరగలేదు. పంచ నామా మాత్రం జరిగింది గదా. ఆ మనిషి ఎట్ల ఖూనీ అయ్యాడని తేలింది? " అని అడిగాను.

**మునెమ్మ కట్టమీద ఆగిపోయింది. జవాను చెప్పిన మాటలు మెదడు లోకి ఇంకడానిక న్నట్లు కాసేపు శిలా ప్రతిమలా నిలబడి ఆ తరువాత ఎంత అకస్మాత్తుగా ఆగిందో, అంత అకస్మాత్తుగ బాగి మాను వైపు పరుగు ప్రారంభించింది.**

జవాను, "ఆ మనిషి దిట్టంగా ఉన్నాడు. ఒక పట్టాన కింద పడే రకం కాదు. ఇది ఒకడి వల్ల అయ్యేపని కాదు. ఇద్దరు, ముగ్గురు కలిపి చేసినపని. దారం మెడకేసి బిగించి గొంతు నులిమేశారు. అదేమన్నా మామూలు దారమా? వెంట్రుక దారం. పది మణు గుల బెల్లం బస్తాను ఆపు తుంది. ముడివేస్తే నూనె పూసి నట్టు జారుతుంది" అన్నాడు.

మునెమ్మ అకస్మాత్తుగా కట్ట మీద ఆగిపోయింది. జవాను చెప్పిన మాటలు మెదడులోకి ఇంకడానికన్నట్లు కాసేపు శిలా ప్రతిమలా నిలబడి ఆ తరు వాత ఎంత అకస్మాత్తుగా ఆగిందో, అంత అకస్మాత్తుగ బాగిమాను వైపు పరుగు ప్రారంభించింది. కాసేపు పరుగెత్తాక ఆమె చేతిలో ఉండిన బట్టల మూట జారి కింద పడిపోయింది. మరి కాసేపటికి చీర అంచు పాదం కిందపడి, నడుం వద్ద చీర వదులయింది. చూపులన్నీ బాగిమాను పైనే ఉంచి ఆమె పరుగెడుతూనే ఉంది. క్రమంగా చీర పూర్తిగా ఊడిపోయి, ఆరు గజాల పొడవున కట్టమీద పడిపోయింది. నేను వంగి చీరను తీసి చుట్టగా చుట్టి చంకనిరికించుకుని "అక్కా! అక్కా!" అన

రుస్తూ ఆమెను వెంబడించాను. నా పిలుపుతోనూ, నాతోనూ స్థావర జంగమాత్మకమైన యావత్తు జగత్తుతోనూ అన్ని సంబంధాలను ఆ క్షణాన ఆమె తెంచేసుకుంది. నగ్నంగా ఒక పిచ్చిదానిలా, ఒక జంతువులా ఆమె పరుగిడుతోంది.

ఒళ్లు గగుర్పొడిచే ఆ దృశ్యాన్ని పన్నెండేళ్ల తరువాత ఇప్పటికీ నేను మరచిపోలేదు. క్రమక్రమంగా ఆమెకూ, నాకు మధ్య దూరం ఎక్కువవుతోంది. అంత వేగంగా పరిగెత్తడానికి ఆమెకు శక్తి ఎక్కడనుంచి వచ్చిందన్నది గూడా ఆశ్చర్యమే. బాగిమానుకు ఆమెకు ఇంకా కనీసం నాలుగువందల గజాల దూరముంటుంది. అంత దూరం అలాగే పరుగెడుతుందా? నేను నా పిక్కల సత్తువనంతటినీ కూడదీసుకుని పరుగెత్తి ఆమెను సమీపించి, రెక్క దొరకబుచ్చుకుని ఆపాను.

అప్పటికే ఆమె ముఖమంతా కన్నీళ్లతో తడిసిపోయి ఉంది.

"ఏందక్కా ఇది? ఇవన్నీ తట్టుకునే దానికి నిబ్బరం ఉందంటివే. ఇదేనా నీ నిబ్బరం? " అన్నాను.

"ఇంగేంవి నిబ్బరంరా సినబ్బా. వాళ్లు దారంతో ఉరేసి సంపేసినార్రా. అది వెంట్రుకదారంరా. అవి నా వెంట్రుకలేరా సినబ్బా. పిలగాణ్ణి నేనే సంపేసినానురా. నేనే నా చేతుల్తో ఉరి దీసేసినానురా. వాళ్ల నోట్లో గాదు, నా నోట్లో రూకపడాలరా. ఇప్పుడు నా నోట్లో రూక పడాల" అని ఆమె బిగ్గరగా అరుస్తూ రెండు చేతులతో నుదుటిమీద బాదుకోసాగింది. అలా కాసేపు బాదుకున్నాక ఆమె నా చంకలోని చీరను చూసి "ఇదీడ యట్టుంది? " అని, తల వంచి తనను తాను చూసుకుని, "అయ్యో, అయ్యో" అంటూ నా చంకలోంచి చీరను లాక్కుంది. తొట్రుపాటు వల్ల చీరను కట్టుకోలేక పోతుండగా ఏ అనుభవంలేని నేను సాయం చేసి ఎలాగోలాగ ఒంటి చుట్టూ చీరను చుట్టబెట్టాను.

చెరువు కట్టమీద మిగిలి ఉన్న దూరం ఆమె పరుగెత్తనూ లేదు. నడవనూలేదు. తన భారాన్నంతా నా భుజం మీద వేసి నేను నడిపిస్తుండగా బొమ్మలా కదులుతూ బాగిమాను కిందకు చేరింది.

బాగిమాను కింద బొంత జెముడు పొద లదాపున ఆరడుగుల వైశాల్యంలో బూడిద పరుచుకుని ఉంది. సూర్యుడస్తమిస్తున్నది గూడా గమనించకుండా మేమిద్దరం ఆ బూడిద దగ్గర చాలాసేపు కూర్చున్నాం. చీకటి చిక్కనవుతుండగా కొంత బూడిదను ఒక ముంతలోకి సేకరించి దాని మూతికి బట్టను కట్టాం.




ఇక మద్దిపాలెంలో మేము చేయవలసిన పనులేవీ లేవు. వేరేచోట్ల చేయాల్సిన పనులున్నాయి. ఇంతవరకు జరిగిన పనులను బట్టి, బాకీ ఉన్న పనులను బట్టి మా తరువాత మజిలీ మళ్లీ పోటుమిట్టే- "ఆయన చనిపోయి రేపటికి నాలుగు దినాలవుతుందిరా. అంత్యక్రియలు సగం కూడా పూర్తి కాలేదు" అంది మునెమ్మ.

మేము మళ్లీ కంకర రోడ్డు మీదుగా వెనుకకు ప్రయాణం చేసి తొలికోడి కూస్తుండగా పోటుమిట్టను చేరుకున్నాం. అప్పటికే రోడ్డుకు ఎడమవైపున డేరాలు నిద్ర మేల్కొన్నాయి. సిపాయిలు వరుసగా

నిలబడి డ్రిల్లు చేస్తున్నారు. విజిల్ ఊదడం లయబద్ధంగా వినిపిస్తోంది. రోడ్డుకు కుడివైపున గ్రామంలో కోళ్లకూతలు అవిరామంగా లయ లేకుండా వినిపిస్తున్నాయి.

రోడ్డు పక్కన బాట గంగమ్మ గుడి, గుడి ఆవరణలో ఒక వేపచెట్టు ఉన్నాయి. మునెమ్మ వేపచెట్టు కింద కూర్చుని "ఇక నువ్వు వెళ్లి బొల్లిగిత్తను పట్టుకురా సినబ్బా. పొద్దు పుట్టకముందే వచ్చేయాలి. వచ్చేటప్పుడు చురకత్తిని బొడ్లో దోపుకుని రా" అంది.

అక్కడ నుంచి ఒంటిల్లు ఐదుమైళ్లు నేను ఇంటికి వెళ్లి ఇంట్లో చెంబుడు నీళ్లయినా తాగకుండా చురకత్తిని బొడ్లో దోపుకుని, బొల్లిగిత్తను తీసుకుని, పొద్దు పుట్టకముందే పోటుమిట్టకు తిరిగొచ్చాను. మునెమ్మ బాట గంగమ్మ గుడి ఆవరణలో వేపచెట్టు కింద అలాగే కూర్చుని ఉంది. నేను దగ్గరకు రాగానే ఆమె పైకి లేచి ఒకసారి బొల్లిగిత్తను చూసి తరువాత నాతో "కత్తి తెచ్చుకున్నావా? " అంది. నేను నా నడుం వద్ద చేత్తో తడిమి తలూపాను.

"సరే బయలుదేరదాం" అంటూ మునెమ్మ దారి తీసింది.

మేము రోడ్డు దిగి ఊర్లోకి ప్రవేశించాం. వీధి వెంబడి నడిచి తరుగులోడి ఇంటి దగ్గర కొచ్చాం. ఇంటి ముందర అరుగు మీద ఇద్దరు మగవాళ్లు కూర్చుని ఉన్నారు. ఇంటికెదురుగా ఒక వరిగడ్డి పందిరి ఉంది. పందిరి స్తంభానికి బొల్లిగిత్తను కట్టివేశాం.

నేను ఇంటికి వెళ్లి ఇంట్లో చెంబుడు నీళ్లయినా తాగకుండా చురకత్తిని బొడ్లో దోపుకుని, బొల్లిగిత్తను తీసుకుని, పోటుమిట్టకు తిరిగొచ్చాను. మునెమ్మ బాట గంగమ్మ గుడి వేప చెట్టు కింద అలాగే కూర్చుని ఉంది.

మునెమ్మ "సినబ్బా తరుగులోడు లోపల్నే ఉన్నట్టున్నాడు. బయటికి రాగానే తగుల్తాను. నా వల్ల అయినకాడికి వాని ముడ్డికింద మంట పెడతాను. వాడు బొత్తిగా రోషం లేని మనిషి. నాగుబాము తోకపైన దెబ్బపడినా పడగెత్తుతుంది. నడుంమీద దెబ్బేసినా పడగెత్తుతుంది. పూడుబాము అట్లా కాదుగదా. వాడిని చండాలంగా తిడతాను. చిన్నప్పుడు వాని తల్లి పాలాడితో పోసిందంతా వాంతి అయ్యేట్టు తిడతాను. అప్పటికీ పదరకపోతే నేనే వాడిమీద పడతాను. నువ్వు గిత్త దగ్గరనే ఉండు. దాన్ని పూర్తిగా నమ్మొద్దు. అది ఒక జంతువే గదా. నీకూ, నాకూ ఉన్నట్టూ దానికి ఆలోచన లేదు. దాని తలకాయలో పురుగు మెదిల్తే అది ఏమైనా చేస్తుంది. లేకుంటే లేదు. అది ముందుకు దూకితే సరి, లేకుంటే నువ్వు కత్తిని బయటకు తియ్" అన్నది.

నాకలా సూచనలిచ్చి మునెమ్మ వెళ్ళి తరుగులోడి ఇంటి ముందర నిలబడింది. అరుగు మీదున్న మనిషి "ఏ ఊరమ్మా" అనడిగాడు.

"మాది పక్కూరేనన్నా. యంకటరెడ్డితో పనుండొచ్చినా" అంది మునెమ్మ.

"స్నానం చేస్తా ఉండాడు. వస్తాడు అట్ట కూసో" అన్నాడు తిన్నె మీదున్న మనిషి.

మునెమ్మ కూర్చోలేదు. వీధిలో ఇసుక మీద అడుగులు మారుస్తూ అలాగే నిలబడింది.

కొంతసేపటికి తరుగులోడు సిల్కు చొక్కాకు గుండీలు పెట్టుకుంటూ బయటి కొచ్చాడు. రాగానే మునెమ్మను చూసి, "అరెరే సామెజెప్పినట్టు ఇంత పొద్దున

వచ్చినావేందమ్మా? జయరాముడు వచ్చి నాడుగదా! ఎట్టుంది కొత్త గొడ్డు?" అనడి గాడు.

"రాలేదన్నా... నేనే మద్దిపాలెం పొయ్యొస్తిని. పోవిడి పెట్టాల్సిన కాడంతా పోవిడి పెట్టినా యాడా ఆయన జాడే తెల వలేదన్నా. వెదికి వెదికి సాలైతిరిగొచ్చినా"

ఇంతలో పందిరి స్తంభానికి కట్టివేసి ఉన్న బొల్లిగిత్త తరుగులోని కంట బడింది. "అదెట్టొచ్చిందీడకు?" అనడి గాడు.

"పరసలో కొనుక్కున్నానన్నా. గాండ్లా యన దీన్ని పరసలో మారు బేరానికి పెట్టినాడన్నా. ఇంట్లో పుట్టిన గొడ్డు గదా అని నేనే కొనుక్కున్నా. జయరాముడే కన పడలేదన్నా"

"యాడికి పోతాడమ్మా, నోట్లో నాలుక ఉన్నోడు. వానికేం బయం. ఐనా నేని ప్పుడు మద్దిపాలెం పోతా ఉండాను. ఆడే డన్నా వాడు కనిపిస్తే నడుముకు దార మేసి లాక్కొచ్చి నీకప్పగిస్తా" అని అరుగు మీదున్న ఇద్దరివైపు చేయి చూపిస్తూ "ఈళ్ళిద్దరూ నిన్నట్నుంచి నా కోసరం తిర గతా ఉండారు" అన్నాడు తరుగులోడు. తర్వాత అతడు అక్కడ నుంచి కదలబో యాడు.

మునెమ్మ అతన్ని నిలేస్తున్నట్టు "నేను గూడా నీ కోసరమే వచ్చినా నన్నా" అంది.

తరుగులోడు "చెప్పినానుగదా, జయరా ముడు యాడ కనబడినా సరే, నడుముకు దారం కట్టి లాక్కొస్తా" అన్నాడు.

మునెమ్మ "ఆయన కత గాదన్నా. బొల్లి గిత్త కత. గడ్డి ముందరవేస్తే అది కొర కడం లేదు. బండి కడదామంటే కాడి కిందికి రావడంలేదు. ఎంతసేపూ తరు పుల మీదకు పోతానంటుంది" అన్నది.

తరుగులోడు బొళబొళ నవ్వి, "ఓహో హో... అదా సామెజెప్పినట్టుంది. సుల్లరం మీదుండే గిత్త అట్టగాక ఇంగెట్ట జేస్తుంది" అన్నాడు.

మునెమ్మ, "తరుపుల మీదకు పోతే ఫర వాలేదన్నా. ఇప్పుడు ఆడవాళ్ల మీదగ్గూడా పోతానంటోంది" అంది. తరుగులోడు నోరు మూసుకోవడం మరిచిపోయినట్టు అలాగే కాసేపు నోరు వెళ్లబెట్టుకొని చూసి, "ఆడవాళ్ల మీదకు పోతా ఉందా? ఇచి త్రమే. ఏంజేద్దాం? కాలం అట్టయిపో యింది. మరీ ఉపద్ర పెడతా ఉంటే పిడికొట్టించెయ్. ఆ నరం నలిగిపోతే మల్ల సచ్చినట్టు పడుంటుంది" అన్నాడు.

మునెమ్మ, "అట్టజేస్తే తప్పు గదన్నా... దేవుడిచ్చినదాన్ని అది ప్రాణంగాని, ఇంగే దన్నా గాని- మనిషి తీసేస్తే అది తప్పన్నా. అందుకే ఆ గిత్తను నీకప్ప గించిపోతా. దినానికొక తరుపును తెచ్చి దానికి తార్చు- సిపాయోళ్లకు ఆడవాళ్లను తార్చినట్లే" అంది.

తరుగులోడి ముఖం వివర్ణమయింది. తన తొట్రుపాటును దాచుకునే ప్రయ త్నంలో అతడు పంచె మడత విప్పి మళ్ళీ మడత పెట్టి కట్టుకుంటూ, "ఏమమ్మో కిండలా? పొద్దుపొద్దున్నే కిండల్జేసేదాని కొచ్చినావా?" అన్నాడు. అంత త్వరగా వాడికి రోషమొస్తుందని మునెమ్మ అనుకో లేదు. ఆమె చీర చెంగు పైకెత్తి బొడ్లో దోపుకుని, "నీతో కిండలేందిరా, తార్పుడు ముండా కొడకా! నువు జేసేపనే చెయ్య మంటి. నా గిత్తకు తరుపుల్ను తార్చ మన్నా. తరుపుల్ను గాకపోతే ఆడవాళ్లనే తార్చు నీ పెండ్లాంతో బోణీ చెయ్" అంది.

వడిసెలరాయి నుదుటిమీద, రెండు కండ్ల మధ్య తగిలినట్టయింది తరుగులో డికి. బిస ఇచ్చినట్టు వాడిముఖం మీది కండరాలు అదరసాగాయి. ఆ కండరాల లోని రక్తమంతా కండ్లలోనికి వచ్చినట్లు

కండ్లు ఎర్రబడ్డాయి. గుడ్లు తిప్పుకుంటూ వాడు, "మొగుడు సచ్చిన లంజా... నా పెండ్లాం పేరెత్తినావు-" అంటూ ఏమో చెప్పబోయాడు.

మునెమ్మ బావురు పిల్లిలా ముందుకు దూకి వాని గొంతు పట్టుకొంది. "నీకెట్ట తెల్సిందిరా నా మొగుడు చచ్చినాడని? ఊర్లో ఎవరికీ తెలియకముందే నీకెట్ట తెలిసింది? తాళి గట్టించుకున్నదాన్ని నాకు తెలియకముందే నీకెట్ట తెల్సిందిరా?" అంటూ వాడి పీకమీద బొటనవేళ్లు వేసి అదమసాగింది. తరుగులోడు తన గొంతూ చుట్టూ ఉన్న ఉడుంపట్టును సడలించడానికి పెనగులాడసాగాడు. వాడి మెడమీద చర్మం కమిలిపోయింది. వాళ్లిద్దరి పాదాల తాకిడితో వీధిలోని దుమ్ము మేఘం వలె పైకి లేచింది. కాసేపటికి మునెమ్మ గోళ్లు గుచ్చుకుని తరుగులోడి మెడమీద నాలుగైదు చోట్ల సన్నగా రక్తస్రావం ప్రారంభమయింది. చేతులు నెత్తురుతో తడవడం వల్ల మునెమ్మ చేతులు జారి పట్టు సడలసాగింది. ఆమె తల పక్కకు తిప్పి, తన మెడమీద నరాలు పొంగుతుండగా బిగ్గరగా ఒక పొలికేక వేసింది, "సినబ్బా.. పిలగాణ్ణి వదిలిపెట్టు! పిలగాణ్ణి వదిలిపెట్టు!!"

ఆ కేక విని నేను దిగ్భ్రాంతి చెందాను. తనభర్తకు మునెమ్మ పెట్టుకున్న రహస్య నామం ఆమెకు ఈ సందర్భంలో జ్ఞాపకం రావడమే నాకు దిగ్భ్రమ కలిగించింది. ఆ దిగ్భ్రాంతిలో బొల్లిగిత్త దారాన్ని విప్పబోయి, విప్పలేక బొడ్లోని కత్తిని తీసి దారాన్ని కోసేశాను. బొల్లిగిత్త ఒక్క ఎగురు ఎగిరి వీధి మధ్యలో దూకింది. అది బుసకొడుతూ మళ్ళీ ఎగిరి తరుగులోడి ముందర దూకింది.

బొల్లిగిత్త తరుగులోడిని చంపడం మునెమ్మ, నేను మాత్రమేగాక మరి నలుగురు చూశారు. రెండంటే రెండు నిముషాలలో జరిగిపోయిన ఆ సంఘటన గురించి ఆ నలుగురు నాలుగు రకాల కథనాలను వ్యాపింపజేశారు. మృతదేహాన్ని నాలుగు కాళ్లతో తొక్కుతూ బొల్లిగిత్త చాలాసేపు నాట్యం చేసిందని ఒకడు చెప్పాడు. తరుగులోడి ప్రేవులు తన కొమ్ముల నుండి వేలాడుతుండగా బొల్లిగిత్త ఊరిలోని వీధులన్నీ కలదిరిగిందని మరొకడు చెప్పాడు. మృతుని తలదగ్గర నిలబడి తన ముందరి కాళ్లతో భూమిని గీరుతూ రెండుసార్లు ఖణిల్లని రంకె వేసిందని ఇంకొకడు చెప్పాడు. అలా రంకె వేసినప్పుడు ఆ రంకెలో జయరాముని గొంతుస్పష్టంగా వినిపించిందని ఇంకొకడు చెప్పాడు. ఈ కథనాలన్నీ చాలా ఏండ్లవరకూ ఒంటిల్లు గ్రామంలోనూ పరిసర గ్రామాల్లోనూ చలామణిలో ఉండినాయి.

> **మునెమ్మ బావురు పిల్లిలా దూకి వాని గొంతు పట్టుకొంది. "నీకెట్ట తెల్సిందిరా నా మొగుడు చచ్చినాడని? ఊర్లో ఎవరికీ తెలియక ముందే నీకెట్ట తెలిసింది? తాళి గట్టించుకున్నదాన్ని నాకు తెలియకముందే నీకెట్ట తెల్సిందిరా?" అని అరిచింది.**

**నామట్టుకు నేను నా కండ్లతో చూసిందిది:**

బుసకొడుతూ తరుగులోడి ముందుదూకి, బొల్లిగిత్త వీధిలో ఉన్న దుమ్ము మూతికి తగిలేలా.. తన దృఢమైన మెడను వంచి తరుగులోడి పొత్తికడుపుమీద కుమ్మింది. కొమ్ములు రెండూ జానెడు మేర కడుపులోకి వెళ్ళిపోయాయి. అది మూతిని పక్కకు వంచి కొమ్ములను విసిరింది. తరుగులోడి ప్రేవులు బయటకొచ్చి మర్రి

ఊడల్లా మోకాళ్ళ కిందదాక వేలాడుతూ ఉదయపు ఎండలో మెరవసాగాయి. వాడు భయంకరంగా అరిచి, వెనుదిరిగి, అంతకంతకు కిందకు దిగుతున్న ప్రేవు లను పాదాలతో తొక్కుకుంటూ, రొమ్ము లోతు నీళ్ళలో నడుస్తున్న వానివలె పద డుగులు వేశాడు.

బొల్లిగిత్త మళ్ళీ ముందుకు దూక బోయింది. అప్పటికే తరుగులోడు వీధి మధ్య దుమ్ములో చలనరహితంగా బోర్ల పడి ఉండడం చూసి అది ఆగిపోయి, వెనక్కు రెండడుగులు వేసింది.




తరుగులోడు చనిపోయాక మునెమ్మ ఇంటికొచ్చి నడవలో పొగడ చెట్టుకింద మంచం వాల్చుకుని పడుకుని రెండు రాత్రులు, రెండు పగళ్ళూ ఏకధాటిగా, మూసిన కన్ను తెరవకుండా నిద్రపోయింది.

రెండు రోజులూ నేను ఉదయం, సాయంత్రం వెళ్లి ఆమెను చూశాను. మోచే తిని మడిచి తలగడగా ఉంచుకుని, నోరు కొద్దిగా తెరిచి, మెత్తగ శ్వాస సలుపుతూ ఆమె నిద్రిస్తూ ఉంది.

సామ్రాజ్యాలను జయించుకుని వచ్చిన చక్రవర్తుల ముఖాలలో కనిపించే తృప్తి, ప్రశాంతత ఆమె ముఖంలో కనిపించాయి.

మూడోరోజు ఉదయం నేను వెళ్లేటప్ప టికి ఆమె పొగడ చెట్టుకింద కనిపించ లేదు. మంచం గోడకు నిలబెట్టి ఉంది. నేను నడవలో నిలబడి ఆమె కోసం చుట్టూ చూస్తుండగా ఆమె గొంతు పశు వుల కొట్టంలో నుంచి వినిపించింది, "సినబ్బా, సమయానికి వచ్చినావు. ఇట్టరా" అని.

కొట్టంలో నేలమీద కూర్చుని ఆమె కందెన తయారుచేస్తూ ఉంది. కాల్చిన వరి గడ్డిని డబ్బాలో వేసి దానిలో కానుగ నూనె పోసి పుల్లతో కెలుకుతూ ఉంది.

నేను కొట్టంలోకి రాగానే ఆమె, "కందెన తయారు చేసినాన్రా. బండికి వెయ్యాలి. చక్రాలు తీసిపట్టుకో. నేను కందెన వేస్తా" అంది. నేను బండి చక్రాలు తీసి పట్టుకోగా ఆమె చక్రాలకు, ఇరుసుకు కందెన వేసింది.

కందెన వేయడం అయిపోయాక ఆమె డబ్బాలోని కందెనను వేలితో పైకెత్తి చూపుతూ, "కందెన మరీ చిక్కగా అయిన ట్టుంది గదా? " అన్నది, వేలినుంచి కిందకు కారుతున్న కందెనను చూపిస్తూ.

"ఇప్పుడివన్నీ ఎందుకు నీకు? " అన్నాను.

"ఎందుకేంది? రేపట్నుంచి నేనే బండి కొడతాను.. బాడుగ బండి" అంది మునెమ్మ.

"నువ్వు బండి కొడతావా? బండి తోలడం నువ్వెప్పుడు నేర్చుకున్నావక్కా " అన్నాను.

చేతి వేళ్ళకు అంటుకుని ఉన్న కందెనను రాతిస్తంభానికి రుద్దుతూ, "నేర్చుకున్న కాడికి నేర్చుకున్నాను. 'చో' అంటే కుడి వైపు. 'టిర్' అంటే ఎడమవైపు. ఇప్పటికి ఇంతవరకు తెల్సు. మిగిలినవి మెల్లమెల్లగా నేర్చుకుంటాను.

అవసరం అన్నీ నేర్పుతుందిరా సినబ్బా. ఈ మాట గొడ్డుకు కూడా వర్తిస్తుంది" అంది మునెమ్మ. 



# కాలాతీతం

# చరిత్ర సృష్టించిన వానిటీ ఫెయిర్



ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయవేదిక

వ్యక్తులలోని బలహీనతలనూ, స్వార్థాన్నీ వ్యంగ్యంగా చిత్రించిన వానిటీ ఫెయిర్ నవలను అనేకసార్లు సినిమాగా తీశారు. 1911, 1915, 1922, 1923లలో మూకీ (సైలెంట్ సినిమా)గానూ, 1932, 1935లో టాకీగానూ, ఇటీవల 2004లో మీరా నాయర్ దర్శకత్వంలో, రీస్ విదర్ స్పూన్ కథానాయికగానూ, 1967, 1973, 1987, 1998లలో టెలివిజన్ సీరియల్‌గానూ ఇది అశేష ప్రేక్షకులనలరించింది.

జాన్ బన్యన్ తన 'ది పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్'లో 'వానిటీ' అనే వూళ్లో జరిగిన ఫెయిర్ గురించి రాస్తాడు. థాకెరే తన నవలకీ పేరు పెట్టటానికదీ కారణం.

'ఈ లోకంలో అందరూ భ్రమల్లో బతుకుతున్న వారే. ఎవరి ప్రగల్భాలు, భేషజాలు వారివి. మనుషులు కప్పుకున్న ముసుగులు తీసి వాళ్ల నిజ స్వరూపాల్ని చిత్రించటమే నా లక్ష్యం...'అంటాడు రచయిత.

వ్యక్తులను కీలుబొమ్మలుగా చూసిన వాడికి హీరోలు కనిపించే అవకాశమే లేదు. ముఖ్యపాత్రలు వేరు కథానాయకులు వేరు. ఎవరైనా తన కోరికలకు, తప్పిదాలకు మూల్యం చెల్లించక తప్పదు. ఏది సబబో ఏది కాదో చెప్పడం కూడా మనకసాధ్యమే. అందరూ శలభాలే. దీనికి 'హీరో లేని నవల' అంటూ కాప్షన్ పెట్టడానికి థాకెరే యిచ్చిన వివరణ అది. హీరోల సంగతెలా వున్నా యిందులో ఇద్దరు హీరోయిన్లు మాత్రమున్నారు. వాళ్లతోనే ప్రారంభమవుతుంది కథ.

మిస్ పింకర్టన్ స్కూల్లో విద్యాభ్యాసం ముగించి ఇళ్లకు బయల్దేరతారు అమేలియా సెడ్లీ, రెబెకా (బెకీ ) షార్ప్. ఆడపిల్లలకు 'ఎటికెట్'(హై సొసైటీలో పాటించవలసిన మర్యాదలు) నేర్పించే స్కూలది. ఇద్దరూ అందాల భరిణలే. అమేలియాది సంపన్న కుటుంబం రెబెకా తండ్రి డ్రాయింగ్ టీచర్. 'ఈలోకంలో పేదవాళ్లకి దక్కేవి అవమానాలు, తిరస్కారాలు మాత్రమే. తగు చతురతో ఎలాగైనా లార్డ్‌లను, బేరన్‌లను పాదాక్రాంతం చేసుకోవాలి' అని స్కూల్లోనే నిర్ణయించుకుంది బెకీ.

అమేలియాది జాలిగుండె కొన్నాళ్లు అతిథిగా తన ఇంటికి రమ్మని బెకీని ఆహ్వానిస్తుంది. అక్కడ అమేలియా అన్న జోసెఫ్‌తో పరిచయమవుతుంది. బెంగాల్‌లోని బాగ్లీవాలాలో ఈస్టిండియా కంపెనీ తరపున కలెక్టర్‌గా పని చేస్తున్నాడతడు. సిక్ లీవ్ తీసుకుని తల్లిదండ్రులను చూడడానికి వచ్చాడు. ఆడపిల్లలను చూస్తే ముడుచుకుపోతాడు. కాని బెకీ చూపిన

వినయవిధేయతలు, ప్రేమ సంజ్ఞలు అతడిలో ఆత్మవిశ్వాసం కొంత పెంచాయి. ఒంటరిగా వున్నప్పుడు ఆమెతో బాగానే కబుర్లు చెప్పాడు. బెకీ పాడిన పాటలకు ముగ్ధుడయ్యాడు. ఇలాంటి సుందరిని చేసుకుంటే తన జీవితం ధన్యమవు తుందనుకున్నాడు.

తుపాను వచ్చిన ఒకరోజు ఇంట్లో అందరూ కూర్చుని కబుర్లు చెప్పు కుంటారు. అమేలియా ఇష్టపడిన లెఫ్టి నెంట్ జార్జ్ ఆస్బార్న్ కూడా వస్తాడు. అదే సాయంత్రం జార్జి, తన మిత్రుడు విలియం డాబిన్‌ను వాక్స్‌హాల్‌లో ఒక పార్టీకి రమ్మంటాడు. అక్కడ ప్రేమజం టలు విడివిడిగా ఎంజాయి చేయ్యాలను కుంటాయి. బెకీ మనసు ఆనందంతో పర వళ్లు తొక్కుతుంది. జోసెఫ్‌ను తనవాణ్ణి చేసుకోవడానికి ఇంతకన్నా మంచి అవ కాశం దొరకదు అనుకుంటుంది. కాని అక్కడ అతడు అతిగా తాగి సంయమనం కోల్పోతాడు. జార్జి తన మిత్రుడు డాబి న్‌కు జోసెఫ్‌ను కంట్రోల్ చెయ్యమని అర్థించి, ఆడపిల్లలిద్దర్నీ సురక్షితంగా ఇంటికి చేరుస్తాడు.

మరో అవకాశం కోసం నిరీక్షిస్తుంది బెకీ. అయితే ఒక గ్రామంలో స్థిరపడ్డ బారొనేట్ సర్‌పిట్ క్రాలీ గారింట్లో గవ ర్నెస్‌గా ఆమెకు ఉద్యోగం వచ్చింది. తక్షణం వెళ్లక తప్పదు.

అమేలియా పరిచయం వల్ల ఆమె సంప న్నుల ఇంటి పద్ధతులు బాగానే తెలుసుకుంది. ఇక బారొనెట్‌ల విలాసభ వనాల్లో మరెంత ఘనంగా ఉంటాయో అనుకుని వెళ్లిన బెకీకి ఆశాభంగమైంది. అదో పాత ఇల్లు. సర్‌పిట్ స్వయంగా మాసిన దుస్తుల్లో ఉన్నాడు. ఇంట్లో ఇద్దరు చిన్నపిల్లలు తప్ప మరెవరూ లేరు. ఆయన కుమారుడు రాడన్ సైన్యంలో ఉన్నాడట. తను నేర్చుకున్న మానర్సన్నీ ఇక్కడెందుకు పనికివస్తాయి? పిల్లలతో ఆడుకుంటూ కాలక్షేపం చేసింది బెకీ.

సర్‌పిట్‌కు బంధువులతో ఆస్తి సమ స్యలు తలెత్తాయి. అవి చర్చించటానికి ఇంటికి వచ్చాడు రాడన్. అతణ్ణి చూడ గానే ఇష్టపడింది బెకీ. మనిషి మంచి విలాస పురుషుడు. ఇలాంటి వాణ్ణి వెంట తిప్పుకోవటంలో ఒక ఆనందముంది అ నుకుని అతడి మీద తన ఆయుధాలన్నీ ప్రయోగించింది.

సర్‌పిట్‌కు చెల్లెలు వరుసవుతుంది మిస్ క్రాలీ. బాగా సంపన్నురాలు. బెకీనిచూసిన క్షణం నుండి ఆమె మీద మమకారం పెంచుకున్నది. ముఖ్యంగా బెకీ పద్ధతులు మర్యాద బాగా నచ్చాయి.

అక్కడ జార్జినే తన జీవిత భాగస్వా మిగా వూహించుకుంది అమేలియా. కాని అతని తండ్రికి సెడ్లీల వంశమంటేనే కోపం. ఈ ప్రేమ వ్యవహారం ముదురుతు న్నదని తెలిసి కొడుకును తిరిగిర మ్మని అదేశిం చాడు.




మిస్ క్రాలీకి ఆరోగ్యం పా డైంది. బెకీని సపర్యలు చె య్యటానికి పిలి పించుకున్నది. రాడన్ కూడా ఏదో మిషతో వచ్చి బెకీని పల కరించాడు. ఒంటరితనాన్ని భరించలేని సర్‌పిట్ ఎలాగైనా తిరిగి రమ్మని బెకీను ప్రాధేయపడ్డాడు. పెళ్లి చేసుకుంటే తన ఆస్తికి వారసురాలు కావ చ్చునన్నాడు. ఈ అనూహ్య ప్రతిపాదనకు

# విలియం మేక్ పీస్ థాకెరే
## (1811-1863)

కలకత్తాలో ఆంగ్లో ఇండియన్ సంతతి తల్లిదండ్రులకు ఆగస్టు 11న జన్మించాడు థాకెరే. తండ్రి బెంగాల్‌లో కలెక్టర్‌గా కూడా కొంతకాలం పనిచేశాడు. 1815లో అతడి మరణంతో తన చిన్ననాటి ప్రేమికుణ్ణి పెళ్లి చేసుకుంది తల్లి. ఐదేళ్ల థాకెరే చదువుకోసం ఇంగ్లండు ప్రయాణమయ్యాడు.

ఆ రోజుల్లో ఇంగ్లండులోని పబ్లిక్ స్కూళ్లంటే పిల్లలపాలిటి నరకకూపాలే (డికెన్స్ తన "నికోలస్ నికల్బీ"లో ఈ జీవితాన్ని కళ్ల కట్టినట్టు చూపిస్తాడు). ఏ కుర్రవాడూ బెత్తం దెబ్బలు తినని రోజుండేది కాదట ("రౌండ్ ఎబౌట్ పేపర్స్"లో ఈ అనుభవాల్ని గుర్తు చేసుకున్నాడు థాకెరే). పైగా థాకెరేకు చదువు మీద శ్రద్ధ లేదు. వాల్టర్ స్కాట్, పైర్స్ ఎగాన్‌ల నవలలు చదువుతూ కాలక్షేపం చేశాడు. మరి కొన్నాళ్లకు కేంబ్రిడ్జిలోని ట్రినిటీ కాలేజిలో చేరాడు గాని, అక్కడ మద్యం, జూదం యితర వ్యసనాలు అతణ్ణెక్కువ ఆకర్షించాయి (ఈ అనుభవం సారమంతా 'పెండెన్నిస్'లో కథగా మనకు కనిపిస్తుంది). ఇంగ్లీషు వాళ్లకు యూరోపు మీద మోజెక్కువ. జర్మనీ పర్యటనలో గోథే(జర్మన్ మహాకవి. 'ఫాస్ట్' రచయిత) దర్శనం చేసుకున్నాడు థాకెరే. 'వానిటీ ఫెయిర్' రాయాలనే ఊహ కూడా అప్పుడే తట్టిందట.

యువకుడు డబ్బులక్కొదవలేదు. ఇతర వ్యసనాలకు లాలసత తోడైంది. ఏదో జబ్బు కూడా వచ్చింది. ఆ బాధల్లో వున్నప్పుడు వ్యాపారం చెయ్యాలనిపించింది. 'బిల్ డిస్కౌంటింగ్'లో నష్టపోయాడు. 'ది నేషనల్ స్టాండర్డ్' అనే వారపత్రికలో పెట్టుబడి పెట్టి దాని సంపాదక బాధ్యతల్ని కూడా నెత్తినేసుకున్నాడు. పత్రిక త్వరలో మూతబడింది. తండ్రినించి సంక్రమించిన 17,000 పౌండ్ల ఆస్తి హరించుకుపోయాక జ్ఞానోదయమైంది. ఉదర పోషణార్థం అనేక పత్రికలకు, ముఖ్యంగా 'పంచ్'కు జర్నలిస్టుగా మారాడు. అప్పుడే, 1836లో వివాహం చేసుకున్నాడు. వివిధ కలం పేర్లతో చేసిన రచనల్ని (వ్యాసాలు, నవలలు వగైరా) ది ఎల్లో పేపర్స్ (1837-38), కేథరైన్ (1839-40), ఎషాబీ

---

నివ్వెరపోయిన బెకీ తను వివాహితనంటూ అబద్ధమాడింది ఆ తర్వాత కొద్ది రోజులకే రాడన్‌ను రహస్యంగా వివాహం చేసుకుంది.

యూరోపు మీద యుద్ధమేఘాలు కమ్ముకున్నాయి. ఆర్థిక పరిస్థితి దిగజారింది. వ్యాపారంలో సెడ్లీలు బాగా నష్టపోయారు. అప్పులు తీర్చటానికి ఇల్లుకూడా వేలం వేయకతప్పలేదు. బెకీ రాడన్‌ల సమక్షంలోనే అమేలియా ప్రాణప్రదంగా చూసుకున్న పియానోను కెప్టెన్ రాబిన్ మరో చిన్న ఇంట్లో వుంటున్న అమేలియాకు పంపించాడు. కాని ఆమెకు ఆనందాన్నివ్వలేదవి. జార్జి యిప్పుడామెను మరచిపోయాడు. ప్రియుడితో పెళ్లి ఇక కల్ల. ఈ విషయం తెలిసిన డాబిన్, అమేలియా

జెంటిల్ స్టోరీ (1840), బారీ లిండన్ (1844), బుక్ ఆఫ్ స్నాబ్స్ (1847-48), ది పారిస్ స్కెచ్‌బుక్‌గా ప్రచురించాడు. చివరికి 1847-48లో ప్రచురితమైన 'వానిటీ ఫెయిర్'తో డికెన్స్‌తో పోల్చదగిన మహారచయితగా పరిణతి చెందాడు. తరువాత నవలలు 'హిస్టరీ ఆఫ్ హెన్రీ ఎస్మండ్' (1852), అమెరికా పర్యటన ఫలితంగా రాసిన ది వర్జినియన్స్ (1857-58), చివరి నవల అడ్వెంచర్స్ ఆఫ్ ఫిలిప్ (1861-62) కూడా థాకెరే ఖ్యాతిని యినుమడింపచేశాయి.

కొందరు తుంటరుల దుష్ప్రచారం వల్ల, యితనికీ, డికెన్స్‌కూ మధ్య మాటల యుద్ధం కొనసాగింది. పందొమ్మిదవ శతాబ్ది ఇంగ్లీషు సాహిత్య చరిత్రలో వీరి వైరం ప్రసిద్ధం.

మొత్తంమీద, చిన్నతనంలో చెడు తిరుగుళ్లు తిరిగి పోగొట్టుకున్న తండ్రి ఆస్తిని రచనలతో తిరిగి సంపాదించగలిగినందుకు గర్వంగా వుందని చెప్పుకున్నాడు థాకెరే.

'డెనిస్ దువాల్' అనే నవల రాస్తూ 1863లో డిసెంబర్ 24న రక్తనాళం పగిలి హఠాత్తుగా మరణించాడీ మహారచయిత.

---

లాంటి సుగుణాలరాశి ప్రేమను పొందటం గొప్ప అదృష్టమని జార్జికి నచ్చచెబుతాడు. తండ్రికి తెలియకుండా అతడామెను పెళ్లిచేసుకుంటాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే పరిస్థితులు అనూహ్యమైన మలుపులు తిరుగుతాయి. యూరోపును ఆక్రమించుకుంటున్న నెపోలియన్ బోనాపార్టీతో తలపడటానికి సైన్యం బెల్జియం వెళ్లాలని ఆదేశాలు జారిచేస్తుంది ప్రభుత్వం. తన కిష్టంలేని పెళ్లి చేసుకున్నందుకు జార్జికి యింట్లో స్థానం లేదంటాడు అతడి తండ్రి. జార్జి, రాడన్‌లు భార్యలతో బ్రిసెల్స్(బెల్జియం రాజధాని)కి పయనమవుతారు. జోసెఫ్ కూడా వాళ్లను వెంబడిస్తాడు.

నెపోలియన్ ఓడిపోవటం తథ్యమని అందరికీ తెలుసు. బ్రిసెల్స్‌లో పండగ వాతావరణం ఉంది. జూన్ 15నాడు డచెస్ ఆఫ్ రిచ్‌మండ్ ఒక గ్రాండ్ బాక్ (విలాసవంతుల నాట్యోత్సవం) ఏర్పాటు చేస్తుంది. అక్కడ దంపతులు కలిసి నాట్యం చేయాలి. కాని, అమేలియాను ఒంటరిగా వదిలి జార్జి, బెకీతో కలిసి తిరగటానికి యిష్టపడతాడు. ఆరోజు ఆమె సౌందర్యం పలువురు యువకులనాకర్షించింది. అవమాన భారంతో కుంగిపోయిన అమేలియా, డాబిన్‌తో కలిసి యింటికి చేరుకుంటుంది. జార్జికి తప్పు తెలిసివస్తుంది. కాని తక్షణమే యుద్ధరంగానికి రమ్మని కబురొస్తుంది. 'వాటర్‌లూ' యుద్ధం చరిత్ర ప్రసిద్ధం. నెపోలియన్ ఓడిపోతాడు. ప్రాణనష్టం బాగా జరుగుతుంది. అలా వీరమరణం పొందిన వారిలో జార్జి ఒకడు.

అమేలియా గర్భవతి. డాబిన్ ఆమెకు అండగా నిలుస్తాడు. అమేలియాకు జీవితం మీద విరక్తి కలుగుతుంది. కాని కొడుకు కోసమైనా బ్రతక్క తప్పదు.

పారిస్‌లో, బెకీకి కూడా కొడుకు పుట్టాడు. రాడన్ సంపన్నుడేమీ కాదు. ఐనా అప్పులు చేసి విలాసంగా గడిపాడు. రాడన్‌కు జూదం ఒక వ్యసనంగా మారింది. డబ్బు సంపాదించటానికి అదో మార్గమనుకున్నాడతడు.

ఇంగ్లండులో మిస్‌క్రాలీ మరణంతో ఆస్తంతా సర్‌పిట్‌కు దక్కింది. నిరాశచెం



దిన రాడన్ వ్యసనాలకు మరింత బానిసై లార్డ్ స్టీన్ అనబడే సంపన్నుడితో పరిచయం పెంచుకున్నాడు. కాని అప్పులు పెరిగిపోతాయి. ఒకనాడు బెయిలిఫ్‌లు (కోర్టు జవాన్లు) అతణ్ణి అరెస్టు చేస్తారు. గత్యంతరం లేక రక్షించమని భార్యకుత్తరం రాస్తాడు. బెకీ దగ్గర నగలున్నాయి. వాటి నమ్మి ఆమె తనకు విడుదల ప్రసాదించవచ్చు అనుకున్నాడు. 'జ్వరంగా వుంది రాలేను కొన్ని నగలమ్మటానికి ప్రయత్నిస్తాను' అంటూ బెకీ నుండి జవాబు వచ్చింది. తనింత ఆపదలో వున్నా ఆమెకు చూసే ఓపిక లేదన్న మాట. మొత్తం మీద సాయంత్రానికి చెరనుండి విడుదలై యింటికి నడుస్తాడు రాడన్. లైట్లు వెలుగుతున్నాయి కాని యింట్లో అలికిడి లేదు. తలుపుతీస్తే-

ఒకనాడు రాడన్‌ను అరెస్టు చేస్తారు. రక్షించమని భార్యకుత్తరం రాస్తాడు. బెకీ దగ్గర నగలున్నాయి. వాటినమ్మి ఆమె తనకు విడుదల ప్రసాదించవచ్చు అనుకున్నాడు. 'జ్వరంగా వుంది రాలేను కొన్ని నగలమ్మటానికి ప్రయత్నిస్తాను' అంటూ బెకీ నుండి జవాబు వచ్చింది.

ఎదురుగా సోఫా మీద బెకీ. ఒంటినిండా వజ్రాల హారాలతో మెరిసి పోతున్నది. ఇన్ని నగలెక్కడివి? ఎవరు కొనిచ్చారు? ఆమె మీదికి వంగి చేయి ముద్దాడుతున్న లార్డ్ స్టీన్, రాడన్‌ను చూసి వులిక్కి పడ్డా అది కేవలం అమాయక స్నేహమేనన్నట్టుగా సర్దుకున్నాడు. అంతలోనే అనాలోచిత చర్యకు పశ్చాత్తాప పడుతున్నట్టుగా బెకీ భర్త కాళ్లమీద పడబోయింది. 'ఇద్దరూ కలిసి ఆడుతున్న నాటకమిది' అని నమ్మకం కుదిరింది లార్డ్‌స్టీన్‌కు. బెకీ వైపు అసహ్యంగా చూస్తూ 'నేనిచ్చిన నగలూ, డబ్బూ తీసుకుని నన్నే మోసం చేస్తావా?' అంటూ గుమ్మం వైపు కదిలాడు. కాని అసూయతో రగిలిపోతున్న రాడన్ అతణ్ణి మొహం మీద గట్టిగా కొట్టాడు. ఎన్నాళ్లగా సాగుతున్నదీ వ్యవహారం? బలవంతంగా ఆమె సీక్రెట్ లాకర్ తెరచి చూశాడు నిజమే నోట్ల కట్టలు మరిన్ని నగలున్నాయక్కడ. జరిగిన దానికి విచారించి లాభమేమిటి? ఈ డబ్బుతో కనీసం కొన్ని అప్పులైనా తీరతాయి. కొన్నాళ్ళ క్రితం బెకీ తన భర్త కోసం ఏదైనా ఉద్యోగం చూడమని లార్డ్‌స్టీన్‌ను అర్థించింది. ఇప్పుడు వచ్చిందా ఉద్యోగం. అలా రాడన్ దూర దేశాలకు ప్రయాణించి ఎక్కడో మరణిస్తాడు. అమేలియాకూ ఆమె కొడుక్కూ డాబిన్ రహస్యంగా సహాయం చేస్తూనే ఉన్నాడు. ఉద్యోగ విరమణచేసి యింటికి వచ్చిన జోసెఫ్ తన కుటుంబాన్ని అన్ని విధాలా ఆదుకుంటాడు. ఇప్పుడు ఆర్థిక సమస్యలు లేవు. జోసెఫ్ అమేలియా డాబిన్ కలిసి యూరోప్‌లో పర్యటిస్తారు. అక్కడ బాడెన్ బాడెన్ (ఒక నగరం)లోని ఒక కాసినోలో బెకీ కనిపిస్తుంది. యవ్వనం దాటినా అందం చెరగలేదు. తెలిసిన వాళ్లందరూ ఆమె గురించి ఏవేవో కథలు చెప్పారు. అన్నీ స్కాండల్సే. ఇటువంటి స్త్రీతో పరిచయం అమేలియాకు అభిలషణీయం కాదు. కాని, బెకీ చివరిసారి తన బాల్య స్నేహితురాల్ని కలిసి జార్జి ప్రవర్తనలో మార్పు రావడానికి తనే కారణమని అంగీకరిస్తుంది. కొంతకాలం జోసెఫ్‌తో ప్రేమాయణం కొనసాగిస్తుంది. అతని హఠాన్మరణంతో కొంత ఆస్తికూడా కలిసి వస్తుంది. చివరికి మిస్ క్రాలీ ఆస్తికి వారసుడవుతాడు బెకీ కొడుకు. తన విశృంఖలతకు పశ్చాత్తాపం చెందిన బెకీ శేషజీవితాన్ని ధర్మకార్యాలు చేస్తూ గడుపుతుంది.

– ఎం.వసంత

# నన్ను ప్రేమించు లేదా చావు







**కా**లిఫోర్నియాలోని వాల్ నట్ అనే ఊరికి చెందిన మైక్ మేక్కెన్నాన్ (38)కి, మిస్ రేబిన్ డెవెయ్యాక్స్ (39) అనే ఆమె అతని సోదరుడి ఇంట్లో పరిచయం అయింది. అప్పటికే వివాహమైన మైక్ ఆమెమీద పెద్దగా ఆసక్తి చూపించలేదు. అదీకాక ఆమె బాగా లావు. కానీ మిస్ రోబిన్ అతనికి చాలాసార్లు ఫోన్‌చేసి విసిగించింది. చివరికి అతను విసిగిపోయి ముఖాముఖిగా కలిసి, ఆమె మీద తనకి ఎలాంటి ఆసక్తి లేదని చెప్పాడు.

కానీ రేబిన్ అందుకు తను సిద్ధంగా లేనని, తనని ప్రేమించమని, కనీసం కామించమని కోరింది. మైక్ ఆమెని తిరస్కరించాడు. అప్పటినించి మొదలయ్యాయి అతని కష్టాలు. అతని కారుని అయిదారుసార్లు పాడు చేసింది. వాటి అద్దాలు పగలకొట్టింది. కత్తిలాంటి పదునైన పరికరంతో కారుమీద చుట్టూ గీసింది. దాంతో రంగు పోవడంతో తిరిగి దాన్ని ఖర్చు చేసి పెయింట్ చేయించుకోవాల్సి వచ్చింది.

అతని తండ్రికి, సోదరులకి విడాకులు తీసుకున్న అతని భార్యకి, ఇరుగు పొరుగుకి ఫోన్ చేసి అతను తనని మోసం చేశాడని ఆరోపించింది.

దాదాపు వెయ్యిసార్లు అతనికి ఫోన్‌చేసి అనేక హెచ్చరికలు చేసింది. తన దగ్గరకి రాకపోతే అతని ఇటింకి నిప్పు పెడతానని, అతని పదేళ్ల కొడుకుని ఎత్తుకుపోతానని హెచ్చరికలు చేసింది. అతని చంపుతానని కూడా చెప్పింది.

ఆమెతో విసిగిపోయిన మైక్ కోర్టునించి, ఆమె తనని కాంటాక్ట్ చేయకూడదన్న 'రెస్ట్రైనింగ్ ఆర్డర్'ని తీసుకున్నాడు. అయితే ఆమె అతన్ని ఫోన్ ద్వారా కాంటాక్ట్ చేయడం ఆపలేదు. కోర్ట్ ఆర్డర్ తర్వాత కూడా ఆమె అతన్ని ఇబ్బంది పెట్టినందుకు ఆమెకి మొత్తం 15 సంవత్సరాల జైలు శిక్ష పడచ్చు. అయినా ఆమె వల్ల విసిగిపోయిన మైక్ ఆ కేసుని పట్టించుకోకుండా ఇంకేదో రాష్ట్రానికి మాయం అయ్యాడు. ఆమె ఓ సైకిక్ అని, ఏదో ఓ రోజు ఆమె నోటితో చేసిన హెచ్చరికలని ఆచరించవచ్చన్న భయం అతనికి కలిగింది.

సరిగ్గా ఇలాంటి కథే 'ఫాటల్ అట్రాక్షన్' అనే పేర మైఖేల్ డగ్లస్ హీరోగా సినిమాగా వచ్చింది. బహుశా ఆ కథకి ఈ ఉదంతం ప్రేరణ అయిఉండచ్చు.

వ్యంగ్య శీర్షిక

-వారణాసి రామకృష్ణ

# బాటిల్ డాట్ కామ్

పట్టపగలు మా కాలనీ రమ్మురాజు(ఈయన అసలు పేరు రామరాజు లెండి!) బాటిల్ పట్టుకుని పోలీసుతో గొడవ పడుతున్నాడు. పోలీసేమో తాగి వాహనం నడిపావని గద్దిస్తూంటే తాగినడపలేదు నడపటమయ్యాకే తాగుతున్నానని రమ్మురాజు అరుస్తున్నాడు. డ్రైవింగ్‌లో లేవుగానీ బండి ఆపి తాగటమూ నేరమేనని పోలీసు నిలదీస్తే 'నేరమా నేతిబీరుకాయా? సెంటర్ బ్రాందీ షాపులో బాటిల్ కొన్నా అక్కడే తాక్కుండా ఇంటి గుమ్మం గేటు దాకా వచ్చి తాగితే తప్పా' నని రెచ్చిపోయాడు. దాంతో పోలీసు ఉలిక్కిపడి ఇంటి గేటా ఎక్కడంటే రమ్మురాజు పక్కనే ఉన్న మా ఇంటిగేటు చూపాడు. పోలీసు నెత్తిమీద టోపి తీసి బుర్రగోక్కుని 'నీసిగదరగా! కొంచెం ఓపిక పట్టి ఇంట్లో కెళ్ళాక తాగొచ్చుగదరా!' నంటే రమ్మురాజు బావురుమని ఏడ్చి, 'ఏం చెప్పమంటారు సార్ మా తాగుబోతుల బాధలు? పొద్దున్నే బార్లు బార్లా తెరవరు! షాపు దగ్గర చుక్కేసి రోడ్డెక్కితే మీరు వలేసి బ్రీత్ అనలైజరు టెస్టింగని తెగ స్టంట్లు చేస్తారు. పోనీ ఇంట్లో స్టాక్ పెట్టుకుని నింపాదిగా తాగుదామంటే, హుహుహుఅని ఏడ్చి బాటిల్ ఎత్తి గటగటమని గుటకేసి-' ఏం చెప్పను! ఎలా చెప్పను? ఇంట్లో అంతా శీతలపానీయం తాగినట్టు తాగేసి నాకొక్క చుక్కకూడా మిగల్చట్లేదు సార్!' అని వాపోయాడు. పోలీసు ఖంగుతిని 'ఇంట్లో అందరు తాగేస్తున్నారా? వోరినాయనోయ్-' అని అనగానే రమ్మురాజు ఏడుపువాల్యూం పెంచి 'తాగటమే కాద్సార్! ఆ మత్తులో నన్ను పట్టుకుని అంతా మూకుమ్మడిగా దంచుడే దంచుడు సార్!' చెప్పగానే పోలీసు భయంతో తుర్రుమన్నాడు. మేమంతా బిగుసుకుపోయి చూస్తూంటే రమ్మురాజు తాగుడులోంచి వాగుడులోకి దిగేడిలా.

"పచ్చితాగుబోతు పచ్చి నిజాలే మాట్లాడుతాడు. మేము ఆస్తికులం కాము పరమ నాస్తికులం అంతకన్నా కాదు. మా దేవుడు పేరు కబీరు! ఎందుకంటే పేరులోనే బీరు పోకుండా బీరుంది కాబట్టి! మేము రాయికి మొక్కం... సారాయికి దండం పెడతాం!



ప్రతి మతం వారికీ పవిత్ర స్థలం ఒకటున్నట్లు మందుబాబుల పవిత్ర స్థలం బీదర్! పేరులో అటు ఇటు బీర్ ఉందని కాదు! మద్యనిషేదం అమలులో ఉన్నప్పుడు ఎందరెందరో తాగుబోతుల్ని ఆదుకున్న మహత్తర స్థలం- బీదర్! చుక్క మందు పుట్టని చిక్కురోజుల్లో కొరత లేకుండా దాహం తీర్చిన పరమ పవిత్ర పుణ్యస్థలి- బీదర్! మా పూజలు భలే కిక్కిస్తాయి. పొద్దున్నే మీరంతా గుడికెళ్ళి తీర్థం తీసుకుంటే, చీకటి పడగానే మేమంతా బారుకెళ్ళి 'తీర్థం' పుచ్చుకుంటాం! గుళ్ళో మీరు భజన చేస్తే బార్లో మేము గానాభజానా చేస్తాం! అతి త్వరలో మేమంతా బీదర్‌లో సమావేశమయి 'మందునాడు' జరుపుకుంటున్నాం!




అక్కడ బ్రాందీ బాటిల్ ఆకారంలో నూరడుగుల బాటిల్‌తో ఓ స్మారక చిహ్నాన్ని నిర్మిస్తాం! నిత్యం బీరుపోకుండా బీరు చుక్కలు నిరంతరం బాటిల్ మూతపై పడేలా డిజైన్ చేస్తున్నాం! అక్కడ ఐమాక్స్ థియేటర్ నిర్మించి రోజూ దేవదాసు సిన్మా నాలుగాటలు ప్రదర్శిస్తాం! దానిలో హీరో అక్కినేనా షారూకా అన్న పట్టింపు లేదు. ఏ భాషలో తీసిన దేవదాసు ఐనా రిలీజయితే చాలు తాగకుండా వెళ్ళిడెఫినిట్‌గా చూస్తాం! చూశాక కంపల్సరీగా తాగేస్తాం! ప్రభుత్వం బడా బాబులకి స్థలాలు పందేరం చేస్తున్నట్టు బుడ్డిబాబులకే తకరా లేకుండా ఎకరాలివ్వాలని కోరుతాం! అసలు మేము వేలవేలకోట్లు ఎక్సయిజు కట్టడం వల్లే ఏ ఆర్థిక ఎక్సర్‌సైజు చెయ్యకుండానే గవిర్మెంట్లు బతికి బట్టకడుతున్నాయి. అధికార్లు, మంత్రులు అనుభవించే అష్టఐశ్వర్యాలు మా సొమ్మే! హాలికులతో సమానంగా ఆల్కహాలికుల్ని ఆదుకోవాలని డిమాండ్ చేస్తున్నాం! మాకు చట్ట సభల్లో సరైన ప్రాతినిధ్యం కావాలి. పది నియోజకవర్గాలకొక్కటైనా మందు బాబులకు రిజర్వు చెయ్యాలి! ఆ కోటాలో మాకోటా వాళ్ళకి తప్ప మరొకళ్ళకి వాటా ఇస్తే టాటాచెప్తాం! అసెంబ్లీ ఎదురుగా లోటాలతో ప్రదర్శనలు జరిపి గాంధీ విగ్రహం ముందే తాగి నిరసన వ్యక్తం చేస్తాం! ఏ రాజకీయ పార్టీ అయితే ముందుగా మా డిమాండ్లు ఒప్పుకొని బేషరతుగా మద్దతుగా ప్రకటిస్తుందో ఆ పార్టీకి వచ్చే ఎన్నికల్లో మందు బాబులంతా ఓట్లు వేసేలా మందునాడులో ఒక తీర్మానాన్ని ప్రవేశపెడతాం! ఇక ఒళ్ళు ఇల్లు గుల్ల చేస్కుంటూ నిత్యం తాగి సమాజానికి 'పరోక్షసేవ' చేస్తున్న మహామందుబాబులకి సారాశ్రీ, రమ్ము్మరత్న, బ్రాందీభూషణ్ లాంటి బిరుదులిచ్చి సత్కరించాల్సిందిగా విజ్ఞప్తి చేస్తాం! ప్రపంచ మందు బాబులారా..... ఏకంకండి! అనే నినాదం చేపడతాం! డిసెంబరు 31 తేదీని 'మందు డే'గా ప్రకటించాలని డిమాండ్ చేస్తున్నాం! అంతే గాక గాంధీ జయంతి, స్వాతంత్రదినం ఎన్నికల రోజులు- ఇట్లా ఇష్టం వచ్చినట్టు షాపులు బార్లు ఆయారోజుల్లో మూసేసి నిరంతర మద్యసేవనానికి ఆటంకం కలిగిస్తున్నారు. భవిష్యత్తులో ఇలాంటి బాధలేకుండా ఇంటింటికి పైపులైన్ల ద్వారా ప్రతిరోజు 'బీరు' సరఫరా చెయ్యాలి! ఇదే గాక బాటిల్ డాట్‌కామ్ అనే పోర్టల్ ప్రారంభించి సభ్యులైన వారికి ఐడినెంబరు పాస్

# రెండు సీట్లు



**మ**హామహుడు, విఖ్యాత శాస్త్రజ్ఞుడు ఐన్‌స్టీన్ ఒక రోజు తన మిత్రుడో లియోఫోల్డ్ ఇన్‌ఫెల్డ్‌తో కలిసి 'ఎమిలీ జోలా' సినిమా చూడ్డానికి వెళ్లారు. లియోఫోల్డ్ టిక్కెట్లు తీసుకున్న తర్వాత వారు వెయిటింగ్ రూమ్ వద్దకు వెళ్లారు. అక్కడ జనంతో కోలాహలంగా ఉంది. అప్పటికి ఆట ప్రారంభం కావడానికి అర గంట వ్యవధి ఉండడం వల్ల, కాలం గడపడం కోసం కొంత దూరం నడిచి వద్దామని మిత్రుడితో ఐన్‌స్టీన్ చెప్పారు. ఇన్‌ఫెల్డ్ బయటకు బయలుదేరుతూ, ఫస్ట్‌క్లాస్ ముందు నిలబడి వున్న క్లార్క్‌తో అన్నాడు- " మేము కొద్ది సేపట్లో తిరిగి వస్తాము. దయచేసి మాకు రెండు సీట్లు ఉంచు."




వెంటనే ఐన్‌స్టీన్ ఎంతో అమాయకత్వంతో, "మేము తిరిగి వచ్చాక మమ్మల్ని గుర్తుపట్టగలవా? మేము ముందే టిక్కెట్లు కొన్నాం సుమా!" అన్నారు.

వెంటనే క్లార్క్ నవ్వుతూ అన్నాడు, "అలాగే ప్రొఫెసర్ ఐన్‌స్టీన్‌గారూ! మిమ్మల్ని నేను గుర్తు పట్టగలను. మీకోసం రెండు సీట్లు తప్పక ఉంచుతాను!"

దారిలో నడుస్తూ ఐన్‌స్టీన్ తో ఇన్‌ఫెల్డ్ అన్నాడు, "ఐన్‌స్టీన్ గారూ! మీరెంత గొప్పవారు..! సినిమాహాల్లో టిక్కెట్లు తీసుకునే వ్యక్తికి కూడా మీరు తెలుసు."

వర్డ్ ఇచ్చే ఏర్పాట్లు చేస్తున్నాం! విదేశీ స్వదేశీ మద్యాల్ని కంప్యూటర్ తెరమీద రంగుల్లో వివరంగా చూపి ఎప్పుడు కావాలంటే అప్పుడు, ఎక్కడికి కావాలంటే అక్కడికి ఏ బ్రాండునయినా ఉచితంగా డోర్ డెలివరీ చేస్తాం!"

- రమ్మీరాజు తొణక్కుండా గడగడా చెప్పి బాటిల్ పైకి లేపి గటగటా మొత్తం తాగేసి ఖాళీ బాటిల్ విసిరేస్తే - అది సరిగ్గా సెంటర్లో గాంధీ గారి విగ్రహం క్రిందపడి దొర్లసాగింది. ప్రపంచ దేశాలన్నీ గాంధీ సిద్ధాంతాల గొప్పదనాన్ని గుర్తించి అక్టోబరు రెండోతేదీని అంతర్జాతీయ అహింస దినంగా జరుపుకుందామని ఈ ఏడాదే నిర్ణయించాయి. విదేశీయులు ఇప్పుడిప్పుడు గాంధీ మార్గంలో 'దశా దిశ' గుర్తిస్తూంటే మనం మాత్రం బ్రాందీ మార్గంలో 'హుషనిషా' చవిచూస్తున్నాం!

రమ్మీరాజు కుటుంబం మొత్తం తాగుబోతులేనని గుంపులో ఎవరో అరిస్తే రమ్మీరాజు భార్య దూసుకొచ్చి 'ఇంట్లో స్టాక్ తెచ్చి పెడుతున్న మందంతా పారబోసి బాటిల్స్‌ని కూల్‌డ్రింకుల్లో నింపి మేమంతా తాగినట్టు యాక్షన్ చేస్తున్నాం! మత్తులో చిత్తవుతున్న ఇంటి యజమానికి బుద్ధొచ్చేలా చితక్కొడుతున్నాం! అయినా మార్పులేదు'- అంటూ నిస్పృహగా చెప్పి క్రిందపడి రోడ్డుమీద అర్ధనగ్నంగా మత్తులో దొర్లుతున్న మొగుడ్ని దంచుతూ లాక్కెళ్ళింది! నిజమే జనంలో నిస్పృహ ఉంది గానీ స్పృహలేదు. ఆ చైతన్యమే వస్తే మద్యనిషేధం మళ్ళీ వచ్చెయ్యదూ? ఇంతలో మైక్‌లోంచి చెవులు దిబ్బిళ్లేసేంత పెద్ద సౌండుతో పాట "బాపూ! నీకమ్మని కలలే మాకివ్వు! నీతిని నిలిపే బలమివ్వు! గాంధీ పుట్టినదేశం... రఘురాముడు ఏలిన రాజ్యం..." ఈ నెలలో మొక్కుబడిగా విన్పించేపాట! హేరామ్!! ©

# తెరతీయగరాదా



అప్టన్ సింక్లెయిర్

# అమెరికాలో అరుణతేజం

అర్ధరాత్రి దాటింది. ఊరు నిద్రపోయింది. తల్లి ఏడుస్తూ కూర్చుంది. రోజూ ఇంతే. కుర్రాడు దిగులుగా చూశాడు. తండ్రి ఎక్కడికెడతాడు? అమ్మనెందుకిలా బాధపెడతాడు?

"నేను నాన్నను తీసుకొస్తానమ్మా"

"ఎక్కడని వెదుకుతావురా నాయనా. ఏ సారాకొట్టు దగ్గర పడున్నాడో!" అంది తల్లి వెక్కిళ్ల మధ్య.

తండ్రిని వెదకటానికి బయల్దేరాడు అప్టన్ సింక్లెయిర్ (1878-1968).

మనిషిని నాశనం చేసేది దారిద్ర్యం కాదు. దుర్వ్యసనాలు. మద్యనిషేధాన్ని ప్రచారం చేశాడు అప్టన్ సింక్లెయిర్. సిగరెట్లు, టీ, కాఫీలు కూడా అతడికి నిషిద్ధమే. తను అభిమానించిన, ఆరాధించిన జీనియస్సులు, గురుతుల్యులు జాక్ లండన్, యూజీన్ వి. డెబ్స్ లాంటి వాళ్లు ఆల్కహాలిక్స్‌గా జీవితాల్ని ముగించటం అతణ్ణెంతగానో బాధించింది.

పదేళ్లదాకా స్కూలు మొహం చూడని సింక్లెయిర్ అప్పటికే డికెన్స్, థాకెరే వంటి ప్రముఖుల సమగ్ర రచనల్ని అపోసనపట్టాడు. తిండికిలేని రోజుల్లో పత్రికలకు జోకులమ్ముకుని సంసారాన్ని పోషించాడు. పెట్టుబడిదారీ విష సంస్కృతికి బలయ్యేది పేదలే. ఈ ధనస్వామ్య వ్యవస్థమీద తిరుగుబాటు చెయ్యటమే తన జీవితలక్ష్యంగా పెట్టుకున్నాడు.

1906లో వెలువడిన 'జంగిల్' అమెరికన్ సాహిత్యంలోనే కాదు, సమాజంలోనే ఒక సమూలమైన మార్పుకు కారణమయ్యింది. మీట్ (మాంసం) పాకేజింగ్ ఇండస్ట్రీలోని అనాగరిక, అనారోగ్య పరిస్థితుల్ని పరిశోధించి, డాక్యుమెంట్ చేసిన ఆ నవల పరిశ్రమలో సంస్కరణలను తీసుకొచ్చింది. ప్రెజిడెంట్ రూజ్‌వెల్ట్, సింక్లెయి

ఒక్క ఇండియానా యూనివర్సిటీలోని లిలీ లైబ్రరీలోనే సింక్లెయిర్‌కు సంబంధించి తొమ్మిది టన్నుల సమాచారం వుంది. ఆయన రాసిన వేలాది వ్యాసాలు, పుస్తక సమీక్షలు, సంపాదక లేఖలు కాక, కృప్స్కయా (లెనిన్ భార్య), కెన్నెడీ, మెంకెన్, థామస్‌మాన్, మాక్సింగోర్కీ, గాంధీ, ట్రాట్స్కీ బెర్నార్డ్ షా, ఇద్దరు రూజ్‌వెల్టులు (ఫ్రాంక్లిన్, థియొడర్) మొదలైన వార్లతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల సంఖ్య 2,50,000 రోజుకు ఎనిమిది గంటలు చదివినా, కేవలం ఈ ఉత్తరాలకే అయిదు వందల రోజులు పడుతుంది.

– లియోన్ హారిసన్

ర్‌ను 'మక్‌రేకర్' అన్నాడు. అంటే బురద చల్లేవాడని అర్థం.

అమెరికా భూతల స్వర్గం కాదు. కార్మికుల, మధ్య తరగతి ప్రజల జీవితాలక్కడ భద్రతలేదు. అప్టన్ సింక్లెయిర్ రచనలు అక్కడి సమాజాన్ని ప్రభావితం చెయ్యటానికున్న పరిస్థితుల్ని ఈనాడు వూహించుకోవటం కష్టమే. ఉదాహరణకు.. కనీస వేతనచట్టం, నిర్ణీత పని గంటలు, పరిశ్రమల్లో ప్రమాదవశాత్తూ మరణించిన కార్మికులకిచ్చే ఎక్స్‌గ్రేషియా, ఆహారపదార్థాల నాణ్యతను నిర్ధారించే విధివిధానాలు, కార్మికుల ఐక్యకార్యాచరణ, యూనియన్లూ, స్త్రీల హక్కులూ, గుత్తాధిపత్యంతో ధరలు ఏకపక్షంగా నిర్ణయించటానికి వ్యతిరేకంగా చట్టాలూ, ఆరోగ్య బీమా, నిరుద్యోగ భృతి, బ్యాంకుల, స్టాక్ ఎక్స్‌చేంజిల నియంత్రణకు శాసనాలు ఈనాడున్నాయంటే ఇదంతా అప్టన్ సింక్లెయిర్ కృషి ఫలితమని చాలామందికి తెలియకపోవచ్చు

అమెరికన్ సమాజంలోని వ్యవస్థీకృతమైన దోపిడిని, అన్యాయాలను, అమానుషత్వాన్ని ఎండగట్టిన తొలితరం సామాజిక ఉద్యమ రచయిత సింక్లెయిర్. "బిచ్‌గాడెస్ ఆఫ్ సక్సెస్"ను ఆరాధించే అమెరికన్ జీవన సరళి మారాలని అతని ఆకాంక్ష. సోషలిస్టుభావాలు అతని ఉద్యమానికి స్ఫూర్తి.

తొంభైఏళ్లు బతికిన మహనీయుడు తొంభైకి పైగా పుస్తకాలు రాశాడు. ఇతడి జీవితాన్ని గ్రంథస్థం చెయ్యాలనుకున్న లియోన్ హారిస్ తన గురుతరమైన బాధ్యతను ఇలా వివరించాడు.

"ఒక్క ఇండియానా యూనివర్సిటీలోని లిలీ లైబ్రరీలోనే సింక్లెయిర్‌కు సంబంధించి తొమ్మిది టన్నుల సమాచారం



ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్‌తో సింక్లెయిర్

వుంది. ఆయన రాసిన వేలాది వ్యాసాలు, పుస్తక సమీక్షలు, సంపాదక లేఖలు కాక, కృష్కయా (లెనిన్ భార్య), కెన్నెడీ, మెంకెన్, థామస్‌మాన్, మాక్సింగోర్కీ, గాంధీ, ట్రాట్‌స్కీ, బెర్నార్డ్ షా, ఇద్దరు రూజ్‌వెల్టులు (ఫ్రాంక్లిన్, థియోడర్) మొదలైన వార్లతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల సంఖ్య 2,50,000 రోజుకు ఎనిమిది గంటలు చదివినా, కేవలం ఈ ఉత్తరాలకే అయిదు వందల రోజులు పడుతుంది."

సింక్లెయిర్ ఉద్యమం రచనలకే పరిమితం కాలేదు. రాజకీయ వేదికలను కూడా వాడుకుని బడా పెట్టుబడిదార్లనూ, ప్రెజిడెంట్లనూ సవాల్ చేశాడు. ఈయన రచనలు ప్రపంచవ్యాప్తంగా, ముఖ్యంగా సోవియట్ రష్యాలో విస్తృతంగా ప్రచురితమయ్యాయి. జర్మన్ నాటక రచయిత బెర్టోల్ట్ బ్రెహ్ట్, రష్యన్ సినిమా జీనియస్ సెర్గీ ఐసెన్‌స్టీన్, హెర్బర్ట్ మార్క్యూస్ మొదలైన వాళ్ల మీద సింక్లెయిర్ ప్రభావం వుంది. ముఖ్యంగా చార్లీచాప్లిన్ సోషలిస్ట్ కావటానికి కారణం సింక్లెయిర్. అమ్ముడు పోయిన రచయితల, కళాకారుల గురించి ఇతడు రాసిన "మమ్మొనార్ట్" (1925), నిబద్ధత గురించి మాట్లాడే మేధావులందరూ చదవాల్సిన పుస్తకం. రావిశాస్త్రిగారు దీన్ని చదవమని చాలామందికి సిఫార్సు చేయడం మిత్రులందరికీ తెలుసు.

–స్వప్న

# దేవుడిచ్చిన బిడ్డ






**46** ఏళ్ల మోకాస్టో, 42 ఏళ్ల ఫ్రాన్ కాస్టోలు 'మీరు త్వరలో తండ్రి కాబోతున్నారు' అన్న డాక్టర్ మాట లకి తుళ్లిపడ్డాడు. ఎందుకంటే మోకి వేసక్టమీ ఆపరేషన్ అయింది. అంతే కాదు ఫ్రాన్‌కి కూడా ట్యూబెక్టమీ ఆప రేషన్ జరిగింది.

ట్యూబెక్టమీ ఆపరేషన్ ఫెయిల వడం ప్రతీ వెయ్యిమంది మహిళల్లో సగటున ఇద్దరికే జరుగుతుంది. అలాగే వేసక్టమీ ఆపరేషన్ ఫెయి ల్యూర్ అంతకన్నా తక్కువసార్లు జరుగుతుంటుంది. ఈ రెండూ ఓ జంటలో ఫెయిల్ అయ్యే అవకాశాలు ఇంకా ఇంకా తక్కువ.

నార్త్ కరోలినాలోని టెక్స్ విల్లేకి చెందిన ఈ జంటకి ముగ్గురు పిల్లలు. మూడోపిల్ల క్రిస్టీ గర్భంలో వుండగా వేసక్టమీ చేయించుకు న్నాడు. డెలివరీ సమయంలో ఆమెకి ట్యూబెక్టమీ ఆపరేషన్ జరిగింది.

నాలుగేళ్ళ తర్వాత ఆమెకి పీరి యడ్స్ ఆగిపోయి, వేవిళ్ళు మొదలవడంతో నివ్వెరపోయింది. ప్రెగ్నెన్సీ కిట్‌ని తెచ్చుకుని పరీక్షించుకుంటే ఆమె గర్భవతి అని తేలింది. అయినా నమ్మలేక తన గైనకాలజిస్ట్ డాక్టర్ జేమ్స్ గుడ్‌విన్ దగ్గరకి వెళ్ళింది. ఆయన స్కానింగ్ చేయించి దాన్ని కన్‌ఫర్మ్ చేశాడు.

తమకి నాలుగో సంతానం కలగబోతోందని తెలిసిన, అప్పటికే అమ్మమ్మ, తాతయ్యలైన ఈ జంట బాధపడలేదు. థ్రిల్ ఫీలయ్యారు. అది 'దేవుడిచ్చిన బిడ్డ'గా అంతా భావించారు. వాళ్లకి ఓ కొడుకు పుట్టాడు. అతనికి డెస్టిన్ అని పేరు పెట్టారు. డెస్టినీకి షార్ట్‌ఫాం డెస్టిన్.

డెస్టిన్ పుట్టినరోజే, వారి పెద్దకూతురు జెస్సి కాకి క్రిస్టియన్ అనే కొడుకు పుట్టాడు.

గ్రాహంగ్రీన్‌తో
ఆర్.కె.నారాయణ్

## భారతీయ ఆత్మకు అక్షరం తొడిగిన

# ఆర్.కె.నారాయణ్



దాదాపు రెండు శతాబ్దాల ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో కన్నా ఇప్పుడు మనదేశంలో ఆంగ్ల భాషావ్యాప్తి ఎక్కువైంది. ఇందుకు ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలు ఎన్ని వున్నా, అన్నింటి కన్నా ఎక్కువైంది ఇండో-ఇంగ్లీష్ రచయితల రచనల ప్రాభవ ప్రాబల్యాలే! ఇండో-ఇంగ్లీష్ రచయితలంటే ఇండియాలో పుట్టి ఇంగ్లీషులో రచనలు చేసేవారు! రచనలకు సంబంధించిన అన్ని అంశాల్లోనూ వారెంతో రాణించారు. మనదేశంలో ఇంగ్లీషును ఒక ప్రధాన భాషగా తీర్చిదిద్దారు. వారిలో ఆర్.కె.నారాయణ్ ప్రాతః స్మరణీయుడు! అక్టోబర్ 10 నారాయణ్ జయంతి సందర్భంగా ఆ అక్షరవాచస్పతికి 'చతుర' నివాళి ఇది..

ఆర్కే నారాయణ్ పూర్తి పేరు రాశీపురం కృష్ణ స్వామయ్యర్ నారాయణ స్వామయ్యర్. తమిళుడు.. బ్రాహ్మణుల్లో అయ్యర్ శాఖీయుడు. తమిళుల్లో అసలు పేరుకు ముందు తండ్రిపేరు కూడా వుండడం ఒక సంప్రదాయం. రాశీపురం వాళ్ల పూర్వీకుల స్వగ్రామం. మంచి నేతికి పెట్టింది పేరు. నారాయణ్ రచనలు కూడా అట్లాగే, మంచి నెయ్యిలాగానే మానవత్వంతో ఘుమ ఘుమ లాడుతుంటాయి. ఆ కుంటుబానికి సంప్రదాయం అంటే ఎంతో పట్టుదల. క్రమేపీ వాళ్ళు కూడా సంప్రదాయానికి దూరమై. ఆంగ్ల సంస్కృతికి దగ్గర య్యారు. ఆర్. కె. నారాయణ్ తండ్రి కృష్ణ స్వామయ్యర్ పందొమ్మిదవ శతాబ్దం చివరికల్లా ఆంగ్లభాష నేర్చుకున్న మధ్య తరగతిలో చేరిపోయాడు. పెళ్ళి చేసుకున్న తర్వాత సంప్రదాయాన్ని, తల్లిదండ్రుల్ని కాదని పూర్తిగా ఇంగ్లీషువాడిగా తయారయ్యాడు.



ఇహ మాతామహుల విషయానికి వస్తే- వాళ్లు మరీమరీ ఆంగ్ల సంస్కారానికి, ఆచార్య వ్యవహారాలకూ దగ్గరైన వారు. తల్లి వేపు నారాయణ్ తాతగారు ఆంగ్లపాలనలో ఓ మధ్యతరగతి రెవెన్యూ అధికారి. ఆయనకు జిన్ అంటే మహా ఇష్టం. మాంసాహారం అంటే ప్రాణమే! ఆయనను అందరూ 'కుత్తుపట్టా' అని పిల్చేవాళ్లు. అంటే- వెన్నుపోటుకు గురైన వాడు అని అర్థం. నారాయణ్ అమ్మమ్మ మరో విచిత్ర వ్యక్తి. నారాయణ్ మీదా ఆవిడ ప్రభావం ఎంతో ఉందని చెప్ప వచ్చు. ఆవిడ పేరు పార్వతి. అయితే చెన్నైలో అందరూ ఆమెను 'అమ్మణ్ణి' అని ఆప్యాయంగా పిల్చేవారు.

సరిగ్గా నూటొక్కేళ్ల క్రితం- 1906లో అక్టోబరు 10న నారాయణ్ జన్మించారు. ఇంకా నెలలు పూర్తిగా నిండకుండానే పుట్టడం, అతని తల్లికి, పోయిన వాళ్లు పోగా, మిగిలిన ఎనిమిది మంది పిల్లల్లో మూడోవాడు కావడం, ఆమె ఎప్పుడూ ఇంటి పనుల్లో తీరిక లేకుండా శ్రమిస్తుండడంతో- నారాయణ్ తన చిన్నతనంలో మాతామహి దగ్గర, చెన్నైలో పెరిగాడు. అమ్మా, నాన్న మైసూరు సంస్థానంలో ఉండేవాళ్ళు. అందుచేత నారాయణ్ అతని శైశవంలో, తల్లి దగ్గర ఉండకుండా, అమ్మమ్మ వొడిలోనే పెరిగాడు. అమ్మణ్ణికి తోటపనంటే ఇష్టం. ఆ ఇష్టమే నారాయణ్‌కూ వచ్చింది. ఆమెకు సంస్కృతం బాగా వచ్చు. ఆంగ్లంతో కొంత పరిచయం వుంది. ఆ రెండూ దగ్గరుండి మనవడికి నేర్పించింది. అనాథ పిల్లల్ని ఆమె ఎంతగానో ఆదరించింది. ఆ కరుణా స్వభావమూ నారాయణ్‌కు అలవడింది.

ఆమె తన ముద్దుల మనవడికి స్వతంత్రంగా ఆలోచించడమూ, స్వతంత్రంగా నడవడం కూడా నేర్పింది. ఆమె ఇంటికి ఎందరెందరో వచ్చేవాళ్ళు. స్వేచ్ఛగా అక్కడే భుజించేవాళ్ళు. అక్కడే పడుకునే వాళ్ళు కూడా! వాళ్ళందర్నీ ఈ పసివాడు ప్రత్యక్షంగా చూశాడు. అరమరికలు

లేకుండా బతకాలన్నది అర్థం చేసుకున్నాడు. అరమరికల అడ్డుగోడలల్లేని మాధుర్య జీవనమే ఆనంద సంధాయకం కదా!

అమ్మణ్ణికి నారాయణ్ 'కుంజప్ప'- అంటే 'చంటివాడు' అని అర్థం. ఆమె అతనికి సంగీత జ్ఞానాన్ని కూడా అందించింది. ఆమె చక్కగా పాడేది. రాగ జ్ఞానాన్ని బోధించేది. కడగంటా నారాయణ్ తన సంగీత ప్రియత్వాన్నీ, జ్ఞానాన్నీ, సాధననూ వదులుకోలేదు. వీణావాదనంలో నాద బ్రహ్మ దర్శనం లభించింది అతనికి. ఆ నాదబ్రహ్మను అక్షరబ్రహ్మగా తీర్చిదిద్దుకున్నాడు.



యువకుడిగా ఆర్కే

నారాయణ్‌వి పెద్దపెద్ద కళ్లు. నుదుటి మీదకు పడే నొక్కుల జుట్టు. అందమైనవాడు. కాని చదువులో అంత చురుగ్గా ఉండేవాడు కాదు. విషాదాన్ని హాస్యంతో మేళనంచేసి మాట్లాడేవాడు. జీవత చరమాంకంలో గొంతులో కేన్సర్ వచ్చింది. అయినా తనేమీ బాధానల జ్వాలా వలయితుడుగా కనిపించలేదు. హాస్యంగా హాసంతో, 'ఇప్పుడు మీరు నాకు తేనె ఇచ్చినా ఆముదం ఇచ్చినా, ఒకటేగా!' అన్నాడు.

ఆ పరిహాసమే అతనికి రచనల్లో హాస్యం నిండుగా ఉండేట్లుగా చేసింది. నవ్వు కోవడం అతని సహజ లక్షణం. జీవితాన్నీ, జీవనాన్నీ జడప్రాయంగా కాకుండా హాస్యభరితం చేసుకోవడం అతని ఆత్మస్వభావం.. అందుకనే అతనో మహావేదాంతిగా, తాత్వికుడిగా కనిపిస్తున్నాడు!

ఆ తాత్విక చింతనతోనే అతనికి రచయిత కావాలనిపించింది. ఇంట్లోవాళ్ళు ఎవరూ ప్రోత్సహించలేదు. అయినా అతను తానో అక్షర శ్రామికుణ్నే అనుకున్నాడు.

ఒకరోజున, యౌవన ప్రథమార్థంలో, నీళ్ళ పంపు దగ్గర ఓ అమ్మాయిని చూశాడు. మనసు పడ్డాడు. పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. వద్దని అయినవాళ్లందరూ వారించారు. జ్యోతిష్యులు, ఆమె జాతకం మంచిది కాదని జోస్యం చెప్పారు. అయినా నారాయణ్ తన పట్టు వీడ లేదు. 1934లో ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. అయ్యర్ కుటుంబాల్లో, ఆ రోజుల్లో అదో విప్లవాత్మక సంఘటనే! అన్ని విధాలా అది ప్రేమ వివాహమే!

గ్రాహం గ్రీన్ అనే తన ఆంగ్ల స్నేహితుడికి ఓ ఉత్తరం రాస్తూ నారాయణ్ అంటాడు. "మూడు సంవత్సరాల క్రితం, స్వర్గఖండం నుండి దిగివచ్చిన ఓ దేవకాంతను నేను పెళ్ళి చేసుకున్నాను' ' అట్లా ఆమె జీవితాంతం నారాయణ్ ఆమెను ఓ దేవకాంతగానే చూసుకున్నాడు. అతని ప్రేమ అమలినమైనది. అగాధమైనది. సాటిలేనిది. ఆమె పేరు రాజం. పెళ్లినాటికి ఆమెకు పట్టుమని పదిహేడేళ్లు కూడా లేవు. నారాయణ్‌కు ఇరవై ఎనిమిదేళ్లు. 1939లో ఆమె కన్ను మూసింది. ఆమె శాశ్వతంగా అతనికి దూరమైంతర్వాత అతను విధుర జీవనక్లేశాన్ని అనుభవించాడే తప్ప, మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. ఆత్మ చింతనలో, జీవన వేదనలో జగద్రహస్య సిద్ధాంతావలోకనంతో, పరిణత రచయితగా మార్పుచెందాడు.

తన కూతురు హేమలోనే భార్య జ్ఞాపకాన్ని పదిలపర్చుకున్నాడు. 1939 నుండి 1945 వరకూ ఒక విచిత్ర సందిగ్ధావస్థలో గడిపాడు. ఆ వంటరి దుఃఖానుభావమే అతనికి గురువైంది. ఆనాటి ఆ ఆలోచనలే అతని భవిష్యత్ రచనా జీవితానికి మార్గదర్శకాలయ్యాయి.

వీరితో పాటుగా 'కుంజప్ప'మీద అతని మాతృశ్రీ జ్ఞానాంబాళ్ ప్రభావం కూడా ఎక్కుగా ఉండేదనే చెప్పాలి. ఆమె పిల్లల కోడే అయినా ఆధునిక హిందూ మహిళా



పఠనం ప్రాణం

లక్షణాలకు ఆమె నిలువెత్తు ప్రతిబింబం. తొమ్మిది గజాల చీరకట్టులో, ఇంతింత కర్ణాభరణాలతో వజ్రపు ముక్కుపుడకతో సాయంవేళల లేడీస్ క్లబ్బులో టెన్నిస్ ఆడేది. చదరంగంలో, పేకాటలో ఆమె నిష్ణాత్రి. కథనవైచిత్రి ఆమె స్వంతం. అలా నారాయణ్‌లో ప్రాచ్యపాశ్చాత్య జీవన సమ్మేళనా సంరంభం ప్రస్ఫుటమైంది.

ఈ రకమైన ప్రభావాలలో పెరిగి రచనా రంగంలోకి అడుగుపెట్టాడు నారాయణ్. అతని తండ్రి దగ్గర ఓ పెద్ద వ్యక్తిగత గ్రంథాలయం ఉండేది. కార్లైల్, రస్కిన్, వాల్టర్ పేటర్ వంటి మహా రచయితల గ్రంథాలందులో ఉన్నా, అవేవీ అతనికి రుచించలేదు. క్లాసికల్ రైటర్స్ ఎవరూ అతన్ని ఆకర్షించలేదు. రొమాంటిక్ కవుల్ని ఔపోశన పట్టాడు. మేరీ కొరైల్లీ వంటి కౌటుంబిక రచయిత్రుల్ని ఇష్టంగా చదివాడు. వర్డ్స్‌వర్త్, బైరన్, బ్రౌనింగ్, షేక్స్‌పియర్ వంటి వారి భావస్రవంతిలో మునకలు వేశాడు. ఆ దశలోనే భార్య మరణించింతర్వాత, ఆత్మరూపంలో ఆమెను చూడాలని తాంత్రిక విద్యల్ని ఆశ్రయించాడు. ఆ ప్రయత్నంలో తాను సఫలీకృతుడయ్యాననే ఆయన నమ్మాడు. ఆమె దృశ్యాదృశ్యంగా కనిపించింతర్వాత, పరలోకంలో ప్రశాంతంగా ఉన్నదని గ్రహించింతర్వాత, తాను స్థిరచిత్తుడయ్యాడు. అతని జీవితంలో అది ఒక విచిత్ర వేదనాభరిత, ఉద్విగ్న అధ్యాయం. ఇదంతా "ది ఇంగ్లీష్ టీచర్" అన్న నవలలో చిత్రితమైంది. అన్వేషణను ముగించుకుని, ప్రశాంతతను సాధించుకుని, లోచూపులో ఇక రచనకు పూనుకున్నాడు. మొదట్లో ఆ రచనల్ని పాశ్చాత్య ప్రచురణ కర్తలు అంగీకరించలేదు. ప్రచురణకై పంపించిన రచనలు పంపించినట్లే తిరిగివచ్చేవి. పోస్టేజీనే భరించలేని ఆ రోజుల్లో, వాటికోసం ఎంతటి దుర్భర, ఆర్థిక ఇబ్బందుల్ని అనుభవించాడో ఊహించుకోవలసిందే! క్రమేపీ అరవయ్యో దశకం వచ్చే సరికల్లా పరిస్థితిలో ఎంతో మార్పు వచ్చింది. గ్రీన్ వంటి వారి సహకారం వలన అతని నవలలు, పశ్చిమ





దేశాల్లో ప్రచురింపబడి, ప్రాచుర్యంలోకి వచ్చాయి. మైసూరులో స్థిరపడి ఇల్లు కట్టు కున్నాడు. వృద్ధాప్యంలో మళ్లీ చెన్నైకి తిరిగి వచ్చి 2001లో మే నెల 14వ తారీ కున మరణించాడు.

అతని జీవితంలో ఆ విధంగా చెన్నై, మైసూరు నగరాలు ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. అతని సాహిత్యంలో కూడా ఆ ప్రాముఖ్యత ప్రతిఫలిస్తుంది.

మాల్గుడి అని వో ప్రాంతాన్ని తన నవ లల్లో సృష్టించాడు. అది ఎక్కడిదో కాదు. 'నా రోజులు' అని తన జ్ఞాపకాల్ని ప్రచు రించాడు. ఆ జ్ఞాపకాన్ని తలపోస్తూ వ్రాస్తాడు. "మాల్గుడి చెన్నైలో ఒక ప్రాంతమే! చిన్నతనంలో నేను ఎక్కడ పెరిగానో, తిరిగానో, వాటి నన్నింటినీ మాల్గుడిలో వర్ణించాను" ఆ రకమైన చిత్రణం, వర్ణనం గ్రీన్‌కు బాగానచ్చాయి. నారాయణ్ మొదటి మూడు నవలలూ వెలుగులోకి రావడానికి అతనే ప్రధాన కారకుడు 'స్వామి, అతని స్నేహితులు', 'ది బ్యాచిలర్ ఆఫ్ ఆర్ట్స్', 'ది డార్క్ రూమ్' ఇంగ్లాండులో ప్రచురితమైనప్పుడు, పాఠ కుల ప్రశంసల్ని పెద్దగా అందుకోలేదు. ప్రచురణ కర్తలు సంతోషించలేదు. అయినా గ్రీన్‌కు నారాయణ్ మీద శ్రద్ధ తగ్గలేదు. నారాయణ్ నిరాశకు లోను కాలేదు. విమర్శలకు తలవంచలేదు. రచనను ఆపలేదు. "ఇండియన్ ఇంగ్లీష్"- అంటే తమదైన శైలిలో భారతీయులు ఆంగ్లభాషలో వ్రాసే పద్ధతి- అనే నూతన రచనా విధానానికి వరవడి దిద్దాడు. ఈ శైలిలో వర్ణనలు, మాటలు, వాక్య సరళి, పాత్రలు అన్నీ మనకు పరిచితమైన పద్ధతి లోనే ఉంటాయి. అవి పాశ్చాత్య పాఠకు లకు ఒక కొత్తలోకాన్ని ఆవిష్కరించాయి. యుద్ధకాలంలో అతనో పత్రికను కూడా నడిపాడు. ఆ పత్రికపేరు 'ఇండియన్ ఇంగ్లీష్.'

పత్రిక పెట్టడానికి ముందూ, తర్వాత కూడా నారాయణ్ తన నవలా రచనను నిరాఘాటంగా కొనసాగిస్తూనే వచ్చాడు. ఆయా నవలల్లో కథావస్తువు కాల్పనికమై నదే. కాలాతీతమైనది మాత్రంకాదు. ఆ పాత్రలన్నీ మనకు రక్తమాంసాలతో ఎక్కడో అక్కడ కనిపిస్తూనే ఉంటాయి. ఎక్కడ చూశామా అని విభ్రాంతికి గురవు తుంటాం. దానినే మనం కాల్పనిక సహ జత్వం (ఫిక్షన్ రియలిజమ్) అని పిల వచ్చు. ఇది నారాయణ్ ప్రత్యేకతల్లో ఒకటి!

ఈ సందర్భంగానే ఆయన నవలల్లో కొన్నింటి గురించి చెప్పుకోవడం అవసరం. మొట్టమొదటి నవల ఓ పదేళ్ళ విద్యార్థి గురించి. నాలుగడుగుల ఎత్తు కూడా ఉండడు. అన్ని వయసులవారూ ఆ పసి వాడి పైడి ఊహల్ని మెచ్చుకుంటారు. ఇది టీవీ సీరియల్‌గా తీశారు. విజయవంత మైంది. దీంతో మరో నాలుగు నవలలు కూడా వెలుగు చూశాయి. 1935లో స్వామి అతని స్నేహితులు, 1937లో బ్యాచిలర్ ఆఫ్ ఆర్ట్స్, 1938లో చీకటిగది, 1945లో ఇంగ్లీష్ టీచర్, 1949లో మిష్టర్ సంపత్ మొదలైనవన్నీ మొదట్లో వచ్చిన రచనలు. ఇవి కుటుంబ సంబంధాన్ని, స్వీయ జీవి తానుభవాల్ని వివరిస్తాయి. ఇవి అను భూతి ప్రధానాలు. ఒక నవల్లో అయితే సత్వ, రజస్, తమోగుణాల్ని పాత్రలుగా మలచి చిత్రించడం జరిగింది. పత్రిక పెట్టిన తర్వాత వచ్చిన నవలల్లో అయితే భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించు కున్న తర్వాత ఉన్న స్థితిగతులు, భారతీ యుని వ్యక్తిత్వంలో కలిగిన 'క్రైసిస్' భావ గర్భితంగా చిత్రితమైనాయి. 'స్వామి - అతని స్నేహితులు'లో సాంఘిక వైకల్యం ప్రధానం. ముసలావిడ పాత్రలో నారాయ



# సగం తెలిసిన ఆఫ్రికా...




**ప్ర**ఖ్యాత రచయిత బెర్నార్డ్ షాను ఒక యువకుడు అడిగాడు- షాగారూ! స్త్రీల గురించి మీ అభిప్రాయం ఏమిటి? ”

“ఇరవై సంవత్సరాల వయస్సులో ఆమె సగం వరకే తెలిసిన ఆఫ్రికావలే ఉంటుంది. ముప్పై ఏళ్లప్పుడు భారతదేశంలా అందంగా కనిపిస్తుంది- అర్థంకానట్టు వైభవోపేతంగా. నలభై ఏళ్లకు అమెరికా వలే ఉంటుంది- అన్నీ సమకూరినట్లు. యాభై ఏళ్ల వచ్చేసరికి ఐరోపా వలే ఉంటుంది- శిథిలం అయినట్లు. అరవయ్యో ఏట మహిళ సైబీరియాలా కనిపిస్తుంది- ఆదేశం ఎక్కడ ఉందో అందరికీ తెలిసినా ఎవ్వరూ అక్కడకు వెళ్లడానికి ఇష్టపడనట్లు.

ణ్‌ను పెంచిన అతని అమ్మమ్మ కనిపిస్తుంది. కొన్ని నవలల్లో స్వగతాలుగా పాత్రలు తమ మానసిక పరిస్థితిని తెలియపర్చడం ఓ క్రొత్త టెక్నిక్.

స్వాతంత్ర్యానంతరం వచ్చిన నారాయణ్ నవలల్లో ‘ది ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్’, ‘మహాత్మునికై నిరీక్షణ, ది గైడ్,’ ‘మాల్గుడి నరభక్షకి’, ‘ది వెండర్ ఆఫ్ స్వీట్స్’, ‘ది పెయింటర్ ఆఫ్ సైన్స్’ ఇలా ఎన్నింటినో ఉదహరించవచ్చు. వీటిల్లో దేనికదే ప్రత్యేకం. ఒక్కొక్క రచన గురించి ఒక మహాగ్రంథమే రాయవచ్చు. అలా రాసిన వారు కూడా చాలామందే ఉన్నారు.

నవలలు రాస్తూనే ఎన్నో చిన్న కథలు, వ్యాసాలూ రాశాడు ఆర్కే. ‘తండ్రిసాయం’ , ‘ఓ హీరో’ వంటివి అందులో చెప్పదగినది. ఆయన చిన్న కథల్లో, చిన్న పిల్లల మీద ఆయనకున్న ప్రేమ ప్రస్ఫుటం అవుతుంది. వ్యాసాలు వ్యంగ్య హాస్యానికి దర్పణాలు. మొత్తంమీద ఆయన జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని, రచనలను పరిశీలిస్తే సమకాలీన ఇండో-ఇంగ్లీష్ రచయితల్లో గణంలోనూ, గుణంలోనూ అటువంటివాడు మరొకరు లేరనిపిస్తుంది. మొదట్లో సంప్రదాయవాదిగా కనిపించినా, చిట్టచివరకు ఎంతో అభ్యుదయవాదిగా రూపాంతరం చెందాడు. వైఫల్యాల నుంచి విజయాలను అంది పుచ్చుకున్నాడు. మరణానికి చేరువైనా, మానసికంగా బెదిరిపోలేదు. అనుక్షణం అన్వేషిగా కనిపిస్తూనే, ఆత్మావలోకనాన్ని చేస్తూనే ఉన్నాడు. దక్షిణ భారతదేశం ఆంగ్లభాషకు అందించిన ఆణిముత్యం ఆర్. కె. నారాయణ్. భారతదేశాన్ని విదేశీయులకు మృదుల హాస్య దర్పణంలో చూపించిన మహా భాష్యకారుడు, పరిణత ప్రజ్ఞాపారీణుడు ఆర్. కె. నారాయణ్.

– కొండముది శ్రీరామచంద్రమూర్తి

# ముగ్గురమ్మాయిల ముచ్చట

చతుర కతలు



ఇక రిటైర్ అయిపోతున్నాను, హాయిగా ఇంటి దగ్గరే కూర్చోవచ్చుననుకున్నాడు రామారావు. ఆ విషయమే ఇంకా అయిదేళ్లు సర్వీస్ వున్న భార్య రాజేశ్వరికి చెప్పాడు సంతోషంగా.

"హాయిగా మీరనుకున్నట్లే వుండండి. అయితే కుటుంబ ఆదాయం సగానికి సగం పడిపోతుంది కనుక మనం పొదుపు ఉద్యమం చేపడదాం" అంది రాజేశ్వరి. టిఫిన్ కట్ చేయమంటుందా, కాఫీ ఓన్లీ టూ టైమ్స్ అంటుందా అని రామారావుకి కొంత భయం పట్టుకుంది. అయినా పైకి అనలేదు.

"ఏమండీ.. మనం ఇద్దరమే ఉంటున్నాము. ఇదివరకులాగా ఇద్దరమూ ఇక మీదట ఆఫీసులకు వెళ్లం. ఇక నుంచీ నేను

ఒక్కర్తినే వెళ్లాలి" అంది రాజేశ్వరి.

రాజేశ్వరి చెప్పేది సింగిల్ ఎపిసోడ్ స్టోరీలాగా లేదు. ఇంకా కొన్ని ఎపిసోడ్‌లు లాగుతుందనుకున్నాడు రామారావు.

"చూడండి మీరు ఇంటి దగ్గరే ఖాళీగా కూర్చొంటే బద్ధకం, శరీరం రెండూ పెరుగుతాయి. ఆ తర్వాత డాక్టర్‌కి ఖర్చు పెట్టాలి. అంతేకాదు మన పని మనం చేసుకోవడంలో ఎంతో సుఖం వుంది" అంది రాజేశ్వరి.

రాజేశ్వరి ఏదో చెప్పబోతోందని రామారావుకి అర్థమయింది.

"...ఇకపై మీరు ఇదివరకటి కన్నా ముందుగా లేవాలి. మిల్క్‌బూత్‌కి వెళ్ళి పాల ప్యాకెట్‌లు మీరే తీసుకురావాలి. పాల మనిషిని మానిపించేద్దాం. నెలకి ముప్పయి రూపాయలు మిగులుతాయి. ఈ రోజున ముప్పయి రూపాయలంటే మాటలా" అంటూ కొద్దిసేపు ఆగింది రాజేశ్వరి. తర్వాత "ఫెస్టివల్ స్పెషల్ డిస్కౌంట్ సేల్ వేశారు. సెమీ ఆటోమేటిక్ వాషింగ్ మిషన్ మీద బాగా తగ్గిస్తున్నారు. ఒకటి కొందాం. సబ్బుపెట్టి, సర్ఫ్ నీళ్ళలో వేసి చేతులు పడిపోయేదాకా ఉతకక్కరలేదు, అన్ని పనులు మిషనే చేసుకుపోతుంది. బకెట్ ఎత్తి నీళ్ల పోయక్కరలేదు. కుళాయికి, మిషన్‌కి ట్యూబ్ కనెక్ట్ చేస్తే చాలు. అన్నట్లు మిషన్ ధర తగ్గించడమే కాదు, ఒకటి కొంటే ఒకటి ఫ్రీ స్కీమ్‌లో ఎలక్ట్రిక్ ఇస్త్రీ పెట్టె కూడా ఇస్తున్నారు" అంటూ ముగించింది రాజేశ్వరి.

అమ్మయ్య బతికాననుకున్నాడు రామారావు, నిమిషం తిరగకుండానే మళ్లీ ప్రారంభించిందామె.

"చూడండి మన ఫ్లాట్లలో ఇరవయి నాలుగు గంటలూ నీళ్లు వస్తాయి. కిచెన్



లోను పెద్ద సింక్ వుంది. అంట్లు తోమ డానికి నవతరం డిష్‌వాష్‌బార్లు వస్తు న్నాయి. చేతులు కందిపోకుండా, అలసిపో కుండా అంట్లు తోమవచ్చు" అని రాజేశ్వరి ఆగి, "అన్నట్లు ఈ నెలాఖరున గదా మీరు రిటైర్ అయ్యేది. ధోబీని, పనిమనిషిని ఒకటో తారీఖునుంచీ మానిపించేస్తాను. ఆ పనులు మీరు బాగా చేయగలరని నాకు నమ్మకం వుంది" అంది రాజేశ్వరి.

రామారావుకి మన పనులు మనం చేసు కోవడమే డిగ్నిటీ ఆఫ్ లేబర్ అని చిన్న ప్పుడు నేర్చుకుంది గుర్తుకు వచ్చింది.

ఒకటో తారీఖునుంచీ రామారావు కొత్త డ్యూటీలో ప్రవేశించాడు. వారం రోజుల లోనే తనకి కేటాయించిన రెండు పనుల లోను, నైపుణ్యం సంపాదించాడు. కునుకు తీయకుండా, కూనిరాగాలు తీస్తూ తన పనులు చకచక చేసుకుపోవడం ప్రారం భించాడు.

కంచాలు, గ్లాసులు, గరిటెలు, ప్రెషర్ కుక్కర్ ఏవీ సొట్టలు పడకుండా తళతళ మెరిసేటట్లు తోమి వేటి స్థానంలో వాటిని వుంచుతూ భార్యచేత భేష్ అనిపించుకు న్నాడు.

ఇక బట్టలు వాషింగ్‌మిషన్ కంపెనీ ఇచ్చిన సూచనల ప్రకారం ఉతుకుతూ, బాల్కనీలో మడతలు లేకుండా ఆరవేస్తూ, ఆరిన తర్వాత అవసరమైన వాటిని ఇస్త్రీ చేసి మడతలు పెట్టి, మిగిలిన వాటినీ మడిచి ఎక్కడ పెట్టవలసినవి అక్కడ పెడుతూ భార్యచేత సెబాష్ అనిపించుకు న్నాడు రామారావు.

కథ ఇంతటితో అయిపోలేదు. రామా రావు బాల్కనీలో బట్టలు ఆరవేయడం అవతలి ఫ్లాట్లలో ఒకదానిలో వుంటున్న అమ్మాయిలు తరచు చూస్తున్నారు. ఆ విషయం రామారావు కనిపెట్టాడు. ముచ్చ టగా ముగ్గురమ్మాయిలు, కాల్ సెంటర్లలో పనిచేస్తున్న కంప్యూటర్ అమ్మాయిలలాగా వున్నారని రామారావుకి అనిపించింది. ఆ పాతికేళ్ళ అమ్మాయిలు అరవయి ఏళ్లు వచ్చిన తనని చూస్తూవుంటే తనలో ఆ వయసులోనూ ఆకర్షణ తగ్గలేదని రామా రావు పొంగిపోయాడు.

ఒక అదివారం ఉదయం ప్రత్యేకంగా పెసరట్టు ఉప్మాలతో అల్లప్పచ్చడిచేసి ప్లేట్లలో స్పూన్‌వుంచి భర్తకి అందించింది రాజేశ్వరి. తనూ ఒక ప్లేట్‌లో తీసుకుని అక్కడే కూర్చుని కబుర్లు మొదలెట్టింది.

. అవతలి ఫ్లాట్‌లో అమ్మాయిలు ఎంత ముచ్చటగా వున్నారో చూడండి. వాళ్ళ సూక్ష్మబుద్ధిని నేను మెచ్చుకోలేకుండా వుండలేక పోతున్నాను" అంది ఉపోద్ఘా తంగా.

ఏమయింది ఆసక్తిగా అడిగాడు రామా రావు.

"నిన్న నేను బ్యూటీ పార్లర్‌కి వెళ్ళాను గదా. అక్కడ కనిపించారు ఈ ముగ్గుర మ్మాయిలు. నన్ను పలకరించి 'మీ ఫ్లాట్‌లో పనిచేస్తున్న అతను ఎంత కళా త్మకంగా అంట్లు తోముతున్నాడో మేము మా బాల్కనీలోంచి చూస్తున్నాము. అలాగే బట్టలు మిషన్‌లో ఉంచి బాల్క నీలో అందంగా ఆరవేయడమూ చూస్తున్నాం. ఎంత అదృష్టవంతులండి మీరు ఎంతిస్తున్నారతనికి' అన్నారు ఆ అమ్మాయిలు" అంది రాజేశ్వరి.

రామారావుకి పెసరట్టులోని ఉల్లిపాయ, ఉప్మాలోని పచ్చిమిరపకాయ ముక్క కలసి కట్టుగా నోటికి అడ్డం పడ్డాయి. గ్లాసుడు మంచి నీళ్ళు తాగాడు.

అతని ముఖం మాడిపోయింది.

అది చూసి ముప్పయిఏళ్లక్రితం పెళ్ల యిన కొత్తలో నవ్వినంత అందంగా నవ్వింది రాజేశ్వరి.

–తాజీప్రసాద్

చతుర కతలు

# స్వేచ్ఛ




'గుడ్ మార్నింగ్ డాక్టర్!'

'హలో, నువ్వటోయ్ విజయ్, రా! కూర్చో'

డాక్టర్‌కి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు విజయ్.

'ఏమిటి నీ కంప్లయంట్?' మెడకి వున్న స్టెతస్కోపును చెవుల్లో దూర్చుకుంటూ అడిగాడు డాక్టర్.

విజయ్ ఏమీ మాట్లాడలేదు. తలవంచు కుని కూర్చున్నాడు.



'ఇంట్లో అంతా బావున్నారా?' అనుమానంగా అడిగాడు డాక్టర్.

'అంతా కులాసాగానే ఉన్నారు డాక్టర్'

'మరేమిటోయ్ నీ కంప్లయంట్?'

'నేను...'

'వైఫ్ దగ్గిరా, డాక్టర్ దగ్గిరా సిగ్గు పనికి రాదోయ్. సిగ్గుపడితే అది తమకే నష్టం' అన్నాడు డాక్టర్.

'నేను కాలు జారాను డాక్టర్'

'అయ్యో, ఎక్కడ జారావేమిటి? ఏదీ చూడనీ నీ కాలు'

'ఎబ్బే, కాలు జారడమంటే... కాలు జారలేదండీ...'

'ఏమీటోయ్ నువ్వనేది? నాకేం అర్థం కావడం లేదు' కాస్త విసుగ్గా అన్నాడు డాక్టర్.

'లేదు డాక్టర్, నేను... నా గర్ల్‌ఫ్రెండ్‌తో....

డాక్టర్‌కి ఈసారి సంగతి అర్థమైంది. తేలిగ్గా నవ్వేస్తూ...

'ఓహ్, అదటోయ్ సంగతీ. దీనికే ఇంత హడలిపోవాలా? అది నీ తప్పుకాదు. నీ గాల్‌ఫ్రెండ్ తప్పు అంతకన్నా కాదు. మీ వయసుది! కాదంటావా? అయితే తప్పు ఇంతదాకా నిన్నొక ఇంటివాణ్ణి చేయని మీ నాన్నది. ఏమంటావ్?'

'అవున్సార్...'

'సరే, కిందటి ఏడాది నేను స్టేట్స్‌కి వెళ్ళొచ్చాను... తెల్సుగదా నీకు?'

'తెల్సండి'

'అయితే చెప్తాను విను. బుద్ధిగా కూర్చో.. జాగ్రత్తగా వినాలి... మనదేశంలో లైంగిక స్వేచ్ఛ లేదోయ్. కట్టుబాట్ల, సాంప్రదాయల బంగారు సంకెళ్ళతో ఆనాటికాలం నుంచి యువతరాన్ని బంధించివేస్తున్నారు. అదేమంటే, ఇదంతా మన సంస్కృతనో, నాగరికతనో చక్కటి పేర్లు పెడతారు. అదే స్టేట్స్‌లో అయితే ఇట్లాంటి నాన్సెన్స్ నిబంధనలు, కట్టుబాట్లనేవి మచ్చుకైనా కనబడవ్. లైంగిక స్వేచ్ఛ వుండబట్టే ఆ దేశమంత డెవలప్ అయింది. మరి మనదేశమో? ....'

'అవున్సార్'

'...ఇట్లాంటి కట్టుబాట్లకి నేను చాలా వ్యతిరేకినోయ్. మనకు స్వాతంత్ర్యం వచ్చిందని చంకలు కొట్టుకుంటున్నాం. అయితే లైంగిక స్వేచ్ఛ ఎక్కడుందోయ్? ఏమంటావ్?

కమ్ టు ద పాయింట్. ఇంతకూ ఇప్పుడా అమ్మాయికి అబార్షన్ చేయాలంటావ్'

'అవున్సార్. ఏదైనా మందులు రాసిస్తే...'

'ఎబ్బే, పేషెంట్‌ని టెస్టుచేయందే మందులు రాయడం కుదర్దోయ్'

'అది కాదండి. ఆడపిల్ల... మీ దగ్గిరికి ఎలా రాగలదండి...'

'నేనింతదాకా నెత్తినోరూ కొట్టుకొని నీకు చెప్పిందేమిటోయ్, సిగ్గుపడాల్సినంత నేరమేం చేయలేదోయ్ మీరు'

'అవుననుకోండి. కానీ...'

'ఆమాత్రం ఒప్పించలేవా ఆ అమ్మాయిని. ఇట్లాంటి కేసుల్లో తప్పనిసరిగా పరీక్ష జేసి తీరాలి'

'అయితే రేపు తీసుకొస్తాను సార్'

'బైదిబై, ఇంతకీ ఎవరన్నావ్ ఆ అమ్మాయ్?'

'నా క్లాస్‌మేట్ సార్! మిస్ లలిని... స్వయానా మీ...'

తర్వాత అతనేం చెప్పాడో డాక్టర్‌కి అర్థం కాలేదు. డాక్టర్ డాక్టర్.. అంటూ విజయ్ వేస్తున్న కేకలు అతనికి వినిపించడంలేదు కారణం అప్పటికే అతను మూర్ఛపోయాడు.

–బద్దిగం పాండురంగారెడ్డి

# దయతో నిండు నూరేళ్లు







ఎక్కువ కాలం జీవించాలనుకుంటున్నారా? అయితే దయగా ఉండండి. అమెరికాలోని ఆరిజోనా స్టేట్ యూనివర్శిటీకి చెందిన సైకాలజిస్ట్ హోవార్డ్ ఫ్రెడ్‌మేన్ ఈ సూత్రాన్ని ప్రతిపాదిస్తున్నాడు. 1500 మంది మనుషుల ఆరోగ్య రికార్డుల్ని తనిఖీ చేసి, వారిని ఇంటర్వ్యూ చేసి హోవార్డ్ ఈ నిర్ణయానికి వచ్చాడు.

దయనీయ స్థితిలో ఉన్న ఇతరులకి నిస్వార్థంగా సహాయం చేయడం వల్ల మానసిక ఒత్తిడి, ఫోబియాలు తొలగడం ద్వారా వాటి ప్రభావాలు శారీరక ఆరోగ్యం మీద పడకుండా నివారింప బడటం వల్ల ఇది సాధ్యం అని అతను చెబుతున్నాడు.

తమతో దయగా ఉండే వారితో ఎవరూ ఘర్షణని పెట్టుకోడానికి ముందుకు రారు కాబట్టి వారికి ఆ రకమైన సంఘర్షణ ఉండదుట. దయతో ఉండే స్వభావం గలవారు సాధారణంగా ఎంపిక చేయకుండా అందరితో దయగానే ఉంటారు కాబట్టి వాళ్ళకి శత్రువులు, హాని చేసేవారు కూడా అరుదుగా ఉంటారు. కాబట్టి వారి మానసిక ఆరోగ్యం, తద్వారా శారీరక ఆరోగ్యం చక్కగా ఉంటాయిట.

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఏజింగ్ అనే సంస్థ కోరిన మీదట హోవర్డ్ ఫ్రెడ్‌మేన్ కొందరు సైకాలజిస్ట్‌లతో కలిసి, ఆ పదిహేను వందల మంది వ్యక్తిత్వ లక్షణాలని నిశితంగా గమనించి పై అభిప్రాయానికి వచ్చాడు.

తక్కువ వయసులో మరణించిన వారి డెత్ సర్టిఫికెట్లలో 'హృద్రోగం' అనే కారణం అధికంగా పేర్కొనబడిందని కూడా వారు జరిపిన ఓ సర్వేలో తేలింది. అలాంటి వారి గురించి బంధుమిత్రులని ఇంటర్వ్యూ చేస్తే, వారు దయగా కాక, ఇతరులతో కరుకుగా ఉండేవారని తేలింది.

మనిషి స్వభావం, అతను అధిక కాలం బ్రతుకుతాడా లేడా అన్నది నిర్ణయిస్తుంది. దయా స్వభావం మనుషులని చంపే రోగాలని దగ్గరకి చేరనివ్వదు అని అనేక మంది ఆరోగ్య రికార్డులను బట్టి ఆయన నిర్ణయించారు.

'తమ మీద ఆధారపడ్డ వాళ్లని మోసం చేయకపోవడం, ఆపదలో ఉన్న బంధు మిత్రులకి సహాయం చేయడానికి ముందుకు రావడం, అపరిచయస్థులకి కూడా సహాయం చేయడాలని" వారు దయగా నిర్ణయించారు. అలా ఉండటం ద్వారా వారికి మానసికంగా ఆనందం కలిగి అందువల్ల ఒత్తిడి లెవెల్స్ తగ్గుతాయి.



# ప్రతిభకు బందీ!

అయన కళాప్రపూర్ణ..
పద్మభూషణ్..
తెలుగు సాహిత్యంలో తొలి
జ్ఞానపీఠ అవార్డు గ్రహీత..
అన్నిటికీ మించి ఏకైక
కవి సమ్రాట్!
ఇన్ని బిరుదులు వీరికి
ఎందుకొచ్చాయి?
విశ్వనాథవారి సంపూర్ణ సాహిత్య
నిధిలో ఎన్నోరచనలు వున్నాయి.
అయన చేపట్టని సాహిత్య
ప్రక్రియ లేదు.
ఏభైఏడు నవలలు, ఇరవై ఏడు
పద్యకావ్యాలు, పదహారు
నాటకాలు, పదకొండు విమర్శలు,
చిన్నకథలు- పాటలూ, శతకాలు,
గేయకావ్యాలు, 'వాటీజ్ రామా
యణ్ టు మి' లాంటి ఇతరాలు-
మొత్తం నూట ఇరవై ఒక్క పుస్త
కాలు విశ్వనాథ సాహిత్య నిధి!!

విశ్వనాథను దూరం నుంచి చూసిన వారికి, ఆయన వేషభాషలను చూసిన వారికి, తగుమాత్రంగా ఆయన గురించి విన్నవారికి, తన రచనలు కొన్నిమాత్రమే చదివిన వారికి ఆయనంటే ఉండే అభిప్రాయం ఒకటి. తనను దగ్గర నుంచి చూసిన వారికి, వ్యక్తిగా పరిచయంగల వారికి, వారి సాహిత్యాన్ని ఆసాంతం చదివిన వారికి ఆయనంటే కలిగే అభిప్రాయం వేరొకటి అనడంలో సందేహం లేదు. ఎవరేమన్నా విశ్వనాథ తెలుగువారి సొత్తు. తనకాలంలో ఎందరినో ప్రభావితం చేసిన ప్రతిభాశాలి. శ్రీశ్రీలాంటి వాళ్లు కూడా ఆయన ప్రభావం నుంచి బయటపడడానికి ఎంతో శ్రమించారనేది అందరికీ తెలిసిందే.

'వ్యాససూచి'లో నేలనూతల కృష్ణమూర్తి వ్యాసం అంటే విస్తరణ, విశదీకరణ అని వివరించారు. ఆ రకంగా ఇది వ్యాసం అనిపించుకోదు. అక్టోబరు 18న విశ్వనాథ వర్ధంతిని పురస్కరించుకుని తనకు సంబంధించి కొన్ని జ్ఞాపకాలు, సంఘటనలూ ముచ్చటించుకోవడమే ఈ కథనం లక్ష్యం. పైకెలా కన్పించినా హృదయప

రంగా ప్రతిభను నెత్తినపెట్టుకునే విశ్వనాథత్వానికి అక్షర రూపమివ్వడమే దీని ముఖ్యోద్దేశం. ఇందులోని కొన్ని సంఘటనలు సత్యనాయణగారి రెండో కొడుకు పావనిశాస్త్రి తన వ్యాసంలో చెప్పినవే.

విశ్వనాథ సత్యనారాయణగారికి యిద్దరు తమ్ముళ్లు, ముగ్గురు అక్కచెల్లెళ్లూను. పెద్దతమ్ముడి కొడుకు పేరు కృష్ణదేవరాయలు. కృష్ణదేవరాయలు, మహానటుడు ఎన్.టి.రామారావూ సహాధ్యాయులు. కాలేజీలో వీరిద్దరూ విశ్వనాథకు శిష్యులే. ఆ రోజుల్లో కాలేజీల్లో ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించేవారు. కాలేజీ నాటక పోటీలకోసమని విశ్వనాథ 'పల్నాటి యుద్ధం' అనే నాటకం విద్యార్థుల కోసం రాసి తనే దర్శకత్వం వహించారు. ఆ నాటకంలో నాగమ్మ పాత్రకు ఎన్టీఆర్‌ను ఎంపిక చేశారాయన. కాని కృష్ణదేవరాయలు తన తనకావేషం కావాలని పెద్దనాన్నవద్ద పట్టుపట్టాడు. అతని ఘోషంతా శ్రద్ధగా విన్నాక-

'ఆ వేషానికి ఎన్టీఆరే బాగుంటాడురా! ఎందుకంటే- వాడు అందగాడు. ఆడవేషం వేసే మగాడు అందంగా లేకపోతే వేషం రక్తి కట్టదు' అని కృష్ణదేవరాయల్ని సముదాయించి ఒప్పించారు విశ్వనాథ.

నిజానికి అప్పటికి ఎన్టీఆర్ సాధారణ వ్యక్తే. విశ్వనాథవారి ఎందరో శిష్యుల్లో తనొకరు. కానీ కృష్ణదేవరాయలో... సొంత తమ్ముని కొడుకు. అయినా ఎన్టీఆర్‌కే నాగమ్మవేషం యిచ్చారంటే ఆయన బంధుప్రీతికన్నా ప్రతిభకే పట్టంకట్టేవారని స్పష్టమవుతుంది.

విశ్వనాథ మనసెంత సున్నితమైందో తెలిపే మరో సంఘటన ఇది.

బీర్నీడు ప్రసన్న అనే కవి ఓరోజు కవిసమ్రాట్ ఇంటికి వచ్చారు. తాను పల్నాడులోని మోషేకవి కుమారుడినని పరిచయం చేసుకున్నారు. మోషేకవి విశ్వనాథకు బాగా తెలిసినవాడూ, సమకాలీనుడు. అందుకే ఆయన ప్రసన్నను ఆప్యాయంగా కూర్చోమని చెప్పి, ఏంపనిమీద వచ్చాడో కనుక్కున్నారు.

ప్రసన్న తానొక కావ్యం రాశానని, దానిని చదివి అభిప్రాయం చెప్పాలని కోరారు. తాను వినుకొండలో ఓరియంటల్ కళాశాలలో టీచరుగా పనిచేస్తున్నానని తనగురించి చెప్పుకున్నారు.

'సరే.. దాన్ని అక్కడ పెట్టి వెళ్ళు! పదిరోజులు పోయాక రా' అన్నారు విశ్వనాథ. చిత్తం అని ప్రసన్న తనచేతి సంచిలోంచి వ్రాతప్రతి తీసి ఆయన పాదాల దగ్గర పెట్టబోయారు.

'అయ్యో అక్కడ పెడతావేంటయ్యా? అలా బల్లమీదపెట్టు' అన్నారాయన నొచ్చుకుంటూ.

తర్వాత అతను కావ్యాన్ని బల్లమీద పెట్టి వెళ్లిపోయాడు. సరిగా పదిరోజులు గడవగానే ప్రసన్న విశ్వనాథ దర్శనానికి వచ్చారు.

మరో పదిరోజుల తర్వాత రమ్మని మళ్లీ వాయిదా వేశారు విశ్వనాథ. అలా నాలుగైదుసార్లు వాయిదాలు వెయ్యడం.. చెప్పిన రోజుకు ప్రసన్న ఠంచన్‌గా రావడం జరుగుతూనే ఉంది.

అలా ఒకరోజున విశ్వనాథ చెప్పిన



సమయానికి ప్రసన్న వచ్చారు. ఇంటి సమస్యల కారణంగా ఆ సమయంలో చిరాకుగా ఉన్న విశ్వనాథ అదంతా ప్రసన్న మీద చూపారు.

'ఏదో రాసి తెచ్చి నా మొఖాన పడెయ్యడం- చదివి అభిప్రాయాలు చెప్పమనడం. ప్రతివాడూ కవిత్వాలు రాసేవాడే.. ఏమయ్యా ప్రసన్నా రాసిందేదో రాశావు. దానికి మళ్లీ నా అభిప్రాయం దేనికి? రాసిందేదో అచ్చువేసుకోక?' అన్నారు చిరాగ్గా.

పాపం ప్రసన్న! ఏం మాట్లాడలేక మౌనంగా నిలబడిపోయాడు తలొంచుకుని.

'చదివేవాడు చదువుతాడు.. లేనివాడు లేదు. నీకావ్యంలో పసవుంటే దాచినా దాగదు. లేకపోతే ఎవరు ముందుమాట రాసినా రాణించదు. నీ కావ్యం చదవడం నావల్లకాదు. నా పనులతోనే నేను చస్తున్నాను దాన్ని పట్టుకుపో!' అన్నారు అదే ధోరణి కొనసాగిస్తూ ఆయన.

'సరే.. పుస్తకం యిప్పించండి' అన్నారు ప్రసన్న నీళ్లునిండిన కళ్ళతో.

లోపల బల్లమీదున్న పుస్తకంతెచ్చి ప్రసన్నకివ్వమని కుటుంబ సభ్యులను ఆదేశించారు విశ్వనాథ.

తర్వాత ప్రసన్న వంక చూస్తూ-

'యింతకీ దేని గురించి రాశావా కావ్యం?' అని అడిగారు కాస్తంత ప్రసన్నంగా.

'గ్రంథం పేరు పృథ్వీ భాగవతం. పృథ్వీ రాజు- రాణి సంయుక్తల వివాహం గురించి' అన్నారు ప్రసన్న నెమ్మదిగా.

'సరే ఇప్పుడీ పుస్తకం పట్టుకెళ్లి ఏం చేస్తావ్?' మళ్లీ అడిగారు విశ్వనాథ కుతూహలంగా.

'అగ్గిలో పారేస్తానండి' అన్నారు ప్రసన్న గాద్గదికంగా.

పొరబాటు విన్నానేమో అనుకొని మళ్ళీ అదే ప్రశ్న వేశారు విశ్వనాథ.

'మీరు పుస్తకం ఇవ్వగానే ఇక్కడే దానికి అగ్గిపుల్ల ముట్టిస్తానండీ.. మీరు చదవనికాడికి నాకెందుకండీ అది' అన్నారు స్థిరసంకల్పంతో ప్రసన్న.

అంతే! విశ్వనాథ కోపం, చిరాకు పటాపంచలైపోయాయి. ఇంతలో లోపలినుంచి ఎవరో ఆ పుస్తకం తెచ్చారు. ఆయన దాన్ని తన చేతిలోకి తీసుకున్నారు. తాను చదవని కారణంగా ఓ కావ్యం అగ్గిపాలవుతుందని తెలుసుకుని ఆయన మనసు బాధగా మూలిగింది. పుస్తకాన్ని ఒకసారి అటూ ఇటూ తిరగేసి సరే రేపు సాయంత్రం రా. ఈలోపు చదువుతాను' అన్నారు బుజ్జగిస్తున్నట్టు.

సరేనని ప్రసన్న కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయారు.

ఆ రాత్రి 'పృథ్వీ భాగవతం' ఆసాంతం చదివేశారాయన. అర్థరాత్రి వేళ ఇంట్లోవాళ్ళని కూడా లేపి ప్రసన్న బ్రహ్మాండంగా రాశాడని చెప్పారు.

'ఈ కావ్యం చదువుతుంటే... కొన్నిచోట్ల ఇతనంత బాగా రాయడం నావల్ల అవుతుందా' అనిపించిందని మెచ్చుకున్నారు తమ దగ్గరబంధువు లక్ష్మీనారాయణ వద్ద.

మర్నాడు రమ్మన్న వేళకు ప్రసన్నకవి వచ్చారు బెరుకుబెరుగ్గా.

అతన్ని సాదరంగా ఆహ్వానించి అభినందనల వర్షం కురిపించారు విశ్వనాథ.

ఆ సమయానికి లక్ష్మీనారాయణ అక్కడే వున్నారు. 'మా అందరికీ రాత్రంతా మీ కావ్యం గురించే చెప్పారు మాష్టారు. ఇంతకీ దీన్ని ఎవరికి అంకితం ఇద్దామనుకుంటున్నారు?' అనడిగారు లక్ష్మీనారాయణ.

'మానవమాత్రులెవరికీ అంకితం ఇవ్వ

నండి' అన్నాడు ప్రసన్న.

సత్యనారాయణగారు, లక్ష్మీనారాయణ కూడా ప్రసన్న సమాధానానికి ఖంగుతిన్నారు. ముఖముఖాలు చూసుకున్నారు.

లక్ష్మీనారాయణ 'అదికాదయ్యా నువ్వు అంకితమిస్తే మాష్టారు తీసుకుందామనుకున్నారు. నువ్వు మానవ మాత్రులెవరికీ అంకితం ఇవ్వనంటున్నావాయె' అన్నారు.

విశ్వనాథ మౌనంగా అతనేం చెబుతాడా అని ప్రసన్న ముఖంలోకి చూశారు.

'మాస్టార్ని ఎప్పుడైనా నేను మానవమాత్రులుగా చూశానా? కనీసం అనుకున్నానా' అంటూ బోరునపడుస్తూ విశ్వనాథ పాదాలపై వాలిపోయారు ప్రసన్న. ఆయన ఆప్యాయంగా లేవనెత్తారు. విచిత్రమేమంటే వర్ణాశ్రమ ధర్మాలు నమ్మే విశ్వనాథ ఆ హరిజన కవిని అక్కున చేర్చుకున్నారు. ప్రతిభ ఎక్కడున్నా ఆయన దాన్ని ఆదరించేవారని చెప్పడానికి ఇది మరో మచ్చుతునక.

తర్వాత 'పృథ్వీ భాగవతం' విశ్వనాథకే అంకితమిచ్చారు ప్రసన్న అత్యంత గౌరవాభిమానాలతో. ఆయన సాదరంగా అంకితం తీసుకున్నారు.

ఆనాటి సభలో ప్రసన్నకవి 'మా గురువుగారు ఆంధ్రప్రదేశ్ పభుత్వ ఆస్థాన కవి.. అయితే నేను వారి ఆస్థానకవిని' అని వేదికమీద సగర్వంగాప్రకటించుకున్నారు.

అలాంటిదే ఇంకోటి-

ఓ రోజున విశ్వనాథ వద్దకు బాబూరావు, కాశీ అనే ఇద్దరు సోదరులు వచ్చారు. కాశీ తన సోదరుడు బాబూరావు 'గంగావతరణం' అనే పద్య కావ్యాన్ని రాసాడని - చదివి అభిప్రాయం చెప్పాలనీ కోరాడు.

విశ్వనాథ సుముఖంగా లేరు. 'నేను చదివి అభిప్రాయం చెప్పడానికి చాలా రోజులు పడుతుందయ్యా' అన్నారు.

కాశీ వినయంగా 'మీరు ఒక గంట సమయం ఇప్పించండి చాలు. మా బాబూరావే వినిపిస్తాడు తమకు' అన్నారు.

'వ్రాతప్రతి చదువుతాడా! అన్నారాయన.

'చదవడండి.. పుస్తకం చూడకుండానే గంగావతరణం ఆసాంతం ఆలపిస్తాడు' అన్నారు కాశీ.

ఒక్కసారి ఇద్దరినీ పరికించి, 'గంటసేపు కూర్చోగలనో లేనో చెప్పలేను. సరే చదవవయ్యా. కవి ముఖస్త వినడం అదో పద్ధతి' అంటూ ఆయన గంగావతరణం వినడానికి సిద్ధమయ్యారు.

బాబూరావు గొంతు సవరించుకుని బెరుకు బెరుగ్గానే పాడసాగాడు.

గంగావతరణం బాబూరావూ, కాశీ కూడా పుస్తకం చూడకుండా ఆలపించగలరు.

పది నిముషాలు పాడిన తరువాత బాబూరావు ఆగాడు.

విశ్వనాథ కళ్లు మూసుకొని వింటున్నారు. కళ్లు తెరవకుండానే, 'వింటున్నాను. నువ్వు ఆపకు... చదువు' అన్నా

రాయన వారికొచ్చిన అనుమానం గ్రహించి.

బాబూరావు ద్విగుణీకృత ఉత్సాహంతో మళ్లీ మొదలుపెట్టి ఆసాంతం గంగావతరణం పాడి కవిసమ్రాట్‌కి వినిపించాడు.

విశ్వనాథ బాబూరావును అభినందన పూర్వకంగా చూస్తూ, 'నే వినడానికి బద్ధకించినా, చదవలేకపోయినా ఒక మంచి కావ్యాన్ని వినలేకపోయేవాడ్ని, చదవలేకపోయేవాడ్ని. చాలా బాగా రాసావయ్యా! నేను రాసినా ఇంతకంటే బాగా రాయలేనేమో' అంటూ లోపలికి వెళ్లి ఓ శాలువా తెచ్చి బాబూరావుకి కప్పి సాగనంపారు.

బాబూరావు, కాశీల ఆనందానికి అవధులు లేవు.

ఆ. బాబూరావే నేటి ప్రముఖ స్వరకర్త, సినీ సంగీత దర్శకుడు అయిన కీరవాణి తండ్రి 'శివశక్తి దత్త'. ఈయన కవి, కథకుడు, దర్శకుడు, మంచి చిత్రకారుడూ కూడాను.

ప్రముఖ కవి గుంటూరు శేషేంద్రశర్మ ఎంత ఆధునికుడో.. విశ్వనాథ అంత సనాతనుడన్న విషయం అందరికీ తెలిసిందే. కానీ విశ్వనాథంటే శేషేన్‌కు అత్యంత అభిమానం.. గౌరవం. విశ్వనాథకూ శేషేన్ అంటే అపరిమిత వాత్సల్యం. ఓసారి ఏదో తనధోరణిలో ఓ కావ్యం రాసి తీసుకెళ్లి విశ్వనాథకు చూపారు శేషేన్. చదివి ముందు మాట రాయమని అభ్యర్థించారు.

'మీ కుర్రాళ్లకెంతసేపూ నెత్తురు, కష్టాలు, కన్నీళ్లు, పేదలు.. ఇవేకదా కవితావస్తువులు.. చూద్దాంలే ఇచ్చెళ్లు' అన్నారు విశ్వనాథ తన ధోరణిలో పెడసరంగా.

పదిరోజులు గడిచింది.. నెలరోజులు గడిచింది.. రేపు మాపు అంటూ విశ్వనాథ వాయిదాల మీద వాయిదాలు వేస్తున్నారు.

రెండు నెలలు గడిచింది.. ఈ జాప్యాన్ని శేషేంద్ర భరించలేకపోయారు. ఓరోజున విశ్వనాథ వద్దకు వెళ్లి 'మీ ముందుమాటా వద్దు.. అభిప్రాయమూ వద్దు.. నా పుస్తకం నాకు పడేయండి' అంటూ అడిగారు.

'ఫో తీసుకుపో... నీ పుస్తకం నేనేం చేసుకుంటాను?' అంటూ అంతే తీవ్రంగా విశ్వనాథ దాన్ని తిరిగిచ్చేశారు.

శేషేంద్ర ఇంటికి వచ్చి చూసుకుంటే అందులో తన కవిత్వాన్ని మెచ్చుకుంటూ కావ్యప్రాశస్త్యాన్ని విపులంగా చర్చిస్తూ విశ్వనాథ రాసిన ముందుమాట కాగితం కన్పించింది. ఇదీ ఆయన పద్ధతి. తనకిష్టంలేని కావ్యవస్తువునైనా అందులో సత్తా ఉంటే నెత్తినపెట్టుకోవడం ఆయన ఫిలాసఫీ.

ఇలా విశ్వనాథ గురించి ఎన్నో సంఘటనలు రాయొచ్చు. అన్నీ కుతూహలంగానే ఉంటాయి. ఆసక్తిగానూ ఉంటాయి.

ఆయన తాను నమ్మింది రాయడానికి భయపడని మనిషి. ఆయన పద్ధతిలో ఆయనకో నిబద్ధత వుంది.

వర్ణాశ్రమ ధర్మాలపై నమ్మకం గలవాడు. మడి.. తడి, ఆచారాలు గలవాడు, ఛాందసుడు అని కొందరంటూంటారు. అన్నీ నిజమే ఎవరి నమ్మకాలు వారివి. ఒకరి నమ్మకాలను ఒకరు గౌరవించుకోవడం కూడా ఓ నమ్మకం. అదే సంస్కారం. విశ్వనాథ వ్యక్తిత్వాన్ని, వ్యక్తినీ అర్థం చేసుకోవాలంటే ప్రారంభం నుంచీ ఆయన రచనల్ని విశ్లేషనాత్మకంగా, చివరిదాకా చదివితే ఆయన పరిణత చెందిన పరిపూర్ణ వ్యక్తిగా ద్యోతకమౌతుంది.

మంచిమనిషి - మానవతావాది - వితరణశీలి - కర్మిష్టి- కవిసమ్రాట్ విశ్వనాథ అని ఆయనను పూర్తిగా తెలిసినవారు కొనియాడతారు.

– సి.ఎస్.రావు

## కప్పగారి విన్యాసం

యూరప్ ఖండంలో చెట్లమీద నివసించే ఒక రకం కప్ప ఇది. ఈ చిత్రంలో వెనక కాళ్ల మీద పైకి ఎగబాకి, సమీపంలోని పూలగుత్తి మీదున్న కీటకాన్ని ఒడుపుగా పట్టుకుంటోంది. కదలికల్లో వేగం మీద కాకుండా నాలుక శక్తి మీద ఆధారపడి ఈ కప్పలు ఆహారాన్ని సంపాదిస్తాయి.



## ఆగస్టుచతుర నవల 'జీవనశోధన' పై పాఠకుల సమీక్షలు

### సమతూకం

రూ. 100/- పొందిన సమీక్ష

ఆధ్యాత్మికత, నమ్మకాలు, సైన్స్ టెంపర్, హేతువాద దృక్పథాలను చర్చిస్తూ 'జీవన శోధన' సాగించిన శ్రీఉదయిని రెండు ఓడలపై కాళ్లుంచినా... బ్యాలెన్స్ తప్పకుండా సమర్థంగా మధించారు. నవలల పోటీలో దీనికి మూడో బహుమతి లభించడం ముదావహమే. నవలలో నాయిక, నాయకులు... గీత, యోగిల నడవడిక రమ్యంగా, గంభీరంగా ఉంది.. కథలో ఒకే కుటుంబంలో మనుషుల మనస్తత్వాలు భిన్నంగా ఉన్నా కుటుంబవ్యవస్థ ఛిన్నాభిన్నం కాకుండా రచయిత జాగ్రత్తపడటం అభినందనీయం. దేవుడ్ని నమ్మని తండ్రి రాఘవ, పూజల్లో లీనమయ్యే తల్లి జయ.. వెరసి బాల్యం నుంచే రెండు జీవన విధానాలనూ చూస్తూ పెరిగిన గీత, ఆ తర్వాత భర్త యోగి రేషనలిజాన్నీ అలవోకగా భరిస్తూనే, తన అభిరుచులకూ భంగం వాటిల్లకుండా సంసార రథాన్ని ముందుకి నడిపించడం ఆకట్టుకుంటుంది.




రాఘవ.. మామూలు మనిషిలాగే తాగుడుకి, గుర్రపుపందేలకి బానిస కావటం నచ్చలేదు. రామర్ ప్రయోగాల గురించి పూర్తి విశ్లేషణయిస్తే బాగుండేది. నవలలో పొదుపుగా ఉన్న పాత్రలతోనే కథ లింకేజి సాగించటం బాగుంది. ఇందులో పాత్రలన్నీ ఆయా సన్నివేశాల్లో చురుగ్గానే కన్పిస్తాయి. గీత, వినాయక్‌ల సంభాషణలూ నవ్వులు పూయించాయి.

'ఐన్‌స్టీన్, న్యూటన్ సైన్స్‌లో ఎంతటి అంకిత భావంతో శ్రమించారో అదేస్థాయిలో మహనీయులు పడిన తపన, జిజ్ఞాసల ఫలితమే ఉపనిషత్తులు..' వ్యాఖ్య నవలకే 'హైలెట్'! పాఠకులు 'ఏవాదులైనా' ఇక్కడ బాగా ఆలోచనల్లో పడిపోవాల్సిందే. గీత, యోగిల ప్రేమ గాథ, పెళ్లి అంకాలలోని సాదాసీదత, డైరెక్ట్‌లైన్‌లు.. నచ్చాయి. అదే సమయంలో తార, రాజుల ప్రేమ ఓ పట్టాన అర్థం కాదు.

మిరకిల్స్, థర్మోడైనమిక్స్ రెండు నిజమే అనే రెండు పడవలలో కాళ్లుంచటం.. ఐన్‌స్టీన్ దృష్టిలో బతుకు కాకున్నా, ఈ సమాజంలో సింహభాగం ఆ కోవనే ఉందనటం నిజం. మేధావులు సైతం బాబాలు, జ్యోతిషాలను నమ్మటం చూస్తూనే ఉన్నాం.

యోగి తండ్రి రంగారావు మనస్తత్వం ఓ పట్టాన కొరుకుడు పడదు. 'స్థిత ప్రజ్ఞుడి'లాటి యోగి తండ్రి మరణాన్నీ, తనపై తండ్రి విరక్తిని జీర్ణించుకోలేక.. పిల్లాడిలా రోదించడం.. ప్రపంచంలో ఎంతటి కఠిన వాదులైనా రక్తసంబంధాలు, మానవబంధాలకు అతీతులు కారనే సత్యాన్ని స్పష్టం చేసింది. పత్రికా కార్యాలయంలో ఉద్యోగం, సినీఫీల్డు వెరసి నవలలో వివిధ జీవనోపాధుల్లోని కష్టనష్టాలు తెల్సుకునే వీలు కలుగుతుంది.

ఇక యోగిలాంటి ఆలోచనల యోగి., భార్య గీతకు కొసమెరుపుగా రొమాంటిక్ ఆలోచన చెప్పటం వినూత్న సుఖాంతంలా కన్పించి పాఠకులు హాయిగా ఊపిరి పీల్చుకునేలా చేస్తుంది. చతురకు, శ్రీఉదయినికి అభినందనలు.

**– ఎమ్. లక్ష్మి, కరంజి(టి), ఆదిలాబాద్‌జిల్లా**

### విలక్షణ రచన

రూ. 75/- పొందిన సమీక్ష

ఎప్పుడూ విభిన్న కథాంశాల ప్రచురణలో అగ్రస్థానం వహించే 'చతుర' ఈసారి 'జీవనశోధన' నవలద్వారా మరోసారి విలక్షణత చాటుకుంది. సగటు పాఠకుడి స్థాయికి కొంత పైస్థాయిలోనే నవలా రచన ఆద్యంతమూ సాగింది. జీవితంలో ఎన్ని ఒడిదుడుకు లెదురైనా, మొక్కవోని ఆత్మవిశ్వాసంతో, తాను నమ్మిన జీవితపంథానే ఆచరించే యోగి పాత్ర విలక్షణంగా చిత్రితమైంది. యోగిలాంటి వారు నూటికో కోటికో ఒకరు ఉంటారు ఈ లోకంలో. నవలలో అధిక

శాతం, సైన్సుకు, ఆధ్యాత్మికతకు నడుమ నిత్యం జరిగే సంఘర్షణే చోటుచేసుకున్నా, ఆయా సన్ని వేశాలన్నీ ఆసక్తికరంగానే కాక ఆలోచనలు రేకె త్తించేలా ఉండడం, మెచ్చుకోదగిన విషయం. నిజానికి సైన్సు, ఆధ్యాత్మికత అనే రెండు రంగా లకు సంబంధించి ఎవరెవరి మనస్సాక్షి ననుస రించి వారు పోవాలే తప్ప ఆ రెంటిలో ఫలానది మాత్రమే ఆచరణయోగ్యం అన్నది ఎప్పటికీ తేలని విషయం. దానిని గ్రహించలేకే, జయ, రాఘవ జీవితంలో మనశ్శాంతిని కోల్పోయారు.

ఈ నవలలో కథానాయకుడు 'యోగి' పాత్ర ఒక ఎత్తు అయితే, ఆద్యంతమూ అతడి 'సైంటి ఫిక్ టెంపర్‌మెంట్'ను అత్యంత సహనంతో భరించిన 'గీత' పాత్ర మరొక ఎత్తు. నిజంగా అసలు సూత్రధారి గీతే. అడుగడుగునా అండదం డలు అందిస్తూ, తెగిన గాలిపటం లాంటి యోగి జీవితాన్ని ఒక గమ్యానికి చేర్చడంలో ఆమె పాత్ర శ్లాఘనీయం. గీత స్థానంలో, ఏ సగటు ఆడది ఉన్నా, వారి వివాహబంధం విచ్ఛిన్నం కావడానికి మూడునాళ్ళు పట్టదు. ఎంతో ఓర్పుగా, యోగి భావాలని సంయమనంతో అర్థంచేసుకొంటూ తమ ఇద్దరి జీవితాలనూ చక్కగా మలచుకొంది గీత. 'వీడు జీవితంలో చేసిన మంచిపని, ఈ అమ్మాయితో స్నేహం చేయడం' అన్న రంగా రావు మాటని అక్షరాల నిజం చేసింది.

ఇక రంగారావు పాత్ర, కొడుకును తనకు నచ్చిన మార్గంలో పెంచలేని అశక్తుడుగా, పాఠకు లను కదిలించినా 'యోగి'ని శిక్షించిన తీరు చాలా అన్యాయమనిపించింది. అదే పొరపాటు పునరావృతం కాకుండా, యోగి 'గుడ్‌ఫాదర్'గా మారదలుచుకోవటం నవలకు కొసమెరుపు. 'జీవన శోధన' పేరు, నవలకు అతికినట్లు సరిపో యింది. మొత్తానికి చాలా కాలానికి, ఒక విలక్ష ణమైన నవల చదివామన్న తృప్తి కలిగింది.

*– టి. శారద, గూడూరు*

## సమగ్ర పాఠ్యగ్రంథం

**రూ. 50/– పొందిన సమీక్ష**

'శ్రీ ఉదయిని' గారి 'జీవన శోధన' హేతు వాదానికి, ఆస్తిక భావాలకు నడుమ సంఘర్షణ! ఆ సందర్భాలను పురస్కరించుకొని ప్రస్తావించిన సంఘటనలు మహామహుల అభిప్రాయాలు, కొటేషన్‌లు, ఎన్నో తెలీని కొత్త విషయాలు తెలి యజేశాయి. ఇదొక నవలగా కాక వివిధ అంశాల సహితమైన సమగ్ర పాఠ్యగ్రంథంలా స్ఫురిస్తుంది. చాలా తరచుగా ఒక నవలలోని విశిష్టమైన మలుపులతో ఉత్కంఠ పెంచే కథా సంవిధానం కన్నా, ఉదాత్తమైన లక్షణాలు, ఉన్నత వ్యక్తిత్వంగల పాత్రలే ఎక్కువగా స్పందిం పచేస్తాయి. మనసులో దీర్ఘకాలం నిలిచిపో తాయి. ఈ నవలలో కీలకమైన మలుపులు లేకున్నా, ఆద్యంతమూ ఆసక్తి కలిగించే పాత్రలు యోగి, గీతలు! తనకు కలిగిన ప్రతి సందేహానికి తార్కికమైన సమాధానం వచ్చేంతవరకు సహేతు కమైన వాదనతో చర్చించడం యోగి నైజం! 'ఇది సాంకేతిక యుగమని స్పష్టమైంది కనుక ప్రతిదీ శాస్త్రీయ దృక్పథం ప్రకారం జరగడమే ప్రాకృతిక ధర్మం' అని గాఢంగా విశ్వసిస్తాడు. ఆ విషయంలో ఎవరు విభేదించినా పిడివాదనకు దిగక, సవ్యమైన దృష్టాంతాలతో సహేతుక వివ రణలతో స్పష్టం చేస్తాడు. ఎలాంటి మూఢనమ్మ కాలకు, వికారాలకు లోనుకాని హేతువాది. ఇక గీత! వివిధ విషయాలపై నిర్దిష్టమైన అభిప్రా యాలు ఏర్పరచుకొని, ఎప్పటికప్పుడు విభిన్నమైన భావాలు కల తన తల్లినీ తండ్రినీ సాంత్వనప రుస్తూ ఎలాంటి భేషజాలకు తానివ్వక అందరితో సున్నితంగా, వినమ్రతతో వ్యవహరించడం ఆమె స్వభావం! పలు సందర్భాలలో ఈ పాత్రలు వ్యవహరించిన తీరు అమోఘం. దాదాపు ప్రతి సన్నివేశంలోనూ సున్నితమైన చమత్కార సంభా షణలతో, సునిశితమైన హాస్యోక్తులతో మనసుకు గిలిగింతలు పెడుతూ నవల ఆద్యంతమూ రసవ త్తరంగా సాగుతుంది. ఇహ మిగతా విలక్షణమైన పాత్రలు రాఘవ, రంగారావులు. హేతువాద భావాలు కలిగిన రాఘవ పాత్ర మొదట పూర్తి ఆసక్తినీ ఆకర్షణనూ కలిగిస్తుంది. తర్వాత పుత్ర శోకాన్ని, భార్య తిరస్కారాన్ని మరిచేందుకు, గుర్రపు పందాలు, తాగుడు వ్యసనాలని ఆశ్రయి స్తుంది. పోతే రంగారావు, అతని భావాలు సనా తనంగా కన్పించినా వాటికి మూఢవిశ్వాసాల ఆచ్ఛాదన లేదు. ఏమైనా పదే పదే చదవాలనిపిం చేంత అత్యంత రసవత్తరంగా మలిచిన రచయిత లిరువురికీ హేట్సాఫ్!!

**–ఆడెపు మాధవీలత,**
చింతగట్టు, వరంగల్ జిల్లా

## యువతకు ఆదర్శం

రూ. 50/- పొందిన సమీక్ష

'జీవన శోధన' నవలలో అడుగడుగున కొత్తదనం కన్పించింది. ప్రేమాభిమానాలు, నమ్మకాలు, అపనమ్మకాలను, చక్కని భావవ్యక్తీకరణ ద్వారా తెలియచెప్పారు. గీత తల్లి భక్తురాలయినా, తండ్రి నాస్తికుడైనా వారి సంసారానికి, సహజీవనానికీ, ఇవేమీ అడ్డుగోడలు కాలేకపోయాయి. తల్లి జయ భక్తితత్వం గీతకొచ్చినా, తండ్రికి కూతురంటే ప్రత్యేక అభిమానం ఉండడం విశేషమే! కాని ఒకసారి 'లేని దేవుడికి పూజలెందుక'ని అడగడంద్వారా గీత మాటల్లోని పదునూ కనిపిస్తుంది. ప్రమాదవశాత్తు కొడుకు మరణం, గీత తండ్రిని, వ్యసనాల బారిన పడేస్తే, తండ్రిపై కక్ష సాధింపుగా తల్లి గుడీ గోపురాలకు వెళ్లటం అలవాటు చేసుకోవటం.. వంటివి గమ్మత్తుగా అనిపిస్తాయి. రామర్ ప్రయోగం, వినాయకుడు పాలుత్రాగటం వంటివి ఫోకస్ చేయడంలో రచయితలు కృతకృత్యులయ్యారు. అనుకోకుండా యోగి, గీతకు దగ్గరవ్వటం, యోగి విభిన్నమైన ప్రవర్తన, గీత ఆత్మాభిమానం కాపాడుకునే పంతంలో పాఠకులకు సినిమాల్లో హీరోహీరోయిన్లను గుర్తుకు తెస్తారు. యోగికీ, అతని తండ్రికీ మధ్య జరిగే అంతర్యుద్ధం పరాకాష్టకుచేరి, యోగి తండ్రి కొడుకును విడిచి, సుదూరంగా కాశీకి వెళ్లిపోతాడు. తాను యాత్రలకు వెళ్తున్నానని- కొడుకును కోడల్ని రావద్దని తిరస్కరించే సంఘటనలు వంటివి, యోగి మానసిక సంఘర్షణ పరితలను కన్నీళ్ల పర్యంతం చేస్తాయి. అయితే చివరికి ఎందుకూ పనికిరాడన్న తండ్రి మనోగతానికి విరుద్ధంగా యోగి అనుకున్న లక్ష్యం చేరుకోవటం నేటి సమాజంలో విజయశిఖరాలు చేరుకోవాలనుకునే వారందరికీ ఆదర్శం. లక్ష్యసాధనకు వివాహం ఏమాత్రం అడ్డుకాదని మహా అయితే పిల్లలను కనే విషయం కాస్త వాయిదా వేసుకోవాలని, సునిశితంగా, క్రియాపూర్వకంగా గీత-యోగిలు నిరూపించడం కొసమెరుపు!!

**– నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం టౌన్**

## పెద్దలకంటే పిన్నలే నయం

రూ. 50/- పొందిన సమీక్ష

ఆలోచనాత్మకమైన కథా విధానంతో, అద్భుతమైన పాత్ర చిత్రణతో, ఆకట్టుకునే సంభాషణలతో, విశ్లేషణాత్మక చర్చలతో సాగిన గొప్ప నవల 'జీవనశోధన'. స్వతంత్ర భావాలు గల కొడుకుపై తండ్రికి కోపం. సంప్రదాయ రీతులను గౌరవించే తండ్రికి ఎదురు తిరగడం ఆ కొడుకుకు అలవాటు. ఎవరి పరిధిలో వాళ్లు కరెక్టే. ఒకరినొకరు అర్థం చేసుకోవడంలో వాళ్లు పొరపాటు పడ్డారు. ఇంకా కొడుకే ఒక అడుగు తగ్గి, తను తండ్రిని సరిగా అర్థం చేసుకోలేదనుకున్నాడేమో అనిపిస్తుంది. తండ్రి మాత్రం పట్టు విడువక కొడుకు పెళ్ళికి కూడా హాజరు కాడు. ఇల్లు వదలి ఆశ్రమంలో చేరతాడు. ఆఖరికి తన మరణవార్త కూడా కొడుకుకు ఆలస్యంగా చేరేలా ఏర్పాటు చేస్తాడు. పెద్దవాళ్ళకంటే చిన్నవాళ్లే పంతాలూ పట్టింపులూ వదులుకుంటారేమో ననిపిస్తుంది ఈ నవల చదువుతూంటే. కానీ యోగి చివరికి ఒక మాట అంటాడు. 'కొడుకుగా ఫ్లాప్ అయ్యాను కదా, ఎట్ లీస్ట్ తండ్రిగా హిట్ అవ్వాలని ఉంది' అని. రచయిత(త్రి)లను అభినందిస్తూ ఒక కోరిక. యోగి తండ్రిగా ఎలా హిట్ అవుతాడో మరో నవల వ్రాస్తే చదవాలని ఉంది. అద్భుతమైన జీవన శోధన అందించినందుకు 'చతుర'కూ శ్రీ ఉదయినిగారికీ అభినందనలు!!

**– భాస్కర స్వర్ణాంబ, తిరుపతి**

---

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

## వారెవ్వా!

### బాతు.. కవాతు

బుడిబుడి నడకలతో తల్లిని అనుసరిస్తున్న ఈ బాతుపిల్లలు ఎంత ముచ్చటగా.. క్రమశిక్షణగా ఒకే వరుసలో పోతున్నాయో అని హాశ్చర్య పోతున్నారా? ఇవి ఎయిడర్ అనే సముద్ర బాతు పిల్లలు. తల్లిబాతు ఎంతో నేర్పుతో.. జాగ్రత్తగా తన పిల్లలను తీసుకుపోతోందో చూశా రుగదా? ఆఫ్టరాల్, పక్షులే అంత పద్ధతిగా ఉంటే ఇక మనుషులెంత క్రమశిక్షణగా ఉండాలో అనుకుంటున్నారు కదూ!?



